శ్రీరస్తు.

# జగద్గురుచరిత్రము

అను

## శంకరవిజయము.

1649

★

కవిసార్వభౌమ

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతము

★

రాజమహేంద్రవరము

కాపీరైటు రిజిష్టర్డు]    1954    [వెల రు. 3-0-0



కృతిభర్త:

శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు

ఆలమూరు.

# పీఠిక

(శ్రీ విద్యావిభూషణ జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ.)

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు జగద్గురుచరిత్ర మను పేర శ్రీశంకరాచార్యులవారి సచ్చరిత్రను పద్య కావ్యముగా రచించి ఆంధ్రభాషాయోష కొక యమూల్యభూష నొనగూర్చినారు. గణనాతీతమైన తెనుగ్రంథతతికి నూతనమైన పెంపును గూర్చినారు. పురాణములు, చరిత్రములు, ప్రబంధములు, నాటకములు, విమర్శలు, అవి యివి యన నేల ?—సకలవిధ సారస్వతాంగములును శాస్త్రిగారివిహారభూములు......వారు మెట్టనిసాహితీరంగము లేదు. వారు మీటినఁ బలుకని కవితావీణ లేదు. వారు సిద్ధహస్తులు. ఏయాంధ్రకవికంటెను హెచ్చుగా కవితాసృష్టి గావించినట్టి లని శాస్త్రిగారు ప్రస్తుతింపఁ బడుచున్నారు.

పాఠకుల మెప్పు నందఁదగులక్షణములు ప్రకృతగ్రంథమున నెట్లున్నవో తెలుపుటకై వచ్చునకుఁ గొన్ని యంశముల నిం దెత్తి కొందును. అమృతహస్తుఁ డైనకవిచేతిలోఁ బడినప్పుడు శంకరుఁ డెట్లు రాణింపవలయునో యారీతిగా నీకావ్యములో రాణించుచున్నాఁడు. ఇం దన్ని ఘట్టములు ఆచార్యుని మన కొక మాధుర్యమూర్తిగాఁ బ్రదర్శించుచున్నవి. మొదటినుండి చివరవఱకు నీమాధుర్యమూర్తినిఁ బ్రదర్శించుటలో శాస్త్రిగారు జాగరూకతను వహించినారు. శాస్త్రిగారు ప్రదర్శించినశంకరుఁడు త్యాగి, యోగి, విరాగి, పరోపకారపరాయణుఁడు, ఇట్టికావ్యములలోని నాయకుఁడు పాఠకుని హృదయములో ముద్రితుఁడు కావలయునన్నచో నాయకలక్షణములు మెలకువతో మేళవింపఁ జేయఁ బడవలయును శాస్త్రిగారిశంకరునిలో శత్రుదుర్నిరీక్షత్వము, ప్రచండవాద వైదగ్ధ్యము మున్నగులక్షణములు గాక లోకోద్ధరణశక్తి, కారుణ్యదృష్టి మున్నగు లక్షణములే పరిస్ఫుటముగా నున్నవి. విపులమైనమూలగ్రంథమునుండి యేయంశములను ఘట్టములను వీడి యేయేయంశముల నందుండి గూర్చిన తననాయకుఁడు సాంకర్యము లేని యొకమాధుర్యమూర్తిగా నిలుచునో వానిని వీడుటయుఁ గూర్చుటయు సామాన్య కవికి సాధ్యము కాదు.

శంకరవిజయాదిగ్రంథములలోని కథాభాగములను గొన్నిటిని వీడుటయు, మార్చుటయు, అందు లేనికొన్నింటిని జేర్చుటయు నీగ్రంథమునఁ గన్పట్టును. కావ్యముయొక్క ప్రమాణము పరిమిత మగుటవలనను, నాయకపాత్రపోషణాదుల కవశ్యము లైనమార్పులను మూలకథలోఁ జేయకుండుట కవితాశిల్పమునకు లోటగుటచేతను గొన్నిటిని దీసివైచుటయు, సంస్కరించుటయుఁ దప్పనిసరి యగును. అట్లే రసము, పాత్రపోషణము మున్నగువానిని నిర్వహించుటకై కొన్ని నూతనాంశములను జేర్పవలసియుండును. నన్నయనుండి నేటివఱకుఁ గలమహాకవు లనుసరించినమార్గమునే మన శాస్త్రిగా రనుసరించినారు. కాని యిందు నూతనముగా సమర్థించుకొనవలసిన దేదియును లేదు.

శాస్త్రిగారు శంకరుని బరమకారుణికమూర్తిగా వర్ణించియున్నారు. దయావీరునిగా మన కీనాయకుని గన్పఱచుటలో శాస్త్రిగారు చూపినప్రతిభ మిక్కిలి ప్రశంసనీయము. శంకరాచార్యునివంటిజ్ఞాని విషయములో శాంతరసము ప్రధానముగా నుండవలయు నని కొందఱు భావింప వచ్చును కాని యది సరికాదు. శంకరుఁడు బ్రహ్మజ్ఞానార్థము జీవిత మంతయు సాధనచేసి చివఱకు సిద్ధిని సంపాదించుకొన్నవ్యక్తియైనచో శాంతరసము ప్రధానముకావలసియుండును. కాని శంకరుఁడు సహజజ్ఞానసంపన్నుఁడు. దుఃఖతప్తమైనలోకము నుద్ధరించుటకై యాయనజీవిత మంకితమైనది. దుఃఖతప్తలోకముపట్ల కారుణ్యమే శంకరునిభౌతికదేహమునకు నైనప్రాణము.

దయావీరరసము చిప్పిలుఘట్టము లీగ్రంథమునఁ బెక్కులు గలవు. ఇ[illegible]ములు దీనినాచ్ఛాదితము గావింపకుండునట్లు నిర్వహణ గావింపఁబడినది. ఆమలకస్తుత్యాదులను శాస్త్రిగారు పట్టిపట్టి రచించినారు. బ్రహ్మచారికి భిక్ష నిడుటకు నింట తండులములులేక యలమటించుచున్నయిల్లాలి నుద్ధరించుటకై శంకరుఁ డడిగి యడిగి యామలకమును లాగికొనుటయు, నద్దాని భిక్షామిషగాఁ గొని సంతుష్టచిత్తముతో లక్ష్మిదేవి నచ్చుటనే స్తుతించి యయ్యువిదయింట స్వర్ణవృష్టిని గురిపించుటయు బహురమ్యముగా వర్ణింపఁబడినవి. ఈఘట్టము గ్రంథములోనిక్కల మేటిదైయు నేటివిద్యార్థులపాఠపుస్తకములలోని కవశ్యముగా నెక్కింప వలసియున్నది. శంకరుఁడు విప్రబాలుని బ్రదికించుటయు మూకుని వాచాలుని గావించుటయు మున్నగుసందర్భములు మిక్కిలి హృద్యములుగా రచింపఁబడినవి. కాపాలికుఁడు వచ్చి తాను గావించుభైరవార్చనకై శంకరునిశిరము నర్థింపగా శంకరుఁడు శిరస్సును దత్తము చేసినతెఱంగును, వానిని దనశిష్యులు హింసింతు రేమో యనుభీతిచే వానికిఁ దప్పుకొనిపోవునుపాయమును హృదయపూర్వకముగాఁ జెప్పుటయుఁ గూడ దయారసప్రపూర్ణములుగా నున్నవి.

"ఇంద్రాదు లర్థింప నింతమాత్రములో దధీచి శరీరాస్థు లీచి యిడఁడె
శిబి డేగకోరికి చెల్లంగఁ దనమేని నెఱచి యంతయుఁ గోసి యిడఁడె మున్ను"

ఇత్యాదిశ్రేణిలోఁ జేరఁ దగినశంకరునిదానవృత్తాంతము శంకరుని దానశూరాగ్రేసరులలోఁ జేర్పఁ గలదు.

వైదికధర్మరక్షణకై తుషాగ్నిలోఁ బ్రాణత్యాగము చేసినకుమారిలభట్టుయొక్క ధర్మవీరమును, శంకరునిదయావీరమును, బ్రక్కప్రక్కలఁ బెట్టి కవిసార్వభౌములు మనలను గంగాయమునాసంగమములో స్నానము చేయించినారు.

పాత్రపోషణమునను రసవిన్యాసమునను శాస్త్రిగారు కనపఱచినరీతికిఁ దోడుగా నిందలివర్ణనలను, పదప్రయోగములను, జూతుమేని మనకిందలికవితాప్రాశస్త్యము సువ్యక్త మగును. ఇందలి ఋతువర్ణనములు, పురవర్ణనములు, ఉదాత్తములై యుండును

ప్రబంధోచితములుగ నున్నవి. రసభావానుగుణ మైనపదగుంఫనముతో నెల్లెడల రచన సాగినది. మొసలిని వర్ణించుతఱిని శాస్త్రిగారు గావించిన "ఖరనఖరంబుల గట్టిపాటిన యట్టిపొట్టికాళులు గాల్గు దిట్టపడగ" ఇత్యాది పదప్రయోగ మాలంకారికులు తాదృశ సందర్భమునకు నిర్దేశించినరీతి ననుసరించియున్నది. ఇట్లే యెల్లయెడలను రీతి, వృత్తి, వైభవము చూపట్టుచున్నది. ఉపమారూపక పరిణామాద్యలంకారములు గ్రంథమును సుకుమారముగ నలంకరించుచున్నవి.

"ఆమొయందుఁ గుమారుల గాద్వరఁ గనె, వలువ వాక్కున మహాస్త్రములఁ గనినటు"

ఇది యెంతధ్వనిశోభితోపమాలంకారమో పాఠకులు విచారించుకొనవచ్చును.

"జలదధ్వానము మర్దలధ్వనులుగా శంపాలతల్ గుఱ్ఱులూ
జ్జ్వలకీలమ్ములుగాఁ బ్రవర్షరతి భాస్వద్వాద్యజాలమ్ము గా
నలిఝుంకృతనాద మున్నతగతిన్ వ్యాపించుగీతమ్ము గా
నలిపెన్ నృత్యము కేకిలోక మెపుడున్ షడ్జంబునం బాడుచున్."

ఇందలి పరిణామాలంకార మెంతయుఁ గమనీయము. శరదృతుప్రారంభమున మేఘములు (ఉదారపురుషులవలె) తనుజీవనమును (నీటిని ప్రాణమువంటిదానిని) లోకమున కర్పించి వైరాగ్యము చెందినపురుషులు తమసతులను వీడి సన్యసించునట్లే మెఱుపు తీగలను విడిచి వెడలిపోవుచున్నది. (ప్రవ్రజించుచున్నవి) అనునర్థము నిచ్చునీక్రింది పద్యములోనిరూపకము మిక్కిలి మనోహరము.

"సురుచిరసంభృత మగుచున్, వరలెడుజీవనము ద్విజగణముల కిడి మొగుల్
మెఱుపునెలంతల విడి చెచ్చెర దివిగృహామోఁగి ప్రవ్రజించెడుఁ గంటే."

"ఆడఁజనుతీర్థ మెదురైన యట్లు" మున్నగు జాతీయప్రయోగములే కాక నెక్కుడు ప్రౌఢప్రయోగములు నిందుఁ జూపట్టును. "కలిపురుషుఁడు—", సుమార్గ మందు ముండ్లకంపలను గొట్టి ప్రజ నేఁచె గడుసువాటి" ఇది యెంతగడుసు పోకడ !! ఇట్టిపోకడ లీగ్రంథమున నెల్లయెడలఁ జూపట్టును.

ఈగ్రంథము కృతినొందిన శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు లోకోపకారార్థము తమసర్వశక్తులను ధారపోయుచున్న పురుషసింహుఁడు. ఈయన బహువిషయవేత్త, మహావక్త, సనాతనధర్మవిజ్ఞానభక్తుఁడు, పండితాభిమాని, ఉదారుఁడు, దాత, గుణజ్ఞుఁడు, ఈయన గావించినయసంఖ్యాకసుకృతములలో నెన్నదగినదిగ నేతత్కృతిస్వీకార మెంతయు వెలయఁ గలదు.

విజయవాడ
5–9–1954

ఇట్లు.
జటావల్లభుల పురుషోత్తము.

# విన్నపము

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అను వచనానుసారముగా ననేకావతారము లీభూతలంబున నుద్భూతము లయినవి. అందు రామకృష్ణావతారముల వలె శంకరావతార ముత్తమ మయినది. రామకృష్ణాదులు చేసినచేఁతలకన్న శంకరుఁడు చేసినచేఁతలు వేయిమడుంగు లెక్కువ యని కంఠోక్తిగాఁ జెప్పవచ్చును. రాముఁడు భార్యాపహర్త యగు రావణుం జంపెను. కృష్ణుఁడు తల్లిదండ్రులఁ జెఱం బెట్టినకంసునిం జంపెను. వామనుం డింద్రునికై బలి నుక్కడంచెను. నరసింహుఁడు హిరణ్యకశిపుం గూల్చెను. ఇవి ఘనకార్యములో? శంకరుఁడు చేసినవి ఘనకార్యములో? విచారింపుఁడు. ఈకలియుగములో జైనచార్వాకాదిమతములు చెలరేఁగి వైదికమతమును, వేద ధర్మములను జెడఁ జేయుచుండఁ దాను సామాన్యులయింటఁ బుట్టి చంపుటలు పంపుటలు లేక వాక్కులచేతనే దుర్జనుల జయించి భూతలంబున ధర్మసంస్థాపనము చేసె. ఇది సామాన్యము కాదు. మఱి యెంతవారును జేయఁ జాలరు.

శంకరచరిత్రముం జెప్పుగ్రంథములు కొన్ని కలవు గాని యవి పరస్పరభేదముం బొంది యున్నవి. మాధవాచార్యకృత మగుశంకరవిజయ మొకటి కల దది విద్యారణ్య మాధవకృతము కాదు. ఎవరో యభినవకాళిదాసుఁ డనునతఁడు రచించినది. దానియం దనేకదోషము లున్నవి. ఉత్తమప్రతిని సంపాదించి శంకరవిజయము రచింపవలయును నని చిన్నతనమునుండియు నాకు నభిప్రాయమే గాని కార్యము కొనసాఁగినది లేదు. ఈనడుమ నేదియో చదువుచుండ జగద్గురువు జ్ఞప్తికి వచ్చుటం జేసి లోఁగడ నే సంగ్రహించి యుంచినగ్రంథములును, మాతాతపాదులు నాకు బాల్యమునఁ జెప్పినచొప్పులను మఱికొన్ని యితరాధారములను సేకరించి తదేకదీక్షగాఁ బదిదినములలో సంగ్రహించి వ్రాసితిని. ముద్రితము లగుప్రతులలో శివగురువు మృతించినవెనుకనే జ్ఞాతులు శంకరున కుపనయనము చేసి నట్లున్నది. అట్లు గాక మాపితృపాదులవ్రాఁతలలో శివగురువే శంకరుఁ గాలమాసన్న మగు నని చతుర్థవర్షాంతముననే యుపనయనము చేసి గురుకులమునం జేర్చి నట్లును, శంకరుఁడే తండ్రి కుత్తరక్రియలు చేసినట్లు నున్నది. అట్లు జరిగినప్పుడే శివగురునితపస్సు ఫలించిన ట్లగును. అని నే నామూలము ననుసరించితిని. మఱియుఁ బార్వతి శంకరునికై కడపటఁ బ్రతీక్షించుట లోనగునుత్తమగాథ లిందుఁ బొందుపఱచితిని. శంకరునిమృతకళేబరము కాకులుం గ్రద్దలు ముట్టినట్లు గాకుండ కృష్ణునికళేబరమువలె నంతఁ గలసిపోయినట్లు వ్రాసితిని. ఇట్టున్న నాయీగ్రంథముం దిలకించి

మర్యాదాతిక్రమణ మని లోక మూహింప నొప్పదు. ఇప్పటి ముద్రితగ్రంథములే మర్యాదాతిక్రమణములు నసంగతము లని పెద్ద లూహింతురు గాక.

మఱియు రెండవయేఁడు సంవత్సరములవాఁడై శంకరుఁడు సర్వవిద్యలు, సర్వశిల్పములును దెలిసికొనం జాలినవాఁడై నప్పుడు సులభసాధ్య మగు స్త్రీకళం దెలిసికొనం జాలక నీచాతినీచ కార్యము (పరకాయప్రవేశము చేసి, రాజస్త్రీలతో సంభోగము) చేసె నని వ్రాయుటయు, మండనమిశ్రశంకరులు (బ్రహ్మదేవుఁడు పరమేశ్వరుఁడు) వా రొండొరులు లంజకొడుకు, లక్ష్మికొడుకు అని నీచతరముగాఁ దిట్టుకొని నట్లు వ్రాయుటయును మహాపాండిత్యము చేయుటయే యని నాతలంపు. ఇట్లు లోకపరిచయములు నసత్యము లగువానిని విడిచినది నాగ్రంథము. దీని నమూలక మని నన్ను గర్హింపక యథార్థపరీక్ష చేయుదురు గాక యని పెద్దలం బ్రార్థించుచున్నాను.

ఇట్లు జగద్గురు శంకరాచార్యచరిత్రము వ్రాసి దీని నుత్తమోత్తముం డగు నేపురుషుని కే నొసంగ వలయు నని తలంచుచు నుత్తమనాయకు నన్వేషించుచు నొక్కనాఁడు ఆలమూరుగ్రామవాస్తవ్యులు, పరోపకారపరాయణులు, వేదశాస్త్రప్రియులు, ధర్మరక్షకతత్పరులు నగు బ్రహ్మశ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు రాజమహేంద్రవరమునకు వచ్చియుండ వారిని దర్శించి శంకరవిజయప్రశంస తెచ్చితిని. అంత వారు దానిని నా కంకితము చేయుఁ డని కోరి నన్ను వారిగ్రామమునకుం దోడుకొని పోయి భోజనభాజనాదు లైనపదంపడి నూటపదియాఱురూప్యములతోఁ బుష్పఫలాదులతోఁ గ్రొత్తతాంబూల మొసంగి గ్రంథము ముద్రించుట కప్పుడే యేర్పాటు గావించిరి. నేను పరమానందభరితాంతరంగుండనై సత్యనారాయణమూర్తి కీగ్రంథ మంకితము చేసి సఫలీకృతమనోరథుఁడ నైతి నని విన్నవించుచున్నాను.

ఈనాగ్రంథమునకు ఆర్షవిద్యాభూషణ జటావల్లభుల పురుషోత్తమశాస్త్రిగారు నాకోరికిం జేసి పీఠిక వ్రాసి దయచేసిరి. దాని నిందుఁ బొందుపఱచితిని. దానివలన నాగ్రంథగుణాగుణములు లోకమునకుం దెలియఁ గల వని నమ్ముచు వారిపట్లఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి



# విషయసూచిక

•

శ్రీరస్తు

# జగద్గురు చరిత్రము

( అను )

## శంకర విజయము

— ఇష్టదేవతా ప్రార్థనాదికము —

శ్రీమద్భూమిధరాధినాథతనయాశ్లిష్టార్ధభాగో గణే
డారూఢాంకతలః కుమారకలితో గంగోత్తమాంగోజ్జ్వలః
పాయా చ్ఛ్రీనరసింహదేవరకుల క్షీరాబ్ధిరాకా కళా
నాథం వేంకటపేరిశాస్త్రితనయం శ్రీసత్యనారాయణమ్.

సీ. చిన్నారిముంగురుల్ చిందులు ద్రొక్కఁగ
నుదుట జాబిలిరేకఁ గదియఁ జేసి
మధుమదవివశయై మంజులవాగ్విలా
సము విస్తరిల్లంగ సలుపు కొనుచు
సదు గొందు తమ్మిపై నిడి రత్నపీఠము
నందు సుఖాసీన యగుచు నుండి
వీణ వాయించుచు గాణయై యెడ నెడఁ
జిలుకలపలుకులు చెవుల వినుచు
తే. కలువపేరు ధరించి కోమల మయి హారి
నీలమాణిక్యకాంతుల నెఱి నెసంగు
మెయి నరుణవస్త్ర మెంతయు మిసిమి మెఱయ
జగము లేలుశ్యామల ప్రోచు సత్యనాము.

చ. సిరి మెఱుఁగై యురంబునను జెన్నలరారఁగఁ గౌస్తుభప్రభో
త్తరళితదివ్యహారము ముదం బిడ నింద్రధనుర్వ్రరంబు నా
నరుదుగ భక్తచాతక * సమర్థకుఁడై తగుకృష్ణమేఘుఁ డె
త్తఱిఁ గరుణారసం బిడి ముదంబునఁ బ్రోచుత సత్యనామునిన్.

సీ. తృణము చేయనివాని నణుమాత్రిలో మేరు
వుగఁ జేయఁ జాలిన జగముతల్లి
సకలలోకములను సంరక్షణము సేయ
నవతరించిన జగదాదిశక్తి
ముచ్చేలుపులచేత మ్రొక్కులు లందుచు
నెల్లెడ విలసిల్లు నీశ్వరేశి
వివిధవైభవములు విస్తరిల్లఁగ భక్త
తతిఁ బ్రోవ మొనసిన తల్లితల్లి

తే. కడలికూఁతురు జయలక్ష్మి కరుణఁ జేసి
విడనిసిరు లిచ్చి లోకైకవినుతుఁ డైన
పేరుశాస్త్రికిఁ బుత్రుఁడై పేరు గొన్న
సత్యనారాయణుని సదా సాకుఁ గాక.

శా. బ్రహ్మాండమ్ము జనించి నాలుగు మొగంబుల్ నాల్గు వేదంబు లే
యజ్ఞుల్ రాని తెఱంగునం గడల మోప్రియం జేయుచో విశ్వమూ
ర్జజ్ఞుల్ లేక సృజించి మించువిధి విజ్ఞానైకదివ్య స్థితిన్
జెజ్జల్ వోవఁగఁ జేసి సత్యున కిడున్ దీర్ఘాయురారోగ్యముల్.

మ. గ్రహరాజై నిజతేజ మెల్లకడలం గ్రాలంగ లోకాళికిన్
స్పృహ గల్గించుచుఁ గర్మసాక్షి యగుచుం బెంపొంది సప్తాశ్వుఁడై

* సమర్థకుఁడు = వరము నిచ్చువాఁడు; వేంకటపేరుశాస్త్రి = వేంకటశాస్త్రి కుమారుఁడు పేరుశాస్త్రి యని యర్థము.

బహుమార్గంబు పరిభ్రమించుచుఁ బ్రజం బాలించు దేవుండు ఘూ
ర్వహుఁడై శ్రీనరసింహదేవరకులబ్రహ్మం గటాక్షించుతన్.

చ. అరుణశరీరకాంతి దెస లంతర మింతయు లేక నిండుకోఁ
గరముల నాల్గిటం గళయుఁ గంజము పుస్తక మక్షమాలయున్
బరఁగ శివాంకసంస్థ యయి బాలిక వైఖరి భక్తకోటులన్
సురుచిరలీల నేల్ త్రిపురసుందరి మాకృతినాథు నేలుతన్.

సీ. పటికంపుఁజాలడా లటమటింపఁగఁ జాలు
నిద్దంపు తెలిమేనినిగ్గు లెసఁగ
సూర్యచంద్రాగ్నుల సొంపొందు మూఁడేసి
కనులఁ బ్రాపంచ మొగంబు లలరఁ
బాపటసుళ నేఁపు చూపులేజాబిల్లి
చేర్చుచక్కవలె వ్రేలి చెన్నుమీఱ
నైదైదు చేతుల నబ్జత్రిశూలాది
పరికరంబులు మహాప్రతిభఁ దెలుప

తే. ఎల్లవేదములకుఁ గన్నతల్లి యగుచు
నెన్న మూర్తిత్రయంబున కన్న నున్న
తముగ వర్తించి నిజభక్తసమితిఁ గాచు
నట్టిగాయత్రి జగ్గమ్మపట్టి నేలు.

క. శాంతు మునీంద్రస్వాంతని
శాంతున్ భక్తాంతరాయచయపరిశాంతున్
గాంతానంతనుతమహో
దంతున్ మతిమంతు నేకదంతుఁ దలంతున్.

సీ. సిరముపైఁ బూపచందురుని వెన్నలతో ని
గారంపు తెలిమేను కళలు నెఱయఁ

బాణి నాడెడుచిల్క పల్కులు మీటువ
ల్లకి కనుగుణతాళలయలు గాఁగ
నుపనిషత్తులు నిత్య ముడిగంబు చెలియలై
యిరుచక్కి వీచోపు లిడుచునుండ
నొండొంటఁ బయ్యంట నొరయుసంగీతసా
హిత్యద్వయంబున నెసఁగ సరులు
తే. అంచవాహనమం దూర్మి నధివసించి
పంచమశ్రుతి వీణవాయించుకొనుచు
భక్తలోకమనోభీష్టఫలద యైన
నలువరాణి మదాత్మలో వెలయుఁగాక.
మ. అభియోగంబుల రాజకీయములఁ బ్రాణాపాయకార్యంబులన్
శుభసందర్భములన్ గ్రహస్థితిగతుల్ చొప్పెదియున్నప్పుడున్
విభవప్రాప్తులఁ దోడు నీడ యగుచున్ వెల్గొందఁగాఁ జేసి నా
కభయం బిచ్చెడుబాలికామణిని సంప్రార్థింతు నశ్రాంతమున్.
ఉ. కూరవిషూచివాతఁ బడి కొండికనాఁటను గాలువీటికిం
జేరఁగ నైననన్నుఁ గృపఁజేసి పితాళ్ళవనంబునుండి పై
దారినిఁ బోవకుండ వడిఁ దర్మి జముం గొని తెచ్చి తల్లికిన్
నేరిమి నిచ్చినట్టిజననిన్ భజియించెద శ్యామలాంబికన్.
సీ. అతిబాల్యముననె వేదాదివిద్య లెఱింగెఁ
గురిసె బంగరువాన గరితఁ బ్రోవఁ
దల్లికోరికిఁ జేసి తరలించుకొని వచ్చెఁ
బూర్ణానదిం దన * పురముకడకుఁ
గొండ పొద్దునఁ బాఱుచుండు కాళిందినీర్
తనకుండి నొకమూల దాఁగఁ బట్టెఁ

* పురము = యిల్లు

జచ్చినమునిపుత్రు క్షణమాత్రి బ్రదికించె
నేడమూంక మహాకవీంద్రుఁ జేసె
తే. బ్రహ్మరుం బోనిమండను వానిసతిని
వేల్మిడిని గెల్చె లోకైకవినుతయశుఁడు
శంకరాచార్యయోగీంద్రసత్తముఁ డగు
వాని లోకైకగురుని నేఁ బూని కొలుతు.

—॥ గ్రంథనిర్మాణవిచారము ॥—

వ. అని యిష్టదేవతాప్రార్థనాదికంబు గావించి మించినవేడ్క నే నొక్కవివిక్తప్రదేశంబున నొక్కరుండ కూరుచుండి పూర్వాపరంబు లాలోచించుచుండునంతలో నాచిన్ననాఁటిసంకల్పంబు జ్ఞప్తికి వచ్చె నది యెట్టి దనిన—

క. కులగురువులు విశ్వామి
త్రులచారిత్రము జగద్గురువు లలఘులు పూ
జ్యులు శంకరభగవత్పా
దులచారిత్రము రచింప దొరకొంటి మదిన్.

వ. ఆసంకల్పంబు వికల్పంబు వలె నై నేఁటివఱకుం గొనసాఁగమి కింత చింతించియు నంతలో నందుఁ గులగురుచరిత్రము కౌశికాభ్యుదయ మనుపేర నుభయభాషావిశారదుం డగు కాకరపర్తికృష్ణశాస్త్రి రచించి నా కంకితంబు గావించుట లెఱింగి మదంకితంబు గావున నది మదరిచిత మ్మట్టిద యని తద్విచారంబు విడిచి రెండవది యగు జగద్గురుచరిత్ర మింతలో సంతరింపక తప్ప దని యప్పుడ కొంతకొంత చరిత్రాంశము సంగ్రహించి భగవంతుఁడు నాకుఁ దోఁపగఁ జేసినవిధమ్మునఁ గొంత సంస్కరించి తదేకదీక్షగాఁ బది దినంబులలో గ్రంథంబు పరిసమాప్తిం గావించి దీని నేదికిం గృతి

యిత్తునో యని చిత్తంబునం దలపోయుచుం గొంద ఱనుకొనుచున్నను
వారిం గాదని కొన్నినాళ్ళు వేఁగించితి నంతలోన.

సీ. మహితవిద్యారాజమాన్య మహాభూసుర
వంశాబ్ధి నైనజై వాత్రికుండు
రాజాధిరాజగౌరవపాత్రి మగునేటి
యుద్యోగమునఁ బొలుపొందుచున్నఁడు
జగదీశు లంతవా రగుదు రే వారలఁ
దనమాట నడిపింపఁ దగిననేటి
బుద్ధిమత్త్రవను లేఁ బూని చేయఁగ రాని
కార్యముల్ సాఁగింపఁ గలసమర్థుఁ

తే. డనిశదేవభూదేవ భక్త్యంచితుండు
సంతతాశ్రిత రక్షణైకాంతరంగుఁ
డమలచరితుండు విప్రవంశాభరణము
రమ్యచరితుండు సత్యనారాయణుండు.

ఆ. ఆతఁ డాలమూరునం దుండునరసింహ
దేవరాన్వయుండు భూవిబుధుఁడు.
రాణ్మహేంద్రిపురవరంబున కరుదెంచె
నంచు నెఱిఁగి వాని నరయ నేగి.

వ. నారచించిన జగద్గురుశంకరాచార్యచరిత్రంబు తెలుం గఱింగించి:
నతండు దానిం దనకుఁ గృతి యొసంగం గోరి నన్నుఁ దనయూరికిం
దోడుకొనిపోయి షడ్రసోపేతభోజనంబు నెట్టి కర్పూరతాంబూల
ఫలాదులతో నూటపదియాఱు రూప్యంబులును ఖద్దమువస్త్రంబు
లొసంగిన నెసంగినసంతసంబున వానిం బుచ్చుకొని గృహంబునకు
వచ్చి ముందు మంగళాచరణంబుగా నరసింహదేవరవారి వంశాన
తారం బభివర్ణించెద.

## వంశావతారము

సీ. శ్రీరమణీమణి జీవితేశ్వరునాభి
సరసిజ మేస్వామి జన్మభూమి
తలవాకిళుల మెల్లఁ గలిగి లోకము లేలు
తరళాక్షి యేవేల్పుధర్మపత్ని
క్షీరనీరవిభాగ మారసి చేసెడు
పక్కి యేదేవర యెక్కిరింత
దేవమునీంద్రదేదీప్య మానికంపు
జగమే మహాత్మునితగిన యింకి

తే. అతఁడు నలువొందు శ్రీకాయజాగ్రజుండు
బ్రదుకుప్రొద్దుల నొసళుల వ్రాయు వేల్పు
వేల్పులకుఁ బెద్ద వెలిదమ్మి వెలుఁగుమేటి
జగములను జేయుదిట్ట మేల్ జన్నిగట్టు.

క. ఆవేల్పువంగసంబున
శ్రీవత్సుం డనఁగహరాని శేఖరుఁడు ఘనుం
డై వెలసె వానిగోత్రము
చేవమెయిం బ్రబలె లోకసిద్ధం బగుచున్.

ఉ. ఆగోత్రంబున నెందఱో ద్విజులు విఖ్యాతాఖ్యులై పుట్టి వి
ద్యాగీర్వాణగురూత్తమప్రతిము లై తత్త్వార్థవిజ్ఞానసం
యోగానందసమంచితాత్ము లయి సత్యోదాత్తులై భోగముక్
ద్యాగంబుం గలవారలై ప్రబలి రార్యావర్తదేశంబునన్.

క. ఆవారపు డారామ
ద్రావిడు లనుదెగకుఁ జేరఁ దగినట్టిర వై

చేవమెయిఁ గొంద లొప్పిరి
భూవలయమునందు విప్రపుంగవు లగుచున్.

ఆ. వారిలోన ఘనుఁడు భైరవేశ్వరశాస్త్రి
వంశకర్త యగుచు వఱలి పేరు
శాస్త్రి సుందరేశశాస్త్రి యన్ కొడుకులఁ
బడిసెఁ దనదుధర్మపత్నియందు

క. గోదావరితీరమ్మున
భూదేవసమంచితమ్ము పుణ్యప్రదమై
మోద మిడునాలమూరను
శ్రీదయితులు వార లునికిఁ జేకొనిరిచ్చన్.

ఆ. పేరుశాస్త్రిపత్ని పేరు గంటాలమ్మ
యామెవలన భైరవాహ్వయుఁ గనె
ఆసుతుండు బాల్య మందె మృతించుటఁ
బేరుశాస్త్రి చాల పిమ్మట కయి.

ఉ. భైరవపుత్రిపైఁ గలుగుభావము పెంపున నాలమూరిలో
భైరవనామధేయమునఁ బర్వఁగఁ జేసెను భగ్ననాలయం
బారవిచంద్రతారముగ నాత్మజుపే ర్వెలుగొందఁ జేసి యా
పేరయశాస్త్రి భ్రాతృసుతుఁ బేరిమిఁ జేరిచెఁ బుత్రునట్లు గన్.

తే. పేరుశాస్త్రికిఁ దమ్ముఁడై పేరుగొన్న
సుందరేశ్వరశాస్త్రి విశుద్ధకీర్తి
గౌరమాంబికఁ బెండ్లియై గాంచె బిడల
వేంకటేశ్వరశాస్త్రిని వేంకమాంబ.

శా. శ్రీమంతుం డగువేంకటాహ్వయుఁడు శాస్త్రిఖ్యాతిఁ గైకొంచు వి
ద్యామాన్యుం డయి తండ్రిదు లిద్దరకు శాస్త్రప్రక్రియం బుత్రుఁడై

ద్వ్యాముష్యాయణుఁ డన్నపే ర్వడసి నిత్యానందమునుం గాంచుచున్
గామాంబన్ సహధర్మచారిణిగ వేడ్కం బెండ్లి యై కైకొనెన్.

తే. తండ్రిస్వత్వము పినతండ్రిస్వత్వము తన
స్వత్వమై యొప్పుటను భాగ్యవంతుఁ డగుచు
భోగియై త్యాగియై మహాయోగి యగుచుఁ
బుత్రికులు లేనిదాన లోఁ బొగిలి పొగిలి.

ఉ. పుత్రులు లేనివారలకుఁ బూజ్యము లయ్యెడు మీఁదిలోకముల్
పుత్రుఁ డిహంబునందుఁ దనపూర్వుల కిన్ని తిలోదకంబు లీఁ
బాత్రతఁ గాంచు నట్టి దగుభాగ్యము మా కిఁకఁ బట్టఁ బోవ దే
మాత్రపుటాస లే దిపుడు మాపరువం బది మళ్ళి యుండుటన్.

ఉ. ఔరసపుత్రుఁ డుండ నవు డౌరసతుల్యుఁడు దత్తపుత్రుఁడై
తీసను గాన నే నిపుడు దేశమునం గలబంధుకోటిలో
నేరికుమారుఁ డొప్పెడినొ యేరి గ్రహించెద దత్తపుత్రుఁ గా
నారట మంతఁ దీఱు నని యావిబుధుండు మదిం దలంచుచున్.

వ. అర్ధాంగి కంతయుం జెప్పి యొప్పించి పల్లెలు పత్తనంబులు నన్వే
షింప బంధుమిత్రులం బుచ్చి నవ్వలఁ గొన్నినాళ్ళకు నొక్కపాత్ర
మిత్రుండు వచ్చి వేంకటశాస్త్రివర్యునిం గాంచి యి ట్లనియె.

చ. కవివర ! దూరదేశములు గన్గొన నక్కఱ లే దొకింతలో
నవు నవనీసుపర్వులకు నాలయమై మనమండలంబునన్
శివ మిడు నెల్లదు ట్టనఁగఁ జెప్పగ నొప్పెడుగ్రామ మందునన్
భవదమలాన్వవాయులు ప్రవర్తిలు చుందురు వారిఁ జెప్పెదన్.

చ. అమలన్నృసింహదేవరకులాఢ్యుఁడు బ్రహ్మయశాస్త్రి వానికిన్
గామరుఁ డుమామహేశ్వరుఁడు కోవిదుఁ డాతఁడు సీతమాంబ యన్
సుముఖిని బెండ్లియాడి కనె సూనుని వేంకటశాస్త్రినాము ను
త్తమునిఁ గుమారు నాతఁడు బుధప్రవరుండుఁ గవీంద్రచంద్రుఁడున్.

ఉ. ఆయనఘుండు శాస్త్రములయందు విచక్షణుఁడై విచిత్రరా
మాయణమున్ మహాకవు లహో యనునట్టులు సంతరించి భ
ద్రాయితకీర్తియై తగి ధరాతలమందుఁ బ్రసిద్ధి కెక్కి రా
జ్ఞేయసభాస్థలంబులఁ గడిందిమగంటిమిఁ గాంచె నెంచఁగన్.

వ. అమ్మహాపురుషుండు మహాలక్ష్మిం బెండ్లియాడి యామెవలనఁ బర
బ్రహ్మశాస్త్రి పేరుశాస్త్రి శేషయశాస్త్రి వేంకటరమణశాస్త్రి
నారాయణమూర్తి యుమామహేశ్వరశాస్త్రి యను నార్వుర
పుత్రులం గనియె వారును.

తే. కార్తికేయముఖంబులు కాలములును
ఋతువులును గుణంబులును మాతృకలు శాస్త్ర
ములును జక్రవర్తులు నాఁగఁ బొలుపు మిగిలి
జగతి నొప్పి రాసోదరుల్ పట్కమగుచు.

ఉ. వారలలో ద్వితీయుఁ డయి వాసికి నెక్కినపేరుశాస్త్రినిన్
గోరినమాత్ర వారు ప్రతికూలము లాడక దత్తపుత్రుఁ గా
నీ రహిఁ జూపి రీవు చని యిం డనినంతన యింద మంచు నో
సూరివరేణ్య! వెల్లదురుఁ జూడఁగఁ బోవుద మెల్లి నావుడున్.

ఉ. వేంకటశాస్త్రి మే లనుచు విజ్ఞుని నాతని మెచ్చి చంద్రనా
మాంకితవార మెల్లి చన నోఁ గుడిదిక్కున నున్న వెల్లదు
ఱ్ఱంకిలి యింత లే దనుచు నంతయుఁ గాంతకుఁ జెప్పి దేనికిం
గొంకక వా ర్మహూర్తమునకు న్మనుకొంచు గమించి రూరికిన్.

వ. అట్లు పయనంబై వెలగదుఱ్ఱునకుం జని వేంకటశాస్త్రిదంపతులదర్శ
నంబు చేసి కుమారుం గోరిన వారు కా దనక పేరుశాస్త్రిం దెచ్చి
వేంకటశాస్త్రి కిచ్చిన నాతండు వానిం బరిగ్రహించి సంతసించుచుఁ
గుమారబంధువుల నెల్లరం దోడుకొని యాలమూరుపురంబునకు

వచ్చి యచ్చట సుముహూర్తంబున దత్తహోమవిధిన్ బేరుశాస్త్రిని గుమారుగా స్వీకరించి మహంబు గావించి బంధుమిత్రపరివారపరివృతుండై సుఖంబుండి కొడుకునకు సర్వం బర్పించి కొంతకాలంబునకున్ సతీసమేతుండై స్వర్గంబునకు నిర్గమించె నంతఁ బేరుశాస్త్రి వేంకటశాస్త్రిసర్వస్వంబున కధీశ్వరుండై విద్యాభ్యాసంబు చేయుచు.

ఆ. చర్లవంశరామశాస్త్రికి సీతమ్మ
కాత్మజాత యైనయట్టి జగ్గ
మాంబికాలలామ నాదరంబునఁజేసి
పెండ్లియాడె నల్ల పేరుశాస్త్రి.

సీ. చాపలంబునఁ బరజనుఁ జేర నొల్లని
మంగళదేవి యీమంగళాంగి
బలురాగ యై నోళ్ళఁ బడి రచ్చకెక్కని
మంజులవాణి యీమంజువాణి
మగనిసామేను వోఁ దెగి గర్దరింపని
మృగరాజగమన యీమృగవరాక్షి
పాటి చెప్పినఁ గాని మాటాడఁ దలఁపని
విబుధేంద్రదేవి యీవిబుధదేవి

తే. అనుచు నెల్లరుఁ గొనియాడఁ బ్రాణనాథు
నెద వసించియు వాక్స్థాన మెలమిఁ గొనియుఁ
గలసికొని యనువర్తనముల నిలిచియుఁ
గొలుచు చుండెడు జగదంబ గుణకదంబ.

ఉ. ఆనరసింహదేవరకులార్ణవచంద్రుఁడు పేరుశాస్త్రి వి
ద్యానిధియై ధనాఢ్యుఁ డయి తా నెపుడుం జెయి చాప నట్టిఁడై
దానదధీచియై సుజనతత్పరుఁడై తగి యాలమూరునా
మానిత మైనగ్రామమున మానినితో నివసించె నెంచఁగన్.

తే. పేరుశాస్త్రికిఁ దనుఁ గొన్న వారివలన
నేఁబ దేకరముల భూమి యింతివలన
నిర్వ దేకరముల భూమి యేర్పడంగ
భాగ్యవంతుఁ డగుచుఁ గడుం బ్రబలె మఱియు.

ఉ. తా నొకనూఱు నేకరలు దంపపొలంబు గడించె నన్నియున్
మానక సస్యసంపద సమంచితరీతి నొసంగుచుంట నా
శ్రీనిలయుండు లే దనక రేఁ బవ లెల్లర కెల్లవేళలన్
దానము లెన్ని యేనియుఁ బొనర్చెను భూతలకల్పకంబునాన్.

సుగంధి. ఇమ్మటంచుఁ జేయి జాపి యెగ్గఁ జెప్ప డెరికేఁ
గొమ్మటంచుఁ నిచ్చుఁ గోరి కొన్న నట్టిదానమే
నమ్మ చెల్ల యంచు లోక మబ్బురంపడంగఁ దా
నమ్మహామహుండు భూమి నైన పెట్టు చెట్టగున్.

సీ. చర్చింప నాతఁడు సాహిత్యచక్రవ
ర్తి యనంగఁ బేర్వడి రేపు మాపు
నెపుడు విద్యార్థుల కిష్టమృష్టాన్నము
పెట్టి కావ్యాదులు పెరిమ నేర్పి
పండితులం జేసి పంపుచుండు నజస్ర
మతనియిల్ గురుకుల మట్టి దయ్యె
నాతనిజిహ్వాగ్రమందుఁ దాండవ మాడు
భాగవతగ్రంథభాగ మెల్లఁ

తే. ప్రత్యహమును రామాయణగ్రంథపఠన
మాచరించు సంపూర్ణ పారాయణముగఁ
దపము జపమును స్వాధ్యాయతర్పణములు
విడువ కెప్పుడు పొనరించు వేదవిదుఁడు.

తే. అతిథు లభ్యాగతులు విప్రు లనుటె కాదు
వివిధజాతులవార లెవ్వేళఁ గాని
యన్న మని వచ్చిరేని లే దనక వండి
పెట్టు నాబుధుఁ డెట్టియిక్కట్టు లైన.

మ. గృహదాహం బయి నిల్వ నీడ యిసుమంతే లేక యన్నార్థు లై
రహి వో నుండిన వేనవేల్ ప్రజకు నాబ్రహ్మాన్వయుం డెన్ని యే
నహముల్ భోజనభాజనంబులును వస్త్రాదుల్ సమర్పించి త
ద్గృహముల్ కట్టుకొనంగ ద్రవ్య మిడె నెన్నేమాఱు లెన్నేతఱుల్.

ఆ. క్షామడాంబరాదిసమయముల వలన
వచ్చినట్టివారు వంద లైన
వేలు నైన వాఁడు మాలఁ డైనం గాని
వేఁడు నైనఁ గాని పెట్టె వండి.

శా. వ్యాఖ్యానంబులతోడఁ గావ్యములు శాస్త్రార్థంబులు న్నేర్చి తాఁ
బ్రఖ్యాతోన్నతపండితుం డగుచుఁ జెప్పం జెల్లియుం గావ్యకృ
న్ముఖ్యు ల్మే లని ప్రస్తుతించెడుగతిం బోలించి నాగాననో ♦
పాఖ్యానమ్మును బద్యరూపకృతిఁ జేయం జాలె నాతం డిలన్.

చ. తనసహధర్మచారిణి ముదంబున వచ్చిననాఁటినుండియున్
ఘనుఁ డతఁ డెల్లకావ్యములు నాటకరాజము లయ్యలంకృతుల్
వినిచి పఠింపఁ జేసి సరవిజ్ఞ విదుషీమణిఁ గాఁ బొనర్చె న
వ్వినుతచరిత్రి జగ్గమను విజ్ఞులు మే లని మెచ్చు మచ్చునన్.

ఆ. ఆమె తండ్రివలన నక్షరాభ్యాసమై
బాల్యమందు మొదటి పాఠములను
జదివి తెలుఁగునందుఁ జదువను వ్రాయను
నేర్చినట్టి దయ్యె నేర్పు కలిమి.

---

♦ నాగాననోపాఖ్యానము = గజాననోపాఖ్యానము;

ఆ. భారతమ్ము, భాగవతము, రామాయణ
మును దినమ్ము దినము మొదలు పెట్టి
ప్రత్యహమును భక్తిఁ బారాయణ మొనర్చు
జగ్గమాంబ తులితశారదాంబ.

ఆ. ఆసతీవతంస మానాఁటినుండియు
గ్రంథపరిచయంబు గలిగికొనుచు
యోగిని యయి యిష్ట యోగవాశిష్ఠము
సార్థముగను జగ్గమాంబ చదువు.

క. పగలనక రేయి యనక కా
జగదంబ గృహస్థధర్మసరణి మెలఁగుచున్
మగనికిఁ దోడై యతిథుల
కగురీతిని వండిపెట్టు ననిశము శ్రద్ధన్.

తే. అల్లజగ్గాంబ తోడుగా నల్లనాఁడు
పేరుశాస్త్రివరేణ్యుఁడు పేరుఁ గాంచి
యామెయందుఁ గుమారుల నార్వురఁ గనె
నలువ వాక్కున షట్చాస్త్రములఁ గనినటు.

వ. వారు సత్యనారాయణుఁడు, వేంకటశాస్త్రి, సూర్యనారాయణుఁడు, కామేశ్వరరావు, సుందరరామశాస్త్రి, గోపాలకృష్ణుఁ డనెడువా రార్వురు సోదరు లందు.

తే. అగ్రజుఁడు సత్యనారాయణాహ్వయుండు
కృతివిభుం డన్నపూర్ణాఖ్య సతినిఁ బెండ్లి
యాడి శ్రీజనార్దనశాస్త్రి యనఁగ నొప్పు
కొడుకుఁ గని లోకవిఖ్యాతిఁ గొమరు మిగులు.

తే. అవల వేంకటశాస్త్రివిఖ్యాతిఁ గాంచి
తేరి పట్టపరీక్షలోఁ గోరి పార్వ

తినిఁ బరిణయమై వేడ్కమైఁ గని స్వరాజ్య
లక్ష్మి యనుకూలతు నాథ్యుఁ డై లలిఁ దలిర్చె.

తే. సూర్యనారాయణుఁడు బి-యే చొప్పు లెఱిఁగి
సత్యవతిఁ బెండ్లియాడి పరీక్షిఁ గాంచి
భాతృవాత్సల్యమును దైవ భక్తి గలిగి
నడపె గార్హస్థ్యధర్మము నలువు మీఱ.

తే. అతనితమ్ముఁడు కామేశ్వరాహ్వయుండు
హోమొపతివైద్యమందు మహోన్నతిఁ గొని
యిరువదియు నాల్గు గ్రంథము లింపుమీఱ
సలిపి ప్రకటించెఁ దద్వైద్య మెలమి కెక్క.

సీ. ప్రబలి కామేశ్వరరావు సత్యాంగనఁ
బరిణయమై యామె వలనఁ బేరు
శాస్త్రి, సీతారామశాస్త్రియు శ్రీకృష్ణ
శాస్త్రి సుబ్రహ్మణ్యశాస్త్రి యనెడు
పుత్రులఁ గనె నందు మొదటిపుత్రుఁడు యం-యే.
యవలివాఁ డెం-బి-బియల్ పరీక్షఁ
దనరి సరోజినీతన్విఁ బెండిలి యాడి
యింపొందె నవల నాకృష్ణశాస్త్రి.

తే. శ్రీద్విభాష్యము సూర్యపుత్రికను సీతఁ
బరిణయంబయిగార్హస్థ్యపరమధర్మ
పరతఁ బెంపొందు నవని నవ్వలఁ జతుర్థ
తనయుఁ డిపుడు స్కూల్ ఫయినలు తనరఁ జదువు

సీ. అలపేరుశాస్త్రిపుత్రులలోన నైదవ
పుత్రుఁడై పేర్గొన్నపురుషవరుఁడు

ప్రాజ్ఞుఁడు సుందరరామశాస్త్రి వరేణ్యుఁ
డలరి లక్ష్మీనరసమ్మ యనెడు
నంగనామణిఁ బెండ్లియై పేరుశాస్త్రి రా
మేశ్వరరావను నిర్వురు సుతు
లిరువురు సుతలును బరిఢవిల్లఁగ లోక
సమ్మతుం డయి పేర్మి సౌరుమీఱు.

తే. వానియనుజుఁడు వేణుగోపాలుఁ డనఁగఁ
బరఁగి పదునాలుగేడుల ప్రాయమంద
పరమపద మందెఁ దన్మృతి వలనఁ దండ్రి
వేణుగోపాలశతకంబు వెలయఁ జేసె.

ఉ. ఇట్టులు పేరుశాస్త్రి గణియించి కుమారుల నిల్లు దీర్చుచున్
బెట్టుచుఁ బెట్టుచె ట్టనఁగఁ బేదల కన్నము దొట్టిదానముల్
బుట్టుకతోడనే కలసి పుట్టినదాతృతకుట్ యశంబు నాఁ
బుట్టిన దానిని న్విడిచి పోవఁగఁ దోలె దిగంతముల్ గసన్.

తే. చపల యగులచ్చి కోడలి నపుడు చూచి
యాపెతోఁ గూడి యుంటకు నోప కేగఁ
దలఁప నాతఁడుశాస్త్రశస్త్రంబు నూపి
బెగడుగుడుపుచు నిలిపె నప్పిచ్చిలచ్చి.

వ. నిరతాన్నదాత యగునావిద్వాంసుఁడు భార్యాపుత్రులం గూడి పెద్దకాలంబు గృహస్థధర్మంబు నిర్వహించినపదంపడి స్వర్గంబునకు నిర్గమించి తదాజ్యరమాపరిపాలనంబు గావించుచుండె నంతఁ దదగ్రపుత్రుం డగుసత్యనారాయణుం డగ్రగణ్యుం డయ్యె నతని చరిత్రం బభివర్ణించెద నతండు.

—ః కృతిపతిచరిత్రము ః—

తే. పదియు నెన్మిదినూర్లు తొంబదియు నాలు
గైనక్రీస్తుశకమున జయాబ్దనభము
నందు శుద్ధాష్టమిన్ ధిషణాహమున వి
శాఖ నక్షత్రమునఁ బవల్ జనన మొందె.

తే. శుక్లపక్షక్షపాకరుశోభ నతఁడు
దినదినాభివృద్ధిం గాని జనకువలనఁ
బడసి బ్రహ్మోపదేశము ప్రజ్ఞకలిమిఁ
జదువ నారంభ మొనరించె సదమలగతి.

ఆ. విజయనగరమందు వెలయుకాలేజిలో
యఫ్. ఏ. యనుపరీక్ష కనువు పడఁగఁ
జదువుచుండె నపుడు చనుదెంచె గాంధిమ
హాత్మునుద్యమం బయత్నముగను.

శా. దేశక్షేమముఁ గోరుచుండునతఁ డాదివ్యోద్యమం బెంచుచున్
లేశం బేనియు సందియంపడక కాలేజీకలాభ్యాసపుం
బ్రాశస్త్యంబును గా దటంచు విడి తద్బ్రహ్మోద్యమోద్వాహనా
వేశంబుం గాని దేశభక్తుఁ డయి సేవించెం బ్రజామండలిన్.

సీ. గ్రామసంచారంబు గావించుచుం బ్రజా
కష్టనిష్ఠురగతుల్ గానఁ గలిగి
వేతనోద్యోగముల్ వేఁడుక కైనను
జేయుట తగ దని చెప్పఁ గలిగి
కాంగ్రెసుసంస్థలోఁ గా ల్పెట్టి నిరతస
త్యాగ్రహి యై వ్రత మందఁ గలిగి
బీడీలు చుట్ట కాఫీలు టీ|ల్లోనగు
దుష్టాభ్యసనములఁ దోలఁ గలిగి

తే. కాంగిరేసుమహాసంస్థ కాని వేఱు
సంస్థ యొక్కఁడు లేదు లేశప్రతిష్ఠ
కనుచు దానిఁ బోషింపఁ గంకణముఁ గట్టె
సత్యనారాయణబుధుండు చాలి జగతి.

సీ. ప్రభుతాతిరస్కార మభయుఁడై పచరించె
నని హయాణవిభులు రెండు నెలలు
జై లుశిక్షయు రెండువే లైదువందలు
రూపికల్ జరిమాన మోపి వాని
స్థలము పొలము జప్తు సలిపియు నవ్వేల
"సూడా మోటా" యను చోప్పునలస
హైకోర్టున విచార మైనంత వానిదో
షము లేమి శిక్ష వో సలిపి వాని

తే. ధన మ దంతయు వానికిఁ గోన నొసంగి
రెండుమాసములకు బందినుండి విడిచి
రాతనిని బ్రిటిష్ప్రభుత యి ట్లాచరించెఁ
బదియుఁ దొమ్మిది నూర్ల ముప్పదియు నొకట.

సీ. పదియుఁ దొమ్మిదినూర్ల పయి నల్వదొం డగు
నేట సత్యాగ్రహ మెసఁగునపుడు
నలుమాసములు శిక్ష గలిగినవాఁ డయ్యె
నరసింహదేవరవరకులజుఁడు
కడఁగి ముప్పదియేండ్లు గ్రామపంచాయతీ
సహకారసంఘాలసభ్యుఁ డగుచు
సతతమానవసేవ సలుపుచు గౌరవో
ద్యోగమునం దుండి యొప్పు మిగిలె

తే. ఇర్వదేడులనుండి తా నిప్పటికిని
నడపు సహకారపత్రిక కడిమి మెఱయు

గ్రామపంచాయతీపత్రికను నయమున
నిప్పటికి నడుపుచుండె నాయిద్ధబుద్ధి.

తే. ఆలమూరున నాదర్శ మానటు సక
లార్థసకలార్థసంఘము సార్థకముగ
నిర్వహించుచు నుండె నాసర్వలోక
రంజకుం డగుసత్యనారాయణుండు.

శా. ఆయాసంస్థల నెందఱోజనులు త న్నర్థింప నుద్యోగముల్
శ్రేయం బేర్పడ నిచ్చి ప్రోచె నిపు డుర్విన్ మూడును న్నాల్గు నూ
న్లై యింపొందుకుటుంబముల్ బ్రదుకు నట్లై యుండెఁ దన్మూలసం
స్థాయోగంబునఁ జేసి మెచ్చుకొనరాదా సత్యనారాయణున్.

క. తాలూకాబోర్డున జి
ల్లాలోఁ గలబోర్డునందు లలి మెంబరు గాఁ
గ్రాలుచుఁ బ్రజలకు నెన్నో
మేలులు గలిగింపఁ జేసె మిసిమి పొసంగన్.

ఉ. తంగెడుపూలసంపదను దాఁ గని రోయుచు దవ్వు దవ్వు గా
బృంగము వోవు నట్లు పృథివిం బొలుపొందెడు నన్యకాంత లే
సంగతి నేని కంటఁబడ స్వాంతమునం దొగి మాతృభావ మొ
ప్పం గయికొం చచంచలుఁడవాఙ్ముఖుఁడై చను దవ్వు దవ్వుగన్.

తే. అతఁడు చెర్ల వేంకటశాస్త్రి కతివ పూర్ణ
మాంబకుం గూర్చునాత్మజ యైనయన్న
పూర్ణ యనుసాధ్వి నుద్వాహమున వరించి
మేటిగృహమేధి యయ్యె నీమేదిని పయి.

తే. ఏకపత్నీవ్రతస్థుఁ డాపృథివిసురుఁడు
గరిత యగునన్నపూర్ణను బరిణయమయి
నది మొదలుగ నెల్లప్పుడు నభవుఁ డగజఁ
బలెను విడువక సుఖముండెఁ బండితుఁ డయి.

ఆ. ఈడు జోడు వయసు నెన్న నొక్కవిధంబు
మనము మాట బుద్ధి మాఱు గావు
కొలిచి కూర్చినట్లు వెలసెఁ దద్దాంపత్య
మతి(కి ననసూయ కట్లు తెలియ.

మ. పతియే దైవము గాఁగ నెల్లపుడు నప్పద్మాక్షి వీక్షించుచున్
బతి నేకాలముఁ బాయ కెల్లపనులం బా ల్గొంచుఁ జేదోడు గా
సతి వాక్కాయమనంబులం బతికి నిచ్చ ల్సేవ గావించునీ
క్షితి వా రిద్దఱు నేకదేహ మొ యనన్ జెన్నొంది రేకేహ్యమై.

తే. అత్తవారింట నాయమ యడుగు వెట్టి
నది మొదలు మూడు పువ్వులు నాఱు కాయ
లనువిధంబుగ వారియి ల్లతిసమృద్ధి
నొందినది యయ్యొ లోకు లోహో యనంగ.

ఉ. అత్తకు మామకుం బతికి నాయమ నిచ్చలు సేవఁ జేయుచున్
మెత్తనిచిత్తముం గలిగి మిత్రుఁడు లేవక మున్న లేచి తా
నత్తఱి గేహకృత్యముల నన్నిటిఁ దీర్చి దేవపూజలన్
జిత్తముఁ జేసె కొల్చి నతి సేయుచుఁ జేయును దేవతాస్తుతుల్.

తే. అతిథు లభ్యాగతులు నింటి కరుగుదేర
నన్నపూర్ణకు నుద్దిమై యున్నపూర్ణ
పవలు రాతిరి యనఁ బోక వండి పెట్టు
నత్తమామలు చెప్పనియప్పు డైన.

ఉ. మామ గృహాధిపత్యమును మానక సేయుచునున్నయప్పుడున్
భూమిసుపర్వు లిద్దఱును ముగ్గురు గా దొకనూర్వు రైనఁ గా
నీ మొగమోడ కాగరిత నెయ్యము తియ్యము నేర్పడంగ ని
చ్ఛామతి వండి పెట్టెడిని జయ్యనఁ దియ్యనిపిండివంటలన్.

సీ. కలదాన నని లోన గర్వపడుట లేదు
గృహకృత్యములు నిర్వహించుఁ దాన

యతిథు లభ్యాగతు లనుదినంబును రాగ
వండిపెట్టును విసువక మనమున
ధవుఁ డొనర్చెడుదానధర్మంబులకు నిష్ట
పడి తోడుపడుచుండుఁ బ్రత్యహంబు
పరపురుషులతోడఁ బలికి యెఱుంగదు
తలవాఁకిట నొకప్డు మెలఁగఁ బోదు

తే. పేదలం గన్నఁ బెరిమతో నాదరించు
ధుమధుమలు మోమునందునఁ దోఁప నీయ
దెప్పుడు నో రెత్తి మాటాడ నెఱుఁగ రెవ్వ
రరయ సద్గుణపరిపూర్ణ యన్నపూర్ణ.

ఉ. ఆయమసాహచర్యమున నానరసింహకులాబ్ధిచంద్రుఁ డై
శ్రీయము లందుసత్యుఁడు ప్రసిద్ధియు సిద్ధియు నిద్ధకీర్తియుఁ గా
బాయక తన్నుఁ జేరుకొని ప్రజ్ఞ ఘటిల్లఁగఁ జేయుచుండ భ
ద్రాయితమూర్తియై తనరి ప్రస్తుతి కెక్కుచు నుండె మెండుగన్.

ఆ. మేనినీడ పోలెఁ బ్రాణేశ్వరునిఁ గూడి
యుండు నన్నపూర్ణ యుదరశుక్తి
మౌక్తికమ్ము నాఁగ మానొందుశ్రీజనా
ర్దనకుమారుఁ డపుడు రమణ మెఱసె.

ఉ. ఆతఁ డొకింత యింగిలిషు నందుఁ బ్రవేశము గల్గి పిమ్మటం
దాతకడ స్మార్తుఁడొక్కరునిదగ్గరఁ గావ్యము లర్థశాస్త్రముం
బూతము శబ్దశాస్త్రమును బోహణ సేయుచు సంగ్రహించి వి
ఖ్యాతయశస్కుఁడయ్యె సుధియై తలిదండ్రులకు న్విధేయుఁడై.

ఆ. చర్లభాష్యకారశాస్త్రికిఁ గూరమ
కాత్మజాత బాల నమలశీల
స్వీకరించె నారసింహదేవకుల జ
నార్దనుండు శ్రీజనార్దనుండు.

తరళము. త్రిపురసుందరి బాలపేరను దేజరిల్లెడుబాల యె
ల్లప్పుడు బాల తెలుంగునం గడు నందముం దగుచందముల్
సుపరిశుద్ధము వర్తనంబును సూనృతంబును సూక్తియుల్
గృపయుఁ గల్గి మెలంగు ♦ సంగతికిం గుదుర్కొని కోర్కెలై.

శా. మేశాధీశకు వేయియర్థములు పేర్మిం జెప్పఁ గాఁ జాలి లో
కై కేద్యమ్ముఁ గృతిన్ రచించినఘనుం డాభాష్యకారాఖ్యవి
ద్యాకంజోద్భవు కన్నబిడ్డ యయి పితౄకారతం బొల్చుబా
లాకాంతామణి ధన్యురా లనుచుఁ బల్క న్వచ్చు నుద్వృత్తిన్.

వ. ఆసతీవతంసంబునందు సత్యనారాయణాత్మజుం డగుజనార్దనశాస్త్రి వరేణ్యుండు— కృష్ణశాస్త్రి సుబ్రహ్మణ్యశాస్త్రి భాష్యకారశాస్త్రి విజయాదిత్యశాస్త్రి జగన్నాధశాస్త్రి సత్యనారాయణశాస్త్రి యను నార్వురు కుమారులం గాంచె నం దాద్యుం డగుకృష్ణశాస్త్రి—

ఉ. శ్రీయుతుఁడై ద్విభాష్యకులశేఖరుఁడై తగు వేంకటేశ్వరా
ఖ్యాయుతకీర్తిమూర్తికిఁ బ్రియాత్మజుఁడై పొలుపొందుసూర్యనా
రాయణవిద్వదగ్రిణికి నాత్మజ యై తగుసూర్యలక్ష్మినిం
బ్రేయసిఁ గాఁగ నేలుకొనఁ బెండిలియాడెఁ బితామహాజ్ఞనై.

వ. ఇట్లు పుత్రపౌత్రమిత్రపరివారపరివృతుండై మహోన్నతస్థితిం గాంచి ప్రవర్తించుచుండు శ్రీసత్యనారాయణుండు.

—♦ శ్రీ ద శా వ తా ర క థ న ము ♦—

సీ. జలమహావటపత్రశాయి యై రాజేశ్వ
రీకృపకై సృష్టి రేఁచువాఁడు

♦ సంగతి = జ్ఞానము.

వ్యా:— జలమహావటపత్రశాయియై జలమందు (సముద్రమందు) పెద్దమఱ్ఱి యాఁకుపై శయనించినవాఁడై; రాజేశ్వరీకృపకై = (మహాదేవిని గీర్తించి యామె యనుగ్రహమున మధుకైటభుల సంహరించి లోకము సృజించినట్లు దేవీభాగవతము చెప్పుచున్నది) సృష్టి రేఁచువాఁడు = సృష్టి విజృంభింపఁజేసినవాఁడు. ఆదినారాయణ

సరసవిసారియై పరగతవిద్యలఁ
గొనకొని తెచ్చిన గోత్రధరుఁడు
క్ష్మావిబుధుం డయి చనుమేటి నరసింహుఁ
డయి హితప్రహ్లాదుఁ డైనసూరి

---

మూర్తి యని ఈశ్వరార్థము; జల = జడ, లడయోరభేదః, జడమైన, మహావట = పెద్దగోయి (గుహ) "యో వేదనిహితం గుహాయాం" అని శ్రుతి; మాతృగర్భగోళమున నొకపత్రము = పొరగానై శయించి, రాజేశ్వరీకృపకై = పరాశక్తియొక్క యనుగ్రహపాత్రమై, సృష్టిఁ జేయువాఁడు = జన్మమునొందినవాఁ డని సత్యార్థము; సరసవిసారియై = సరసము నీళ్ళుగలది (సముద్రము) అందు, విసార = మత్స్యమై, పరగతవిద్యలఁ = శత్రువుచే (సోమకాసురునిచే) అపహరింపఁబడిన వేదవిద్యలు తెచ్చినవాఁడు (మత్స్యావతారము. ఈశ్వరార్థము) సరసమైన చిత్రసంచారము (స్త్రీమరు రైలు విమానము లోనగువానిపై నని) పరులను బొందినవిద్యలు నేర్చికొని వచ్చినవాఁ డని సత్యార్థము; గోత్రధరుఁడు = మందరపర్వతమును వీపుపై ధరించినవాఁడు (కూర్మావతారము, ఈశ్వరార్థము) గోత్రము, కులము నుద్ధరించినవాఁడని సత్యార్థము; క్ష్మావిబుధుం డయి చనుమేటి=భూమిని బాగుగాఁ దెలిసికొనినవాఁ డనగా హిరణ్యాక్షునిచే నపహరింపం బడినభూమి నెఱింగి తెచ్చినవాఁడు (వరాహావతారము ఈశ్వరార్థము) బ్రాహ్మణుఁడై యొప్పినవాఁడని సత్యార్థము, నరసింహుఁడై, హితప్రహ్లాదుఁ డైనసూరి = ఇష్టుఁ డైనప్రహ్లాదుఁడు గలిగినసూరి = సత్కర్మమును జేరిచేసినవాఁడు; (నారసింహావతారము, ఈశ్వరార్థము, నరసింహుఁడై = పురుషశ్రేష్ఠుఁడై, నరసింహ దేవరాయఁడై యనియు, హితప్రహ్లాదుఁడు = హితులకు ఆహ్లాదమును జేయు విద్వాంసుఁ డని సత్యార్థము; వరవిక్రముఁడు = మంచిగా క్రమము చేసినవాఁడు, మూఁడడుగులు నడచినవాఁడు (వామనావతారము, ఈశ్వరార్థము) వరవిక్రముఁడు = శ్రేష్ఠమైనపరాక్రమము గలవాఁడు అని సత్యార్థము; దస్యువర్గాపహర్త = దుష్టసమూహమును సంహరించినవాఁడు (పరశురామావతారము, ఈశ్వరార్థము) దుష్టులను జయించినవాఁడు అని సత్యార్థము; శ్రీతాతపాదార్చనాతత్పరుఁడు = తండ్రి యగు దశరథుని పూజయం దిష్టము గలవాఁడు వానిమాటఁబడి వనవాసము చేసినవాఁడు, కౌశికకార్యసంరక్షణైకహృదయుఁడు = విశ్వామిత్రునియజ్ఞ కార్యసంరక్షణమందు ముఖ్యమైనచిత్తము గలవాఁడు, కౌతుకముతోడ శ్రీ నొంపఁ గలిగినతఁడు = వివాహవిధిచే సీతాదేవినిఁ బెండ్లియాడినవాఁడు (శ్రీరామావతారము, ఈశ్వరార్థము) తాతపాదార్చనా

వరవిక్రముఁడు దస్యువర్గాపహర్త శ్రీ
తాతపాదార్చనాతత్పరుండు

తే. కౌశికార్యసంరక్షణైక హృదయుండు
కౌతుకముతోడ శ్రీ నొందఁ గలిగినతఁడు
సత్త్వమూర్తి సర్వజ్ఞుఁడు సత్యకల్కి
సత్యమూర్తి తలిర్చెడు సత్యమూర్తి.

ఉ. ఎందఱకో మహోపకృతు లెన్నియొ చేసె విభుత్వసంపదన్
గొందఱ కార్థికస్థితులఁ గూర్చెను గొందఱ కెంత లెంతలే
నిం దలసూపునిక్కముల నెక్కొనుచిక్కులఁ దీర్చె ధీరుఁడై
కొందఱ మేల్పదంబులను గూడఁగఁ జేసె నతం డలంతియే?

చ. దయగలవాఁ డతండు తనదండకు వచ్చినయెట్టివారినిన్
బ్రియమునఁ గాంచి వానిపనిరీతిఁ గనుంగొని దాని కుత్తరం
బయ మగున ట్లొసంగుచు క్షణార్ధములోపల నంపిపుచ్చు ని
శ్చయముగ నిద్ది వానిసహజం బగుసద్గుణ మంచు నెంచెదన్.

చ. కవు లనఁగాఁ గవిత్వ మనఁగాఁ గడుఁ బ్రేముడిఁజేసి వారికిన్
దవినటు చిత్త మిచ్చెడు నతండు జగజ్జనవర్ణనీయుఁడై

---

తత్పరుండు = తండ్రినిఁ బూజించువాఁడు, కౌశికార్య......తత్పరుండు = కౌశిక గోత్రజు ననుగ్రహించినవాఁడు కౌతుక......నతఁడు = సంతోషముతో ధనము కీర్తి సంపాదించినవాఁ డని సత్యార్థము; సత్త్వమూర్తి = బలమైన దేహముగలవాఁడు, (బలరామావతారము ఈశ్వరార్థము) మంచిపరిణామములు గలవాఁ డని సత్యార్థము; సర్వజ్ఞుఁడు = బుద్ధుఁడు, "సర్వజ్ఞ స్సుగతో బుద్ధః" అమరము. (బుద్ధావతారము, ఈశ్వరార్థము) సర్వమును దెలిసినవాఁ డని సత్యార్థము; సత్యకల్కి = సత్యస్వరూపుఁడైమనోజ్ఞుఁ డైనవాఁడు (కల్క్యవతారము, ఈశ్వరార్థము) సత్యముచే మనోజ్ఞమైనవాఁ డని సత్యార్థము; 'సత్యమూర్తి తలిర్చెడు సత్యమూర్తి' ఒకసత్యమూర్తి మహావిష్ణువు మఱియొక సత్యమూర్తి నరసింహదేవరసత్యనారాయణుఁడని యొప్పుచుండునది.

కవి నగునన్ను నాకవితఁ గన్గొని మిక్కిలి సంతసించుచున్
బ్రవిమల చిత్తవృత్తిఁ బ్రియబాంధవునిం బలె నాదరించెడున్.

సీ. ఆతనిచేతి వ్రా లన్నిచోటులఁ జెల్లు
లక్షోపలక్షల కీక్షణమున
నాతనిమాట నా నవనీశు లెల్లరు
వినయవిధేయులై వినుచు నుందురు,
రాతనియాలోచనాంశము విబుధరా
డ్గురువున కైనను గురుత గాంచు
నాతనిసుకృతకార్యానుసంధానత
నపరంజి కగుటంక మట్టిదగును

తే. అతనిదాతృత్వ మది వేల్పుటావు నెపుడు
సిగ్గునను ముంచి మించెడు క్షితితలమున
నతఁడు సర్వవిధంబుల నరయఁ దోఁచు
సుగుణసంఘమి ట్లాకృతిఁ దగిలె ననఁగ.

చ. కుడువఁగఁ గట్ట లేక కడుఁ గొందల మందెడుబీదవారి నె
ప్పుడు గనినన్ దయారసము పొంపిరివోవఁగఁ జేరఁ దీసి లోఁ
గొడుకులకన్న మిన్నగను గోరికఁ గన్గొనుచుం దదిష్టముల్
తడయక తీర్చి ప్రోచెడు నతం డొనరం దనశక్తి పెంపునన్.

సీ. పరుఁ డైన బాధలఁ బడ నున్నఁ జేత నై
నంతలోఁ దొలఁగింప నలరువాఁడు
ఘనతర మీయుపకారము నీచేతఁ
గావలె నన్నచోఁ గడఁగువాఁడు
కల నైన నన్నృతంబు పలుకనినియమంబు
పుట్టుతోడన నేర్చి నట్టివాఁడు

ఆబాలగోపాల మన్ని దిక్కుల మంచి
వాఁ డని పేరొంది వఱలువాఁడు

తే. అతఁడు నలువొందు నారాయణాస్యపద్మ
జాతకులకలశార్ణవచంద్రుఁ డర్థి
పారిజాతము జగ్గమా పేరుశాస్త్రి
పుత్త్రరత్నము సత్యవిభూషణంబు.

క. ధనికుఁ డన దాత యనఁగ న్
ఘనుఁ డనఁగా సుగుణియనఁగఁ గాశ్యపియం దా
జనహితుఁ డాతఁడె యని స
జ్జను లెల్లరుఁ జెప్పుచుందు రి సత్యాహ్వయునిన్.

సీ. హరియించె నెవ్వాఁడు దురితజాలంబుల
సత్క్రియాకోటులు సంతరించి
భరియించె నెవ్వాఁడు ధరణి బీదల నెల్ల
నన్న పానాదుల నాదరించి
వరియించె నెవ్వాఁడు పరమకవీంద్రుల
రత్నాంబరంబులు రమణ నొసఁగి
ధరియించె నెవ్వాఁడు కరుణారసం బెప్పు
డంతరంగమునందు శాంతుఁ డగుచు

తే. అతఁడు కొనియాడఁ బడుచుండు నవనియందు
సత్యనారాయణాఖ్యుఁడు సాధుసఖ్య
సంకలితుఁ డన్నపూర్ణాహ్వాదంకితుండు
నారసింహదేవరవంశ నాయకమణి.

సీ. కాశికాపురి కేగి గాంగతీర్థము లాడి
విశ్వేశ్వరాదుల వెడకి కొలిచె

గయ కేగి పితల కక్షయవటంబున విష్ణు
పదమునఁ బిండముల్ పైచె భక్తి
నలప్రియాగముఁ జని యాత్రివేణీసంగ
మం దాడి మాధవు నర్చ చేసె
సాకేతమున కేగి సరయువునం దాడి
శ్రీరామచంద్రుల సేవఁ జేసె

తే. వరహరిద్వార గోకులావంతి కలును
మథుర, ద్వారక, నాశిక, మాయ, త్ర్యింబ
కేశ్వరము గోలెఁ బుణ్యాపవైకభూము
లరిగి సేవించె సత్యనారాయణుండు.

చ. ఒకఁడు దలంచియుం బయికి నొక్కఁడు చెప్పియుఁ జెప్పినట్లు గా
కొకఁడు పొనర్చియుం గుజను లుర్విఁ జరింతురు దోసకారులై
సుకలుఁడు సత్యనామబుధసోముఁడు తా నటువంటి వారివం
కకుఁ గను వెట్టఁ డెప్పుడు నొకానొకచొప్పు వహించి యుండెడుర్.

ఆ. అరసి యరసి కాని యది యిది చేయఁడు
ననఁడు వేరి కైన ననిన యేని
చేయఁ డనిన మాట చెప్పఁ డెప్పుడు గాని
సత్యమూర్తి యతఁడు సత్యమూర్తి.

సీ. ఎవ్వానియింటిలో నెపుడుఁ దామరతంప
రై పాడి పంటయు నలరు చుండు
నెవ్వానిచేతుల నెపు డెల్లవారలఁ
బ్రోచుదాతృత్వంబు పొనరు చుండు
నెవ్వానివర్తన మివ్వసుంధర యెల్ల
వ్యాపించి విఖ్యాతి వన్నెఁ గాంచు

నెవ్వానిసౌజన్య మెల్లవేళలయందు
బళి బళి యనిపించుఁ బండితాళి

తే. ఆతఁడు నృసింహదేవరాఖ్యాన్వయకల
శాబ్ధిచంద్రుఁడు సత్యనారాయణార్యుఁ
డాయు రారోగ్య పుత్రపౌత్రాభివృద్ధిఁ
దనరు చుండును గాక భూతలమునందు.

—• షష్ఠ్యంతములు •—

క. ఏతాదృగ్విధవిభవ
ఖ్యాతమహీసురవరాన్వ యాంబుధిరాకా
శీతఘృణికి జగ్గాంబా
పూతోదరశుక్తిసక్త ముక్తామణికిన్.

క. పాత్రునకుఁ బేరుశాస్త్రిసు
పుత్రునకున్ సర్వదేశబుధమిత్రునకున్
సూత్రజ్ఞానవినిర్జిత
శత్రునకున్ సూరివినుతచారిత్రునకున్.

క. శ్రీమహితోన్నతసుగుణ
స్తోమునకున్ లోకవినుతశుభధామునకున్
రామేశ్వరార్చనాత్త
క్షేమునకున్ నిత్యసత్య శివనామునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన జగద్గురుచరిత్రం
బనుపవిత్రగ్రంథంబునకుఁ బ్రారంభం బెట్టిదసిన.

శ్రీరస్తు.

# జగద్గురు చరిత్రము

## కథాప్రారంభము

శ్రీమద్భారతభూతలాధిప మహాసామ్రాజ్యసింహాసనం
నానాశాస్త్ర విచక్షణార్థ విలస ద్వాగ్వైఖరీ వర్ణితమ్
ధర్మార్థైః ప్రతిపాలితం ఫలయుతం లక్ష్మీకటాక్షాంచితం
క్షేమస్థైర్యజయాభయాదికలితం భాభాతి భూత్యున్నతమ్.

మ. పదియు న్నాలుగు నైనలోకములలోఁ బ్రాముఖ్యముం గొన్నదై
విదితార్థం బగుభూమిలోకమున నుర్వీదేవతాగుప్తమై
యొదలున్ భారతవర్ష మెన్న శ్రుతిధర్మోపేతమై పూతమై
సదసత్కర్మగుణానుగణ్యమను విశ్వస్తుత్యమై నిత్యమై.

తే. అట్టిపుణ్యపదం బగు నార్యభూమి
నెందఱో మహాత్ములు పుట్టి యెన్ని యెన్నొ
గొప్పకార్యము లొనరించి యొప్పమిగిలి
రాదికాలమునందుండి యప్పుడు నపుడు.

ఆ. శంకరుండు తాను శంకరాచార్యుఁడై
భారతంబునందుఁ బ్రభవ మంది
దుష్టమతములను సమష్టిమైఁ దూలించి
ధర్మరక్ష సలిపె ధరణియందు.

వ. తత్ప్రకారం బంతయుం జెప్పెద నాకర్ణింపుఁ డని మఱియును.

—: కలిధర్మవర్ణనము :—

మ. కలికి న్మూఁడగు వేలవర్షములలెక్కం జేర నొనప్పు డీ
య్యిల రారాజులు ధర్మకర్మవిముఖానిద్ధస్వభావాఢ్యులై
ఖలతం దెల్పెడుపద్ధతి న్నిలుపుచుం గా దంచు వేదార్థముల్
మెలఁగం జొచ్చిరి మాఱుపుంతఁ బడఁ గల్గెన్ సర్వవర్ణంబులున్.

మ. కలి రాజై ధరణీతలంబునకు వేడ్కం దోఁగు చుండంగఁ దో
డులు నీడల్ సచివుల్ సహాయు లయి తోడ్తోఁ గామముఖ్యుల్ ఘనుం
గొలువం దాను నిరంకుశుం డగుచు సంకోచింప కింతేని స
త్కులధర్మంబులఁ గూలఁ ద్రోయుచు సమర్థుం డయ్యె సర్వజ్ఞుఁడై.

తే. అతఁడు సత్యదయాదుల నవలఁ ద్రోచి
శ్రుతులకున్ నిల్వ నీడ యెచ్చోట లేని
యట్లు గావించి మనుమార్గమందు ముండ్ల
కంపలం గొట్టి ప్రజ నేఁచె గడుసువాఁడి.

సీ. వేది వేదంబును విషయంబు విడనాడి
కానిపింపనియట్టి గతికి వచ్చె
స్వాహాస్వధాదులు జాడ లే నట్టివై
యందందు శ్రుతులందు నరయ నయ్యె
గుడిగోపురంబు లే పుడమిలో నడుగంటి
స్వప్నగోచరములై సాలువడియె
విగ్రహారాధనవిధు లవేరికిఁ గాని
యెఱుక లేనట్టివై యెటులో వోయె

తే. కలిమహారాజు ప్రేరణ గలుగు కతనఁ
బ్రబలిదినం బొందు రెండు గా రాజశాస

నములు ప్రబలుట బ్రజ లెల్లఁ గ్రమము దప్పి
దుష్ప్రవర్తన మొనగింపఁ దొడఁగి రపుడు.

ఉ. స్నానము సంధ్యయున్ జపము సజ్జనసేవయు దేవతార్చ ల
న్దేనరుఁ డెప్పుడున్ సలుప నెంచఁడ యెంచిన వాఁడు శిక్షితుం
డై నెఱి దప్పి బందెఁ బడి నట్టిఁడునై పెరవాఁడు స్వీయుఁ డన్
మానస ముజ్జగించి మగమానిసి రోయుఁ గులాంబుజాక్షియున్.

తే. జనులు వర్ణాశ్రమంబుల జాడ తెలియ
నట్టివారైరి భూభాగమందు నెల్ల
వారు పాషండులై ద్విజవర్త్మ మనినఁ
దెగడి భైరవపూజలఁ దగులుకొనిరి.

తే. బ్రహ్మమును బ్రాహ్మణుం డన బైసిమాలి
నట్టిగతి కయ్యెఁ జండాలుఁ డనిన యంత
వానికిన్ గౌరవ మ దెంతయేని కలుగు
నట్టికాల మార్యావర్తమందుఁ బట్టె.

వ. అక్కాలంబున.

ఉ. గౌతమబుద్ధదేవుఁ డనఁ గాఁ జననాతఁడు వంగమందు భూ
నేతలయింటఁ బుట్టియును నేత్రృతఁ బూనక సన్యసించి తా
నై తనవారిఁ బాసి జగమంతయు వింతగ మెట్టువాఁ డహిం
సాతతత్త్వముం దెలిపె నా ప్తవచో రచనా నిగుంభనన్.

తే. జైన చార్వాక కాపాలి కానుగతమ
తములు చెలరేగి దేశమంతటను నిండి
వేదమత మన్న వాసన యే దెసఁ గన
రాక యుండెను వీఁకమై ప్రబలె నపుడు.

సీ. జీవకారుణ్యము చెవిఁ బడ్డమాత్రాన
స్వస్తి చెప్పిరి భూతబలికిఁ బ్రజలు
జాతిబ్రాహ్మల కొల్వు నీతియే యని విగ్ర
హార్చనలకు విడ్వనైరి నీళ్లు
పశుహింస కైన సవనముమార్గము సూపు
జముపీటి కని దాని సన్న విడిరి
హింస బోధించెడు నిహాహీహి శ్రుతి యని
దవుదవ్వులన్ దానిఁ దఱిమి కొనిరి

తే. జపము తపమును స్వాధ్యాయ సద్వ్రతములు
వృథలు వృథ లంచు వానిపైఁ బెట్టి నిర్గ
మనము పాతలు రోత లన్మతము చేసి
రోసి చేసిరి కర్మసన్యాసములను.

—: నారదుఁడు స్వర్గంబున కరుగుట :—

శా. ఆకాలంబున నారదుండు సకలానంతాధ్వము న్మెట్టి స్వ
ర్లోకంబుం గన నేగుదెంచుటయు నింద్రుండొట్టి బృందారకుల్
వీఁకం గైకొని కొల్వ నాతఁ డచటన్ విశ్రాంతిఁ గైకొంచు భూ
లోకాత్యద్భుతవార్తలన్ విసిచె వేల్పుల్ నివ్వెరం బొంగఁగన్.

వ. అప్పు డింద్రుండు మౌనీంద్రుం దరియ వచ్చి యి ట్లనియె.

ఆ. కొన్నినాళ్లనుండి కుశలంబునం దుండి
కానఁబడవుహవ్యకవ్యము లవి
కారణంబ దేమి కలదో యడ్గుద మని
తలఁచునంత నీవె తెలిపితి విటు.

చ. శ్రుతులు పురాణముల్ స్మృతులు హోమతపోఽధ్యయనాదులున్ జప
వ్రతములు వమ్ము లై చనెను వానికి నిల్వ నొకింత నీడ యో

క్షితితలమందు లే దనుచుఁ జెప్పగ నొప్పునె యింకమీఁద నే
క్రతువులు హవ్యకవ్యములు గల్గవొకో సురమానిశేఖరా!

తే. దేవలోకము దుర్భిక్షమై వడి చెడు
ననెడునానుడి సత్య మయ్యెనె మునీంద్ర
క్రతుభుజుల కింకఁ గతి యేమి మృతియ యనుదె
నావుడును మౌని యి ట్లను భావ మిచ్చి.

క. దేవళ్లు దేవమునులును
దేవేంద్రుఁడు గూడి పోయి దేవురు లాటల్
భావమున కంటుభాతిన్
భావించి వచించు టొప్పుఁ బరమేష్ఠికడన్.

వ. ఆతండు దీని కుపాయంబుచెప్పెడు నన నొనని వానిం గూడి దేవేం
ద్రుండు దేవతావారపరివృతుండై పితామహునిపాలికిం జని ప్రణ
మిల్లి దురపిల్లుచుఁ దెలియఁ జెప్పిన నతం డప్పటి కొప్పినచొప్పునం
జెప్పుచు నోదేవర్షులారా!

చ. కలఁడు సమస్తలోకములకష్టదశం దొలఁగించి యేలుకోఁ
గలిగినవాఁడు శంకరుఁ డొకం డతఁ డింతటిలో నిదంతయున్
దొలఁగఁగఁ ద్రోచి వైదికము నోఁపగఁ జేసెను రండు పోద మా
వలిములయల్లువానికి నివాసపదం బగువెండికొండకున్.

సీ. తనకొత్తుఁ డనక నెత్తినిఁ గే లిడఁగ బూదె
యగువరం బిడఁడె భస్మాసురునకు
నుడిగంబు సేయుచు విడక మోసలఁ గాతు
నని వరం బిడఁడె బాణాసురునకు
లీలమై జగ మేర్చుహాలాహలము గ్రోలి
యభయం బిడఁడె సురాసురులకుఁ

గనికర మెట్టిదో కాని కా దనక తా
సామె నొసంగఁడే హైమవతికి

తే. మఱియు నెందఱ కెన్నియో వరము లిడఁడె
యమ్మహాత్ముఁడు పరమదయానముద్రుఁ
డఖిలనతభక్తలోకసురావనీజ
మతని వేఁడి పొందఁగ రానియదియుఁ గలదె.

—: బ్రహ్మాదులు శివునికడ కేగుట :—

వ. అని యెల్లవారిం గూడి హిరణ్యగర్భుండు నిర్భరం బగు నింగి మార్గం బునఁ గైలాసంబునకుం జని సతీసమేతుం డగుపరమేశ్వరుం గాంచి నమస్కరించి.

శ్లో. పరమేశ్వర! గిరిజేశ్వర! సదనశ్వర! పర! స
త్కరుణాకర! గురుణానుత! శరణామరశరణా!
నిరుపాధికజనపోషక! వరవేషక! నిరతం
పరిపాలయ కుధరాలయ వరుణాలయశరధే!

సీ. కడలిఁ ద్రచ్చెడువేళఁ గలిగినవిషము ఫు
క్కిటఁ బట్టి జగము రక్షించి తీవు
సురల కసాధ్యమై వఱలునలువపున్కఁ
జేఁ బట్టి జగము రక్షించి తీవు
కూసి యెల్లరఁ జంపి కొను లేఁడిరక్కసుఁ
జెవిఁ బెట్టి జగము రక్షించి తీవు
విపరీత మొనరించు త్రిపురాసురులబాధఁ
జెడ గిట్టి జగము రక్షించి తీవు

తే. మఱియు ననితరసాధ్యముల్ వఱలుపనుల
నెన్నియేని యొనర్చితి వెన్నఁ దరమె

యట్టిలోకైకవిభునకు నభవునకును
నీకు వందన మొనరింతు మో కపర్ది!.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు.

చ. ఎఱుఁగుదు మీర లేమిటికి నిక్కడ కిక్కరణిన్ సుదీనులై
పరిపరి వేఁడ వచ్చితిరొ బ్రహ్మముఖామరులార! నారదుం
డెఱుఁగ వచించినట్టి యది యింతన తీఱెడునట్టి దంట కా
దరసి పౌనర్వ నా నవల నక్కలి రా జయి యందు నుండుటన్.

వ. మీరు పదుండు నేఁ దానికిం దగిన తెఱం గెఱింగి కార్యంబు ప్రవర్తింపఁ జేసెద నని వారి నంపిపుచ్చి కుమారస్వామిం బిలువ నంచి సర్వంబు నెఱింగించి యిట్లనియె.

చ. వినుము కుమార! వేదమును వేదియు భూతలమందు లేనివై
చనియె నధోగతిం గుమతజాలము జాలము వోలె నల్ల న
య్యోను మును నీవు భూగతికి నేగుము నేనును వెన్క నచ్చెదన్
మనము మతప్రచారమున మానఁ బొనర్త మధర్మమార్గముల్.

వ. అని మఱియు నోయికుమారా! నీవు భట్టపాదుండను పేరం బ్రవర్తించి బ్రహ్మంబును గర్మంబు నుద్ధరించి బ్రహ్మణ్యుండ వయ్యెదవు. విష్ణుండును శేషుండును సంకర్షణ పతంజలులై పుట్టి మధ్యను కాండం బుద్ధరింతురు. చతుర్ముఖుండు మండనుండై మహేంద్రుండు సుధన్వుండై పుట్టి ప్రభుత్వంబునం బ్రవర్తించుచు నీకు సాహాయ్యం బాచరింతురు. బౌద్ధాదులన్ జయించుపట్ల నీకు మహోన్నతశక్తి సామర్థ్యంబులు గలిగి యుండుం గాక యని బుజ్జగించి యంపిపుచ్చి తక్కినవారిం బిలిచి తగినట్లు చెప్పి యొప్పించి తానునుం బ్రయాణోన్ముఖుండై మనంబునం గొండొక విచారంబు గావించుచు మానం బవధరించి నిధ్యాననిశ్చలమనస్కుండై యుండె నంతఁ గొంతలోన.

తే. కాంత సహధర్మచారిణి చెంత నిలిచి
దీనవదనము తోఁపంగ దేవురింపఁ
గాంత! చింతింపఁ బోకు మే త్వర్మకు నేగి
నిచట నున్నట్లు వచ్చెద నింతలోన.

తే. అనుడు సహధర్మచారిణి నైన నన్నుఁ
దోడఁ గొనిపోవ ధర్మమై తోఁచెడు నన
నాపోనర్చెడుకార్యము నాతితోడఁ
గూడి సలిపెడునది కాదు కువలయాక్షి.

శా. ఆశ్లేయంబును బౌరుషేయమును బాయం జాల కున్నట్టిబ్ర
హ్మర్షి క్షేత్రమునందుఁ బుట్టి యతినై త్వర్మమండలాన స్మహో
హర్షం బేర్పడ సంచరించుచు నుపన్యాసంబులం జేయుచున్
ధర్షింపం దగునన్యదుష్టమత మద్వైతంబు స్థాపించుచున్.

మ. అతిఘోరం బగుయుద్ధమున్ సలుపున ట్లాయాప్రదేశంబులన్
మతవిద్వేషులతోడ వాదము లసామాన్యక్రియం జేయుచున్
శ్రుతిమన్మాన్యమతంబులన్ నిలుపుచున్ శ్రుత్యుక్తకర్మార్థమున్
ప్రతిపాదించుచు నాచరింప వలె నద్వైతంబు పూతంబుగన్.

ఆ. సర్వమును ద్యజించి సన్న్యాసిఁ యగువాఁడె
కాని కా డొరుండు కాంత గలుగు
వాఁడ మైన నట్టిపట్టునఁ గొఱగాఁడు
కలుగు నెన్ని యేనికష్టు లపుడు.

క. కనుమూసి తెఱచునంతన
చని వత్తుం బంపు నన్ను సౌహార్దమున నో
వనితారత్నమ! నీదగు
ఘనశక్తియుఁ దోడుపడగఁ గలిగెడు నాకున్.

—: ఉమామహేశ్వర సంభాషణము :—

ఆ. అనుడు నగజ యనియెఁ బ్రాణేశ! బ్రహ్మము
నుద్ధరించుపనికి నొం డొకండు
నడ్డు దగులుమాట లాడరా దని పతి
విరహ మింత సైఁప విధులఁ గొంటి.

శా. కానీ! ప్రాణవిభూ! ప్రియావచన మొక్కం డెల్లభూభాగముల్
గాన న్స్వచ్ఛ మతాంతరాకలుషముల్ కర్మప్రహీనంబులై
ప్రాణజ్యోతి పరాత్పరుండు ప్రభవింపం బాత్ర మాక్షేత్ర మెం
దేనిం గానఁగ వచ్చునే వినఁగ లో నెంతున్ జగద్వల్లభా.

వ. అనిన శంకరుండు.

తే. బౌద్ధజైనాదిమతములు ప్రబలి యున్న
నందు నందుఁ గొందఱు వసుధాధినాథు
లుండి రుత్తము లందు మయూరవర్మ
తెలియ వచ్చెడుఁ గేరళదేశమందు.

తే. ఆతఁ డాంధ్రదేశమునఁ బ్రఖ్యాతిఁ గన్న
సర్వవరమనుక్షేత్రరాజంబునందుఁ
గలరు నంబూద్రివా రనుబ్రాహ్మణువర్యు
లుత్తములు వారిఁ గొని పోయె స్వోర్వి కపుడు.

శా. ఆనంబూద్రికులద్విజోత్తముల గేహంబందు జన్మించి నే
నానందంబునుఁ గొన్నినాళులు మనుష్యానందముం బొంది వి
ద్యానంతప్రతిభాప్రభావమున బ్రహ్మద్వేషులం దోలి స
న్మానింపంబడి షణ్మతంబులను నోమం జాలి నే వచ్చెదన్.

వ. అనుచుం గనుచునుండ నంతర్ధానంబు నొందె నగజయు గౌరీవనంబు
నకుం జని పతివిజయంబుఁ గోరుచుఁ దపంబుండె నంత నక్కడ

మయూరవర్మ సర్వవరంబునుండి నంబూద్రిబ్రాహ్మణకుటుంబములం దెచ్చి తన కేరళదేశంబున కాభరణాయమానంబును బుణ్యానదీ తీరవిరాజమానంబు నగుకాలటి:యను గ్రామంబు నగ్రహారంబు గావించి వారికి ధారాపూర్వంబుగ దత్తంబు గావించి నివసింపం జేసె నయ్యగ్రహారంబును

—: కేరళ దేశవర్ణనము :—

సీ. ఛెప్పన్న దేశాలఁ జెప్ప నొప్పుచు నుండు
కేరళదేశము కీర్తిత మయి
భరతఖండమున కవాగ్దిశ మలయాచ
లసమంచితం బయి పస నెసంగి
నాళికేరములు పున్నాగముల్ పోకలు
మాకందములు పెక్కు లేకడలను
మలయాద్రినుండి తా మెలమెల్లఁ జనుదెంచి
కమ్మవాసనఁ గ్రుమ్మరించు పయర

తే. ఏలకులు లవంగములు నల్మాలల నగు
డిల్లిభోగాలు రాజనా లెల్లకారు
లందునుం బండు ననఁటిపండ్లారెపనస
పండు లెన్నెన్నొ కేరళమండలమున.

ఉ. కేరళదేశమధ్యమునఁ గేవలవిప్రనికాయసేవితం
బై రమణీయ హర్మ్యనిలయం బయి పూతవిశాలవీథికా
తీరమనోహరాగపరిధి ప్రతిభావితమై వితర్గికా
వారసమంచితం బయి ప్రభం జనుఁ గాలటి యగ్రహారమై.

సీ. ప్రవహించు నేయూరిపరిసరంబునయందుఁ
బూర్ణానది కృపీటపూర్ణ మగుచు

భాసిల్లు నేయూరిప్రాగ్భాగమునయందు
వృషభగిరీంద్రము విభవసాంద్ర
మలరొందు నేయూరివెలుపలఁ గోవెల
శంకరుం డాశ్రితశంకరుండు
మానొందు నేయూరిమధ్యమున న్వేద
విద్యావిశాల సద్వేద్యశాల

తే. అలరు నాయూరు వర్ణింప నయితి యగుచు
బ్రహ్మలంతల కది సర్వభద్ర మఖిల
విద్యలకు నాకరంబు పృథ్వీనుపర్వ
పర్వ మొప్పును గాలటి భాగ్యపేటి.

తే. అందు విద్యాధిరాజవిఖ్యాతనామ
విప్రవర్యుఁడు నంబూద్రి వెలయుచుండఁ
దనకు సహధర్మచారిణి తగినరీతి
సాహచర్య మొనర్ప గేస్తై హావణిలి.

సీ. శ్రుతిచతుష్కమునందు నతులితప్రజ్ఞ కై
శాస్త్రము లాఱును సంతరించి
స్మార్త మంతయు నొక్కసంథనధిగమించి
శ్రౌతమం దత్యంతశౌండుఁ డగుచు
నలరుజ్యోతిర్విద్య కలయంతయు గ్రహించి
వేదాంతవేత్తయై విశ్రుతుఁ డయి
ప్రకృతిశాస్త్రంబులఁ బ్రతిభాసమంచితుం
డయి మంత్రశాస్త్రమం దనితరుఁ డయి

తే. ముద్దు లొల్కుకవిత్వముప ద్దెటింగి
కావ్యములు శ్రవ్యదృశ్యముల్ గలుగఁ జేసి

యఖిలవిద్యలఁ గాణాచి యయి యతండు
వెలసె విద్యాధిరాట్ప్రదభిఖ్యఁ డగుచు.

—: విద్యాధిరాజునకు శివగురుండు పుట్టుట :—

చ. శివుని సదా భజంచెడువిశిష్టగుణుం డగునమ్మహీసుర
ప్రవరునకుం గుమారుఁడు శివప్రథితప్రబలప్రసాదసం
భవుఁ డయి తోఁచె నార్యులపైఁబడు నీడున నంతవానికిన్
శివగురునామధేయమునఁ జేసె మహంబు మహోన్నతంబుగన్.

తే. జ్ఞాననిధి గావున శివుం డనూనధీస
మేతుఁ డగుట గురుం డని చేతమునఁ ద
లంచి విద్యాధిరాజు సమంచితగతి
శివగురుం డని పే ర్వెట్టి శిశువుఁ బిలిచె.

వ. శివగురుండును శుక్లపక్షక్షపాకరునిచందంబున దినదినప్రవర్ధమానుండై చౌలోపనయనాదిసత్క్రియాసంస్కృతుండై గురునిపంపున గురుకులంబునకుం జని శిక్షావ్యాకరణ చ్ఛందో జ్యోతిర్నిరుక్త కల్పంబు లనుషడంగమ్ములతో నాలుగు వేదంబులును, తర్క వ్యాకరణ ధర్మ మీమాంసా వైద్య జ్యోతిషము లనుషట్ఛాస్త్రంబులును, శ్రౌతస్మార్తాదివివిధవిద్యలు నేర్చి విశారదుండై గురుననుమతిం బడసి గృహంబునకు వచ్చి మాతాపితృప్రీతికరుం డయ్యె నయ్యెడ.

ఉ. కాలటికిన్ సమీపమునఁ గ్రాలెడుకొండొకగ్రామమందు వి
ద్యాలలితుండు బ్రాహ్మణుఁ డనంతతపోవిభవాభిరాముఁ డా
ర్యాలలనామనోహరపదాబ్జయుగాతిసమర్చనాలస
చ్ఛీలుఁ డనంతనాముఁడు ప్రసిద్ధికి నెక్కెను వేదమూర్తియై.

తే. వైదికకుటుంబ మాతనివామనేత్ర
తులితసత్యవతీదేవి వెలసె సత్య
వారి కార్యామహాదేవివరమువలనఁ
గలిగె నార్యాంబ యనునొక్కకన్నెమిన్న.

—: శివగురుని వివాహము :—

తే. అతఁడు విద్యాధిరాజున కనుఁగుసఖుఁడు
తనదుకన్నియ నాతనితనయుఁ డైన
శివగురున కిచ్చి యార్షధర్మవిధిఁ బెండ్లి
చేసెఁ బిత్రుదేవతాప్రీతి చేకురంగ.

చ. శివగురుఁ డామెహస్తమును జేకొనినట్టిముహూర్తమెట్టిదో
శివమునకై మున శ్శయి వసించెడుతల్లినిఁ దండ్రిఁ గొల్చుచున్
బ్రవిమలచిత్తుఁడై గృహముపాలనముం బొనరించుకొంచు శి
ష్యవరులకున్ శ్రుతిస్మృతులఁ జక్రమము చెప్పుచు నొప్పె నొప్పుగన్.

తే. స్నానసంధ్యాగ్నిహోత్రముల్ జపము తపము
తల్లిదండ్రులసేవ విద్యాప్రసంగ
మతిథిపూజయుఁ గాక యొం డైనకర్జ
మాతనికి నెప్పుడును లేద యనఁగ వచ్చు.

మ. తులితశ్రీ శివదేవుఁ డాతఁడు శివస్తోత్రోత్తమగ్రంథముల్
లలిఁ బారాయణ మాచరించుచు శివాలంకారము ల్మెచ్చుచున్
గలలోఁ గాంచులలో శివుం డొకగుఁడే కా కొండు లే డంచు వా
కులు గావించుచు నెప్డు లోన శివునిం గొంచు న్వసింపున్ ధరన్.

వ. అతనిసహధర్మచారిణి యగునార్యాంబయు.

ఉ. అత్తకు మామకున్ మగని కార్య సపర్యల నాచరించుచున్
మెత్తనిచిత్తముం గలిగి మిత్రుఁడు తోఁచినదాది రాత్రియా

న త్తఱిదాఁక యింటిపను లన్నియుఁ దీర్చుచు దేవపూజలన్
బత్తి ఘొనర్చుచున్ సతులమానికమై తనరారె నీల్వొనర్.

తే. అతిథు లభ్యాగతులు రాఁగ నార్య వారి
దేవతాస్వరూపులు గా మదిం దలంచి
షడ్రసోపేతముగను భోజనము వెట్టి
యన్నపూర్ణకు నుద్ది నా నన్నఁ గాంచె.

శా. ఆర్యాంబాపరిచర్యలం దనియుచున్ స్వాధ్యాయనిష్ఠాపరుం
డార్యాప్రాణవిభూత్తమాంఘ్రియుగళధ్యానైకచిత్తాబ్జుఁడై
శ్వర్యాహంకృతిదూరుఁ డాశివగురుశ్లాఘ్యదేవుఁ డవ్వేళ నా
దార్యం బేర్పడ నిల్లు దీర్చుచును విద్వద్వంద్యుఁడై పేర్పడెన్.

తే. ఆతఁ డగ్నులఁ గొల్చు చహర్నిశంబు
శిష్యులకు బ్రహ్మపాఠము చెప్పుచు నతి
థులను మన్పుచుఁ గొన్నినాళులు సనంగఁ
దల్లిదండ్రుల బ్రహ్మమేధమునఁ దనిపె.

వ. ఇట్లు కలకాలంబు కడచినంత.

—: శివగురు పత్ని సంతాన విచారము :—

మ. ఒకనాఁ డార్య మనోహరుం దరియనై యోప్రాణనాథా! గృహ
స్థకళం దేలెడువారు సంతతికి నిచ్చం గొందు రద్దానఁ బై
తృక మప్పేగుఁ టె కాక వంశ మభివృద్ధిం గాంచు నీమీఁకు నూ
టికి నాల్గుంబదు లేదులే కొఱగ దాఁటెం బ్రాయ మీనాఁటికిన్.

క. పున్నామనరకమందలి
బన్నంబులఁ జివుక నీక వరతనయుం డై
త న్నుద్ధరించుఁ గావున
నెన్నంబడుఁ బుత్రుఁ డనుచు నిలలో నాథా.

తే. కాశి నైనను బుత్రునికడ నైన
మఱియు మోక్షము కరతలామలక మనరె
వేయు నేటికిఁ బుత్రుల వెలయఁ గనక
వేఁగుపాపుల జన్మంబు విగతఫలము.

వ. "అపుత్రస్య గతి ర్నాస్తి" యని లోనగు నెన్నియో సన్నుతోక్తులు పలికి మఱియును.

సీ. మెఱుఁగు నా మేనెల్ల మెఱమెఱ మెఱయంగ
వేవిళ్లఁ బడునింపు వెంప నైతి
సీమంతవతు లెన్న సీమంతమున మేటి
గాజులు గొనుమేలు గాంచ నైతి
దరి లేని పెరిమ లోఁ దగుల బందుగు లిడు
సూడిద లంద నేఁ జూడ నైతి
నోదివి పుణ్యాంగన లోదార్చుచుండ బి
డ్డఁ గనునొప్పులు పడఁ దగుల నైతిఁ

తే. దనయుఁ డని మంత్రసాని నా వినఁగ నైతిఁ
బొసఁగఁ గాయము కాయ మే మెసఁగ నైతిఁ
బసపుచీఱలు నడికట్టఁ బట్ట నైతి
వెలయ బాలింతవేష మే వేయ నైతి.

మ. కడుపుం జేతులు నాన నూని కడు వేడ్కం బిడ్డ నడ్డాలు గా
నిడి కొంచున్ నెనరుంచి చన్గుడిపి యెంతే గ్రుక్కిళుల్ మ్రింగఁ బా
ల్కడుపు న్నిండగ నిచ్చి నూనె యొడలెల్లన్ రాసి యుయ్యేల నిం
పడర న్నిల్పుచు నూఁచి పాడు విభవంబా దీనికిం గల్గెడున్.

చ. సవురుగ నెత్తికొం చెడమచంకను బంగరుగిన్నెలోన మే
లవుకలమాన్నముం గలిపి యా వను మోననుఁ గన్నదండ్రి! యీ

బువఁ దిను తాఁయిలం బిడుదు ముద్దులబిడ్డ! యటంచుఁ జాల బు
జ్జవ మొనరించుచున్ గొడుకు సాఁకగ నోములు నోచ నైతిఁ గా.

ఉ. గజ్జెలు నందియల్ పదయుగంబున గల్గని మ్రోయ మెట్టుచున్
బుజ్జవ మారఁ బొత్తములు పూసి కరంబులఁ దోటివారితో
నోజ్జలపజ్జఁ జేరి చదు వొప్పఁగ నేర్చెడుపట్టితోడ నే
యజ్జున ముద్దులాడుసుక మందగ నోఁచనిదాన నైతిబో.

ఆ. మనుజజన్మ మెత్తి మఱి గేస్తురా లైన
వనజనేత్ర పుత్రుఁ గనుటకంటెఁ
బూర్వజన్మసుకృతములకు ఫలము వేఱె
నెగడఁ బోవ దధిప! నిజము నిజము.

—: శివగురు దంపతులకు యోగి దర్శనమిచ్చుట :—

క. అని యార్య దీనవదనం
బునఁ బల్కెడునంతలోన ముంగిలిఁ జేరం
జనుదెంచె నొక్కమునివరుఁ
డనుపమ తేజోనిధాన మని పే ర్వడుచున్.

ఉ. వచ్చినవానితల్లజుని వా రెదు రేగి నమస్కరించుచుం
దెచ్చి కుశాసనంబునను నిల్పి సపర్య లొనర్చి వీవనల్
హెచ్చినభక్తి వీచుచు నొకింతటిలోపల సేద దేర్చి మీ
రెచ్చటినుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కేగు దెంతురో.

ఉ. మీరు మహానుభావులరు మీదగుదర్శనభాగ్యసంగతిన్
మారుజ లన్నియుం దెగియె మాన్యుల మైతిమి మాకులంబు ని
ద్ధారుణిఁ బూతమై పొగడితం గొన నయ్యెఁ దలంప దైవ మీ
తీరున వత్సలత్వమును దెల్పఁగ వచ్చె నటందు మంతటన్.

వ. శివగురుండు సాష్టాంగ నమస్కారంబు గావించి సంయమీంద్రుం గాంచి మఱియును.

ఉ. ఈవు త్రికాలవేదివి మునీంద్రుఁడ వింద్రముఖాదిదేవతా
భావితమూర్తి వీడెసుభావ్యుఁడ వెల్లతలంబు మెట్టి వ
త్తీ వెఱుఁగంగరాని దెట నేని సుమంతయు లేదు నిక్క మీ
దేవికి గర్భధారణవిధి న్వివరించి వచింపవే దయన్.

చ. అనవుడు మౌనిచంద్రుఁ డను నార్య వచించెద నాలకింపు మీ
వనినటు దైవ మే సనుచు నాడను గాని తపోవ్రతస్థితిన్
బొనరుచు నొక్క శైవమునిముఖ్యుఁడ సంచు వచింతు మీకు నం
దనుఁడయి శంకరుం డొదవు తథ్యము మీ కెఱింగింప వచ్చితిన్.

వ. అని పలుకుచు నంతలో నంతర్ధానంబు నొందెనంత శివగురుదంపతు లత్యంతానంద కందళితాంతరంగులై నాఁడు గడపి మఱునాఁ డరుణోదయమ్మున లేచి కాల్యకృత్యంబులు నిర్వర్తించుకొని.

సీ. వేదవిద్బ్రాహ్మణులఁ బిల్చి విఘ్ననాథుఁ
గొలిచి వేదాశిషంబులు చెలఁగుచుండ
శుభముహూర్తము రాఁ జూచి శ్రుతినినాద
మొదవ శాసనమంత్రముల్ చదువుకొనుచు.

—: శివగురుదంపతుల తపఃప్రకారము :—

వ. ప్రయాణంబై వృషభాద్రికిం జని దేవళంబుచుట్టుం ద్రివారంబులు చుట్టి స్వామిసాన్నిధ్యంబు గలిగించుకొని యొక్కచో భూభూత శుద్ధిపూర్వకంబుగాఁ గుశాసనంబుల నాశీనులై శాస్త్రోక్తక్రమంబున జపతపోవ్రత నియమంబున నుండి పయోవ్రతంబు చేయుచు శంకరు నారాధించు చుండి రపుడు శివగురుండు.

సీ. అరుణోదయం బగునపుడు పూర్ణానది
కరిగి స్నానాదిక మాచరించి
పూర్ణకుంభముతోడఁ బుణ్యోదకముఁ గొంచు
వృషభాద్రికిం జని వేదవిహిత
మంత్రములన్ సర్వమంగళేశ్వరు నభి
షేకాదు లర్చనల్ చేసి భక్తి
భజియించి జపతపస్స్వాధ్యాయములు దీర్చి
రుద్రపారాయణారూఢిఁ దనరి

తే. శివపురాణము సాయాహ్న మవువఱకును
శివుని ధ్యానించుచుఁ బఠించి శివసహస్ర
నామములు షడక్షరిని సంధానపఱచి
నిచ్చలును మూఁడువారముల్ నెఱి భజించు.

వ. ఆర్యాంబయును.

సీ. వేకువ నిజభర్త వెనుకఁ బడెనుసత్స్ఫూ
శయనస్థలమునుండి సరగ లేచి
కాల్యకృత్యంబులు కడతేర్చి పతితోడఁ
బూర్ణకుం జని జలంబులను నాడి
మడుఁగు దోవతులను జడముల జాడించి
బీరెండ నాఱిచి పింజ దీర్చి
భుజముపై జలకుంభమున కుపధానము
గా నిడుకొని భర్తకాలిజాడ

తే. గుడికిఁ జని తపోవేదికకడను విభుని
వెనుకొని వసించి పూలును బిల్వదళము
లును ఫలంబులు నందిచ్చుచును భజించె
ధవుఁ డొనర్చిన రీతిని దాఁ బొనర్చి.

-: శివగురు దంపతులకు శివుఁడాజ్ఞయిచ్చుట :-

చ. నలువదినాళ్లు లీకరణి నాథుఁడు దాను దేవతార్చనల్
సలుపుచు నుండ నాఁటినిశ స్వామి సమక్షమునందు భర్తకా
ళులకడ నార్య పండుకొని లో శివునిం దలపోయుచుం గనుం
గలువల నింతమోడ్చి వెనుకం దొలికోడి ధ్వనించె నంతలోన్.

తే. ఆర్య కలలోన శివపూజ నాచరించి
యమృతోన్నై వేద్య మొసరిం చునంతలోన
విభుఁడు తెలవారె లెమ్మని పిలువ మేలు
కాంచె నైవేద్యవిధి యదికాకమున్నె.

వ. తత్తఱంపడి యత్తలోదరి యారగిం పారగిం పనుచుఁ ద్రుళ్లిపడి లేచి పతిం జూచి స్వప్న వృత్తాంతం బెఱింగించె నంత శివగురుండును.

ఉ. దీనముఖంబు దోఁప సతిదిక్కు గనుంగొని యన్నుమిన్న నా
కైనకలన్ వచింతు విను మాపరమేశ్వరు నర్చసేయఁగాఁ
బూనితి మంత్రపుష్ప మది పూర్తిగఁ జెప్పక మున్నె గొక్కురో
నా నొకనాదు నాదుచెవి నాటెను నాటిన మేలుకాంచితిన్.

క. ఆలో శంకరుఁ డింకన్
జాలును మీదీక్ష నాప్రసాదంబున మీ
కీలోఁ బుత్రుం డొదవెడు
భూలోకము వానిమూలమున శాంతి కనున్.

తే. అనుచుఁ గలలోన వచియించి చనియె శివుఁడు
సెలవుఁ గొని పోవుదము మనక్కెలమి మీఁఱ
సుతుఁడు ప్రభవించుఁ గాని తత్సుఖము మనకు
మాత్ర మత్యల్ప మని స్వప్నమహిమ దెలుపు.

వ. అని శివగురుండు శాంతి పఠించి పడంతితోడం గూడ గృహంబునకుం జని బ్రాహ్మణసమారాధనంబు గావించి సుఖంబుండె నంత నక్కడఁ గుమారాదులు శివాజ్ఞం బడసినవారు గావున భూతలంబున వివిధ ప్రదేశంబులం బ్రభవించి రాకర్ణింపుఁడు.

—: కుమారాదులు భూమిపైఁ బుట్టుట :—

తే. ఉత్కలాంధ్రమధ్యమునందు నుండు విజయ
మంగళగ్రామమందుఁ గుమారుఁ డొదవి
భాట్టుఁ డనియుఁ గుమారిలభట్టు, భట్ట
పాదుఁ డన నొప్పి బ్రహ్మముం బాదుకొలిపె.

తే. ద్రావిడాంధ్రమధ్యస్థిర బ్రహ్మ మండ
నుం డని మఱియు విశ్వరూపుం డనఁ దగి
యుభయభారతిఁ బెండ్లాడి సభలఁ గర్మ
కాండమును జెప్పి విజయంబు గాంచె నపుడు.

ఆ. శోణనదము చెంతఁ జొప్పడు రాజగృ
హమున విష్ణుమిత్రుఁ డను ఘనునకు
నుభయభారతి యన నొప్పి సరస్వతి
యఖిలశాస్త్రవేత్రి యనఁగఁ దనరె.

ఆ. పశ్చిమోత్తరమునఁ బద్మనాభుఁడు విమ
లాఖ్యునకు సునందుఁ డనఁగఁ బుట్టి
పద్మపాదుఁ డనెడుప్రథమశిష్యుం డయి
సర్వరక్షకుఁ డయి సొంపుమీఱె.

తే. ఇంద్రుఁడు సుధన్వుఁ డనెడురాజేంద్రుఁ డగుచు
వైదికాచారనిరతుఁడై బౌద్ధజైన
వీరులం జేసఁ దీసెఁ గుమారుఁ బుచ్చి
శిక్షితులఁ జేయు తలఁపు లోఁ జేరుకొనుట.

తే. ఆశుగంబు హస్తామలకాఖ్యుఁ డయ్యెఁ
దద్దశాంశమునం బుట్టె ధరణిఁ దోట
కాఖ్యుఁ డానందగిరి యయి యవనిఁ బుట్టె
గురుఁడు ధర్మశాస్త్రములఁ గుదురుకొలుప.

వ. మఱియు శేషుండు పతంజలి గాను సూర్యసారథి యగుననూరుండు సునందనుండు గాను వరుణుండు చిత్సుఖాహ్వయుండు గాను మఱియు ననేకు లగుదేవత లనేకభూదేవతలు గాను భూతలంబునం బుట్టి రని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పు మని కథకు నడుగుటయును.

ఆశ్వాసాంతము

శా. స్వార్థత్యాగము చేసి దేశమునకున్ సర్వస్వ మర్పించి ప్ర
త్యర్థిప్రాణము లేనిచందమున నై ధర్మార్థకామంబు ల
న్వర్థప్రక్రియ నాచరించుచును దేహం బెన్న లోకోప కా
రార్థంబే యనుపేరుశాస్త్రిసుతు సత్యాఖ్యున్ శివుం డేలుతన్.

శా. నే సేవాఁడను నన్నుఁ బ్రోవు మనుచున్ నిక్కంబు భాషించినన్
వానిం బుత్రునికన్న మిన్నగను సంభావించి తత్తన్మనో
నూనార్థంబులు దీర్చి చేర్చినదయ న్పోషించి రక్షించు వి
జ్ఞానానందమయాంతరంగుఁ డగునా సత్యుండు నిత్యుం డగున్.

స్రగ్విణీ వృత్తము

సత్యనారాయణున్ - సత్యపారాయణున్
నిత్యదానాంచితున్ - నిర్మలాంతర్గతున్
ప్రత్యయారాధకున్ - ప్రాజ్ఞసంబోధకున్
సత్యనారాయణ - స్వామి ప్రోచున్ సదా.

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబైన జగద్గురు చరిత్రమున
ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

# జగద్గురు చరిత్రము

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీయాలమూరుపురమున
శ్రీయున్ సంపదయుఁ దనకుఁ జేదోడుగ భ
ద్రాయితమతి యై సత్య
శ్రీయుతనారాయణుండు చెన్నలరారున్.

—: ఆర్య గర్భవతి యగుట :—

వ. అక్కథకుండు శ్రోతలకిట్లనియె నట్లు వృషభాద్రినుండి వచ్చి గృహంబున దేవతాబ్రాహ్మణసమారాధనంబు గావించుచు జాయాపతు లత్యంత సౌఖ్యంబునం దేలుచున్న కాలంబున నార్యాంబ గర్భవతి యయ్యె నయ్యెడ.

క. నెల దప్పెఁ గోర్కు లొప్పెన్
బలుకులు నడకలును జాల బడలికఁ జెప్పెన్
బలువేవిళ్లొగిఁ గప్పెన్
వెలవెలనై మోము కళలవిప్పుం గుప్పెన్.

క. అలరెడు తేలముతోడన్
వెలుగొందెడుకోడుకు లోన వెలసినకతనన్
నెలఁతుక యొడ లయ్యెడలం
దళతళ మనుకాంతి నలరెఁ దగఁ బగికింపన్.

తే. వెలఁదిమిన్న పాలిండ్లకుఁ బిరుదులకును
నడుమ నుండి లే దన నొప్పు నడుము మిగులఁ
బ్రబలె ధనికుల నిరువురఁ బట్టి కరుణ
వడసి చను బీద జగమునఁ బ్రబలు టరుదె.

ఆ. ఇట్లు నీరు మోసి యెలనాగ తొమ్మిది
నెలలు నిండినంత నలరు రాధ *
మునను శుక్లపక్షమునఁ బంచమిన్ భాను
వాసరమునఁ బట్టపగటివేళ.

—: శంకరుని జననము :—

క. ఇన శని కుజు లుచ్చగతిన్
గొన గీష్పతి కేంద్రమందు గొన బొందగఁ ద
క్కిన గ్రహములు శుభగతులం
దనరఁగ శుభలగ్నమందుఁ దనయుం గనియెన్.

చ. నెఱి లగనంబునం బొడమి నిద్దపు తేజున నెల్గుచున్న యు
చ్చిఱుతను మంత్రసాని తన చేసురియం దగ బొడ్డు గోసి పో
గరితలు లాలవోసి వెనుకం బొడితోఁ బొగవేసి యున్యోలం
బఱచిన మెత్తలం దునిచి పాటిలుపాటలు పాడి యూఁచుచున్.

ఆ. గాలి దూలి సోకి కందు సెడక యుండ
జల్లి బూదె వేళ్లు వెల్లకులును
నూఱి పొగలు వేసి నోములు నోఁచిరి
పేరటాండ్రు భక్తి పేరుగొనఁగ.

* కొన్నిగ్రంథములలో వైశాఖశుద్ధదశమి యని యున్నది. రాధము = వైశాఖము

చ. కొమరుఁడు పుట్టినంతటను గోరిక లీరక లెత్తఁ బండితో
త్తముఁడు శివాఖ్యభూమిసురతల్లజుఁ డల్లన నాడి జాతక
ర్మము నొనరించి బ్రాహ్మణసమాజసమంచితవేదనాద ము
త్తమగతిఁ గ్రాలఁగాఁ జలిపె దానము లెన్నియొ యెల్లవారికిన్.

తే. కాలటిం గల్గువారికి గట్నములుగ
నింటివసనను వస్త్రము లిచ్చి పప్పు
బెల్లములు పంచ్చు వచ్చినపిల్లల కిడి
మహము గావించె శివగురు వాహ వాహ నాఁగ.

వ. అక్కాలంబున.

సీ. జడలు గట్టిననెత్తి జాబిల్లి వలె రేక
నొసటఁ గన్నుంబలె నెసఁగుమచ్చ
పటికంపుడాల్ మేనఁ బరువు లెత్తుమతీఱు
గళమందుఁ గఱితాల గలుచునలుపు
మూఁపురంబులపయి ముమ్మొనవాల్ గుర్తు
లుదరంబునం బాములాడుజాడ
జడలలోఁ బడి పాఱ సాఁగెడుబయలేటి
తరగలచిన్నెలు దాల్చుమచ్చ

తే. వచ్చి కనుగొంచుఁ బేరటాం డచ్చెఱువొందు
పరమశివుసంశమునఁ జేసి వసుధ నవత
రించె నిట్టు లార్యాంబ కావించినట్టి
పుణ్యపరిపాక మని మెచ్చి పోవుచుండ్రు.

ఆ. పురిటినాళ్లు గడచి పోఁగనంతట బార
సాలఁ జేసి శివుప్రసాదమునను
సంభవించెఁ గాన శంకరనామ మా
శిశువునకుఁ బొనర్చె శివగురుండు.

—: కుమారుని గదిలో నద్భుత దర్శనములు :—

మ. ఒకనాఁ డార్య కుమారుఁ దొట్టె నిడి యెన్నో పాటలం బాడి ని
ద్రకుఁ గన్మోడ్చినవాని వీడి మొసవం దా లోనికిం బోయి కొం
డొకయంతం జనుదెంచి దవ్వులఁ గుమారోత్పాతముం జూచి గా
డక హాహారున రొమ్ము కొట్టుకొను చేద్వం జొచ్చె నుద్వేగతిన్.

వ. ఆరోదనంబు శిష్యులకు వేదపాఠంబు చెప్పు శివగురుండును విని సిత్నై
తనుంగ్రైన ట్లుండియుం జెండువడి నడినడిం జని పుడమిం బడి బడి
బడియ వలుపడఁతిం గని పట్టి లేవనెత్తి తత్తరంపడుచు గద్గద
స్వరంబున ని ట్లనియె.

తే. ప్రాణసఖి! యేమి యీమూర్ఛ బైసినాని
నేలఁ బడి యేడ్చుచుంటి వి ట్లేల వచ్చె
కొడుకుకుఱ్ఱఁడు కుశలి యొక్కో యెదేని
దేహరుజ వచ్చెనో చెప్పఁ దివురు మనుఁడు.

తే. వడకుచుం బ్రాము పా నుదె పాగనిమొయిఁ
జుట్టుకొని యాడుచున్నది చూచితి సగెు
పాములన్నృసింహు పిలువుఁ డో ప్రాణనాథ !
ప్రాణ మిచ్చిన వాని కేఁ బ్రాణ మిత్తు.

తే. అనుచుఁ సతిమాట చెవిఁ బడుసంత శివగు
రుండు నిలువెల్ల సీ గ్గార నొండు గనక
పుడమిపై వ్రాలె హా! పుత్ర! పుత్ర! యనుచు
నంతలో వారిశిష్యులు కొంత తేర్చె.

వ. లేవనెత్తి వారిలోనున్న వారు కొందఱు కుమారశయనస్థలంబునకుం
జని చూచు నంత.

ఉ. పాముసు గీము లేదు గురువర్య! కుమారుఁడు నవ్వుమోముతో
నామెయి సేమెయిం గనుచు నాటలు నాడుచు నుండె నంచు వా
రామె కుఁ బుత్రుఁ జూపి కనుమా! జననీ! యహిభూషుఁ డీసుతుం
జేమిటి కిట్లు కుందెదవొ యేటికి వచ్చెను మీకు నాపదల్.

చ. గురువర! చూడు మన్నఁ గనుఁగొంచు నతం డది చిత్తవిభ్రమం
బరయఁగఁ జీమ కైనఁ జొర నైతి లభింపనియింటిలోని కే
కరణి సరీసృపంబు చొరఁ గల్గెడు నక్కట! పుత్రమోహ మీ
పరున ఘటిల్లఁ జేసె నని పల్కుచు శాంతి వహించె నంతటన్.

వ. ఆర్యాంబయుఁ దనచిత్తవిభ్రమంబునకు సిగ్గుపడుచుఁ గుమారుం గదిసి యెత్తుకొని పాలిచ్చి పండుకొనం జేసె నంత.

ఆ. మఱియొకప్పు డార్య వరసుతునకు నుగ్గుఁ
బాలు పోసి జోలువాయుయేలఁ
బండుకొనఁగఁ జేసి పాటలు పాడుచు
నిదురపుచ్చి యిచ్చ గదుసుకొనఁగ.

ఆ. జలక మాడ నెంచి చనునది పతి డాసి
తనయుఁ జూచుచుండుఁ డనుచుఁ జెప్పి
వడిగ నడచె నప్పుడు పార్వతీపరిణయ
చిత్రగాథఁ జదువు శివగురుండు.

వ. దానిం గట్టిపెట్టి పట్టి పండుకొనియున్నచోటికిం గ్రన్ననం జను దెంచె నంతలోన.

ఉ. తెల్లనిమేనికాంతి నలుదిక్కులు పిక్కటిలంగఁ జేయుచున్
గల్లని గంట మ్రోయుచును గంఠమునం దగులంగ గంగియొ
ద్దల్లనఁ జెంత నిల్వ నలినాయతలోచన చంద్రరేఖతో
నల్లనిమేనితో శిశువు నర్మిలి ముద్దులు గొంచు నుండఁగన్.

యొద్దియుం గాంచఁజాలకది శిష్యులప్రమాదం బని వారి మందలించి రిట్లు పరమాద్భుతంబు లెన్నియో యప్పుడప్పుడు చూపట్టుచుండ దిన దినప్రవర్ధమానుండై కుమారుండు రెండు మూడేండ్ల యీడుగల వాఁడై యాటలుం బాటలు నాడఁ జొచ్చె నప్పు డార్యామనోహరుండు.

ఉ. లోకముతోడి వాఁ డనుచు లోఁ దలపోయఁగ రానియట్లు గా
నాకొమరుండు వర్తిలుట లారయుచుం దనజన్మపత్రికన్
వాకొనవచ్చు మారకము వార్త లెఱుంగుటఁ గన్నబిడ్డకున్
ప్రాకొనఁ జేయ బ్రాహ్మ్య మొకకాలమునం దలపోసె వాసిమై.

క. గర్భాష్టమాబ్దమున వి
ప్రార్భకునకు నిహితమైన నైదవయేడున్
నిర్భరధర్మం బనుచున్
స్వార్భవు లుపనయనవిధులఁ బలికిరి స్మృతులన్.

—: ఉపనయనము - గురుకులప్రవేశము :—

తే. వేదశాస్త్రోపదేశము విధి నొనర్ప
చనునఁ జెప్పిన నింతలోఁ జదువు సుతునిఁ
జూచి యానంద మొంది నేఁ జూడఁ బోదు
ననరఘుని కని యార్య కయ్యాది వచించి.

వ. విద్వజ్జనానుజ్ఞం బడసి పంచమాబ్దప్రారంభంబునన చౌలవిధిం బొందిన శంకరునకుఁ బంచశిఖలం గల్పించి కౌపీనంబు గట్టఁబెట్టి యేణాజినంబుతో యజ్ఞోపవీతంబును బాలాశదండంబును ముంజరశనయు ననురం జేసి సంత నుపనయనాధికారము సిద్ధింపం జేసి వేదమాత నుపదేశించి చతుర్థదినంబున మేధాజననాదికలాపంబు గలిగించిన

పదంపడి కాలటి కింతదవ్వున నున్నవిప్రాగ్రహారమున సాగ్నిజి త్సర్వతోముఖయాజి గురుకులంబునఁ జదువం బ్రైటె నంత నక్కు-మారుండును.

చ. గురుకులమందు విద్యఁ గయికోఁ జను దెంచిననాఁటినుండి యు య్యరుఁడు తూర్పుకొండదరి కాగతుఁ డయ్యెడునట్టివేళ ని ద్దుర విడనాడి లేచియును దోడన కల్యము లెల్లఁ దీర్చి చె చ్చెర నదిఁ నాడి వారిచి శుచివ్రతుఁడై చను దెంచి యింటికిన్.

తే. అగ్నికార్యము దీర్చి రామాయణంబు
చదివి గురునకు మ్రొక్కి తత్సవిధమందుఁ
గూరుచుండి సహాధ్యాయకోటిలోన
వల్లె వేయుఁ గుతపవేళ వచ్చుదనుక.

శా. ఆపై శాంతి పఠించి లేచి నదినీ రాడంగ నై సాంజియున్
గౌపీనంబు పలాశదండమును వేడ్కం బూని చేఁ బాత్రమున్
రూపం బందినబ్రహ్మమో యనఁగ నారుద్రుండు భద్రాకృతిన్
రూపింపంబడి పోవు మాధుకరముల్ రోయన్ బురీవీథికిన్.

ఆ. ఇట్లు కొన్నినాళ్ళు లేఁగినపిమ్మట
నొక్కనాఁడు భిక్ష మొందుపొంటె
ధరణిసురులవీథిఁ దిరుగుచు నొక్కచో
నొక్కవిప్రగృహము నొద్ద నిలిచి.

—: శంకరుఁడు మాధుకరమున కరుగుట :—

తే. "భవతి! భిక్షాం ప్రదేహి మే బ్రహ్మచారి
ణే" యనుచుఁ బల్క లోపల నే వసించి
హీనమును దీన మగువాక్కు తేటపడఁగఁ
బలికె గృహమేధినీమణి తెలియ నిట్లు.

మ. అనఘా! మ్రొక్కఁద నామనోవిభుఁడు భిక్షార్థంబు పై వీథికిన్
జనియె న్వచ్చెడు నింతలో క్షణము విశ్రాంతిం గొన న్వేఁడుదున్
గన నివ్వచ్చర మింట నయ్యోడిని నాఁగన్ శంకరుం డామె మా
సినజీర్ణాంబర మింత కానఁబడ హాసిం బాసె నం చెంచుచున్.

తే. గరిత! భక్తము లేకున్నఁ గాయ గాని
పండు గాని యిడుము దానఁ బడసి తృప్తిఁ
గదలి పోవుదు ననిన నాసుదతిమిన్న
బదులు పలుకక కొంతలోఁ బలికె నిట్లు.

ఉ. ఎంగిలిచేతఁ గాకిపయి నేయనివారము తొంటిపుట్టుకన్
మంగళ మెట్లు కూడెడిని మాగృహమందు దరిద్రదేవతా
సంగతియే స్థిరం బిప్పుడు సాపడ లే దస నేలఁ జుట్టుకో
సంగముఁ గప్పుచింపియుఁ గటా! కసరా దని చెప్పఁ జాలెదన్.

వ. అమ్మో! నాకన్న తండ్రీ!

చ. అకటకటా! యహర్ముఖమునం దెటువంటిసురాత్ముఁ జూచితో
నొకమెతుకైనఁ బొందుపడ కుండుదరిద్రులకొంప కెండవేఁ
డికి నడుకాళ్ళు పొక్కఁగఁ గడిందిశ్రమం పడి నచ్చి తీవు నీ
వాకసుకుమారమూర్తి వని యుల్లము తల్లడ మందుచుండెడిన్.

శా. ఎంతో పాపము చేసి పుట్టితిని నే నీనీకు నాచేతితో
నింతన్నం బిడ నోచ నైతి నకటా! యేకాయయే నిచ్చి లో
సంతోషింత మటన్న నద్దియును బూజ్యం బయ్యె నోబిడ్డ! నా
సంతాపం బెటులాఱునో యనుచుఁ బెల్చన్ రాల్చె బాష్పంబులన్.

వ. శంకరుండును గుండెలు తఱుఁగుకొని పోవునవ్వనితామణివాక్యంబు
లాలకించి జాలింబడుచుఁ గవాటంబువంకఁ గన్ను లెట్టి యిట్లనియె.

ఉ. ప్రాఁకుచు వచ్చు నాబుడుతపాణితలంబునఁ గాంచి * ధాత్రికన్
మీ కివి యుండునే నొకఁడు మెక్కఁగ నిమ్మన నమ్మహాసతీ
లోకవతంస మెంతయును లోనఁ దలంకుచుఁ దండ్రి! మాకడన్
వాకొన నివ్వి లేవు పెరవార లొసంగిరి నాదుపట్టికిన్.

ఆ. అనుడు నీదుతనయు నడిగి దానిని నా కొ
సంగు మెంగి లనుచు సంశయింప
ననిన నామె సుతునిఁ గని చేయి చాచిన
నతఁడు కొఱుకుకాయ నంబ కిచ్చె.

వ. ఆమెయున్ దానిశుద్ధోదకంబులం గడిగి శంకరుని హస్తపద్మంబునం బడవైచిన నతండు పరిగ్రహించి నోట వైచుకొని నమిలి మ్రింగి యాచమించి లేచి మార్గంబు వట్టి నిర్గమించుచుం దనలోన.

సీ. కటకట! యీ గేస్తు లటమటకై కట్ట
బట్టకుఁ బొట్టకు నడలుపడుచు
వేఁగించుచుండి రీవిధమునం గాలముఁ
గన నాకు మిగుల సంకటము గలిగె
మొలఁ దిరుగవిచింపి గెలుగుట నాకంటఁ
బడె సంశయించె ని గ్గడర గరిత
చింతకాయైనను జీడికాయైనను
లేకుండె నింట నీలేమిడికిని

తే. మూల మూలచ్చి యామె కేమూల నైన
నింత కనికర ముండిన నిట్లు చేయు
నే కృపాహీనురా లామె నేమి యనఁగఁ
గల మనుచు లోనఁ దలపోసెఁ గంబములచెలి.

* ధాత్రి=ఉసిరిక కాయ;

—: శంకరుఁడు బంగారువర్షము కురిపించుట :—

శ్లో. భో లక్ష్మి! భో లక్ష్మి! భో విష్ణుపత్ని!
కుత్రాసి నీచాలయావాసదాసి!
త్యక్తానుకంపే! స దాతిప్రకంప్రే!
త్వాం కిన్ను వక్తవ్య మవ్యక్తరక్తే!

శ్లో. యుష్మత్ప్రసంగా త్తు లోకేఽతిభంగాః
నూనం భవతి త్వత్ర వారాశిపుత్రి!
ఆవాహ యా మ్యద్య ధాత్రీసుపర్వ
ప్రస్తావనార్థం స్తుతిం సంప్రయుజ్య.

వ. అని ప్రస్తుతించుచున్నంత నాతనికట్టెదుట.

సీ. పసుపునిగ్గులతోడ మిసిమిఁ దేలెడుమేను
జాళువాపైఁడితో మేల మాడఁ
దోఁబుట్టు వగుచందుతోఁ దులఁదూఁగెడు
నగుమోము వెన్నెలఁసొగసు లీనఁ
దులఁ గాను నీ కని తెలుపుట కనునట్లు
కెంగేలఁ గెందమ్మి క్రేళ్ళువాఱ
వెలిపట్టు పుట్టంబు వలెవాటులో నుండి
రవణాలరవరవల్ రమణ మెఱయఁ

తే. గనుల నానందబాష్పముల్ గ్రాలుచుండఁ
గచభరంబున మెల్లనఁ గాళ్ళు లిడుచుఁ
గలుము లొలికెడువాల్గంటి కరుణతోడ
శంకరస్వామి కెలన సాక్షాత్కరించె.

వ. అట్లు సాక్షాత్కరించిన మహాలక్ష్మిం గాంచి నమస్కరించి సాక్షా
చ్ఛంకరుం డగుశంకరుం డి ట్లనియె.

తే. ఇంతమాత్రము దయలేనిహృదయము గల
దాన వీ వని యెఱుఁగ నే దానవారి
జాయ వీ వగుటన యేమొ జనని! యిట్లు
ఱాతిగుండియదాన వే వైతి వకట!

చ. చదివినవాఁడు బ్రాహ్మణుఁడు సజ్జనసమ్మతుఁ డిద్ధబుద్ధి యు
ష్మదమల కేగనట్టిఁడు ప్రసాదగుణుం డగు వానిపత్నియున్
బదుగురిలోనఁ జెప్పుకొన వచ్చెడునట్టిది సాధ్వి యామెకున్
మెదు కొకఁ డైన లేనటులు నీవు పొనర్చితి వేమి చెప్పుమా.

ద్విపదము. అన లక్ష్మియనియె నోయమలస్వభావ
మును నీరు వేదికిం బుడిసెడుగంజి
యును బోయ కుండినయుద్ధతు లగుటఁ
జను దెంచె లేమి యీ జన్మమునందు.

ఉ. నావుడు శంకరుం డనియె నా కిపు డామలకం బొసంగె భూ
దేవసతీవతంస మది తియ్యము పేర్పడ నే భుజించితిన్
గావున నాగృహస్థుల కొకానొకనాఁటికిఁ నీఁగి పోని శ్రీ
నీ విడ వేఁడుచుంటి నన నీరజలోచను భామ ప్రేముడిన్.

చ. శివుఁ గని నీదునాజ్ఞ మెయిఁ జేసెద నంచు వచించునంతలో
దివమునుండి వర్ష మటు ధింధిమిశబ్దము పుట్టి బ్రాహ్మణ
ప్రవరునియింటిలోఁ బడియె బంగరుధాత్రీఫలాటువుల్ భరం
బవు నటు కుప్పతిప్ప లయి యావరణం బది నిండ మెండుగన్.

వ. అంతలో నమ్మహాలక్ష్మి యంతర్ధానంబు నొందె శంకరుండును సంతసించుచు నింటిమొగంబు వెట్టి నట్టిమొడ నాగృహమేధి యాయావరంబు చేసికొని వచ్చి మచ్చెకంటివలన నంతయు నెఱింగి పరుగుపరుగునం బఱచి పోయి పోవువానియడుగులం బడి ప్రార్థించి తెచ్చి పాద్యం బిచ్చి పూజించి సభార్యుండై యి ట్లనియె.

ఉ. నీ వొకబ్రహ్మచారి వని నే నెటు నమ్ముదు బ్రహ్మలంతలే
దేవురుగొట్టు నైననను దేర్పఁగఁ జాలరు నాకుటుంబమున్
బ్రోవఁగ నైనదేవుఁడవు మోహమునం బడి ముగ్ని తేలుమే
మీావగ నుత్తమస్థితికి నేగఁగ నైతిమి శంకరప్రభూ.

వ. అని సతీసహితుండై వాని పాదలంబులం బడినఁ బరమేశ్వరుం డగు
శంకరుండు వారి లేవ నెత్తి మీాపుణ్యంబు మంచిది యది మిమ్ముఁ
గాచి నది నే నిందు నిమిత్తమాత్రుఁడ నని సముచితసంభాషణంబులు
భాషించి భూషించుచు వారి నామంత్రించి గురుకులంబుఁ జనియెనంత.

చ. గురుకులమందు విద్యఁ గొనుకుఱ్ఱఁడు మాధుకరాన్న భోజనం
బరుదుగఁ జేయువాఁ డొకగృహస్థునియి ల్లది నిండునట్లు బం
గరు గురియించె నంట హరికాంతకటాక్షముఁ గల్గఁ జేసి య
బ్బుర మిది యంచుఁ బౌరులు సముత్సుకతం గన వచ్చి రాతనిన్

వ. వచ్చి గురుననుమతిం బడసి శంకరకుమారుం దరియ వచ్చి.

సీ. నాబిడ్డకాన! ని స్ననినదంపతు లెట్టి
పుణ్యాత్ములో యని పొంగువారు
చిన్నికుఱ్ఱఁడ విట్టి చెద్దియె మ్టైటిఁగితి
వీవ దేవుఁడ వని వొంచువారు
బంగారుతండ్రి! నీ సింగార మెన్న శ్రీ
గన్నవాఁడవ యని యెన్నువారు
మాపాలిభాగ్యమా! మాకులదైవమా!
మ మ్మొకరా యని మరగువారు

తే. ముద్దు గొనువారు చుబుకంబు పుణుకువారు
మ్రొక్కువారు కవుఁగింటఁ బొదువువారు
కనుదొవల లేతచేఁ యద్దుకొనెడువారు
నయిరి శంకరుఁ గన వచ్చినట్టివారు.

—: గురువు శంకరు నింటి కనుచుట :—

క. గురువరుఁ డాతనిఁ గారణ
పురుషుం డని భక్తిచేసి పొగడుచు లోలో
నిరతమును వానిమహిమకుఁ
గర మాశ్చర్యంబు నొంది కని దీవించున్.

వ. అవ్వల శంకరకుమారుండును.

తే. ఓనమాలు మొదలు గా నెల్లవేదము
లెల్లశాస్త్రములును నెల్లకళలు
నొక్కసంథలోన నుపదేశమాత్రన
నేర్పుకూర్పువలన నేర్వ నయ్యె.

క. సర్వము నెఱిఁగినకతనన్
సర్వజ్ఞుఁ డనంగ నొప్పె శర్వుఁడు తా నై
సర్వము నెఱింగి వేల్పడి
సర్వజ్ఞుం డగుట ఘనమె శంకరుఁ డవలన్.

సీ. వేదములందును వేదాంతముల యందు
గార్గ్యుండు తత్కథాకలితవివిధ
తాత్పర్యకలనఁ ద్రిదశగురుండును ధర్మ
సంవర్ణనంబున జైమినిముని
వేదతత్త్వజ్ఞాన విస్తరంబునయందు
వ్యాసమహర్షి విశ్వప్రశస్త
తర్కశబ్దాదిశాస్త్రజ్ఞానసంగతి
సాక్షాచ్ఛివుం డల్లశంకరుండు

తే. అర్థశాస్త్రాదిశాస్త్రము లఖిలకళలు
కవిత గానము చిత్రలేఖనము వైద్య
విద్యయును జూచినంతన విజ్ఞు లెన్న
నేర్చి సర్వజ్ఞుఁ డయ్యె నానిఖిలగురుఁడు.

వ. అప్పు డొక్కనాఁడు గురుండు శంకరకుమారుం బిలిచి చెంతం
గూరుచుండం బెట్టుకొని లాలించుచు.

ఉ. ఈవు మనుష్యమాత్రుఁ డని యే నెటు నమ్ముదు నీశ్వరాంశతన్
భూవలయంబునం దిటులు పుట్టితి వట్టిది కా దటన్న నే
రీ విధ మైనసజ్ఞానమున నెల్ల కళల్ కనినంత మాత్రఁ గై
కో వలతుల్ వచింపు కనుఁగో నిట నేను నిమిత్తమాత్రుఁడన్.

తే. సార్థవర్షము నాకడఁ జదివి తిరిగి
లేవు చదువంగ విద్య లేతావులందు
నీవు గురుకులమును వీడి పోవు మింటి
కచట నీతల్లిదండ్రుల నరయుపొంటె.

క. గురుఁ డిట్లు శిష్యుఁ బలికెడు
తరుణంబున వచ్చె వార్త తండ్రి శివగురుం
డరయంగఁ గోరు, శంకరుఁ
ద్వరితగతిం బంపు మనుచుఁ దద్గురుకడకున్.

మ. గురుఁ డావార్త నెఱింగి వత్స! నినుఁ గన్గోఁ దండ్రియుం దల్లియుం
గర మర్థించుచునుండి రీ విచటికి న్గా ల్వెట్టి యేడాదిపై
నర యయ్యెం ద్రిజగంబులం గలుగువిద్యల్ నీకుఁ బూర్ణార్జిత
స్ఫురణన్వచ్చెఁగృహంబుఁజేరిగృహివై సొంపొందనూహింపుమా.

వ. అని గురుండు వానిని సమావృత్తుండవు కమ్మని యంపివచ్చె.
శంకరుండును దన విద్యావైశద్యంబు తండ్రికిం దెలుపుభాగ్యంబు

కలుగ కుండునో యని కళవళంపడుచుఁ గాలటికిం గాలినడకం జని మరణశయ్యం బడియున్న తండ్రికిం దల్లికిం బ్రదక్షిణనమస్కారంబులు గావించి శయ్యం జేరి తండ్రిమేనిపైఁ జేయి వైచి కంట నీరు వెట్టుకొనుచుండె నప్పుడు.

—: శివగురు చరమదశ :—

ఉ. తల్లియుఁ బుత్రునిం గనుచుఁ దల్లడపాటునఁ గంట నశ్రువుల్
జల్లని రాల నేడ్చుచుఁ బ్రసంగ మొకింతయుఁ జేయ లేనిదై
గొల్లునుశబ్ద ముప్పతిలఁ గొడ్కును జూచుచు నేలఁ గూలె న
ప్డల్లన విచ్చి కన్నుఁగవ నాశివదేవుఁడు చూచి పుత్రునిన్.

ఉ. చేతులు చాచి కౌఁగిటను జేరిచి యట్టిటు కన్నతండ్రి? నీ
వీతఱి వచ్చినాఁడ వటవే ననుఁ జూడఁగఁ బారవిఘ్న మి
ట్లాతత మయ్యెనే యనుచు నారట మందెడుతండ్రిదిక్కు మో
మై తనయుండు మీాయనినయట్టులు గా దని మ్రొక్కి యి ట్లనున్.

ఉ. నాలుగు వేదముల్ మఱియు నాలుగురెం డగుశాస్త్రముల్ పురా
ణాలును ధర్మశాస్త్రములు నన్ని యెఱింగితి సత్కవిత్వముల్
మేలు బళీ యనన్ సలుప నేర్చితి గానమునందు మేటి యీా
బాలుఁ డటంచు నన్ బొగడువా ర్గల రోపితృపాద! వింటివే.

తే. అనుడు శివగురుఁ డి ట్లను నల్లనల్ల
యేను ధన్యుఁడను బితౄణ మీాఁగికొంటి
నిన్ను వంటికుమారునిఁ గన్న దాన
నేను బోవుదు నీతల్లి నిన్ను నోము.

వ. అని యర్ధాంగిమోముపై దృష్టి నిగిడించి కుమారునిచేతులు తన తలక్రిందం జేర్చుకొని నారాయణస్మరణంబు చేయుచు యోగం

బనుసంధించె నంతలో నాతనిప్రాణంబులు బ్రహ్మరంధ్రంబు పగిలించుకొని శంకరుండు చూచుచుండ నర్చిరాదిమార్గంబునం బోయి సూర్యమండలంబునం జొచ్చె నంతఁ గుమారుండును.

మ త్త. ప్రాణనాథునిమేనిపైఁ బడి భోరు భోర్మని యేడ్చుచున్
బ్రాణముల్ విడ నున్నతల్లినిఁ బట్టి లేవఁగ నెత్తి వి
జ్ఞానశేవధి నీవు ప్రాకృతజంతువట్లిటు లేడ్వఁగా
నానె ప్రత్యహ మిట్లు కన్గొన నట్టె ప్రాణులపోకడల్.

ఉ. మాయ జగంబుఁ గన్గొను మార్గము తప్పినదానవై యిటుల్
పాయనిదుఃఖభారముగ బమ్మిరిలం జనునమ్మ బ్రహ్మమున్
నీయెడఁ గట్టుకొంటి వది నేను నెఱుంగుదు నిన్నుఁ బోలువా
రీయుగమందు నేఁ బొడమరే ధరణీస్థలి ముందువెన్కలన్.

వ. తల్లీ! యింక నైన నీ వీలోకవృత్తాంతంబు చిత్తంబునం దలంచుచుఁ బ్రశాంతి వహింపు మని యుపశమిల్లం బలికి నేద దేర్చి పదంపడి బ్రహ్మమేధవిధిం జేసి తండ్రికిఁ బ్రేతసంస్కారంబు నిష్కర్షిల్లఁ జేసి బ్రహ్మవేత్తలకు గో భూ తిల హిరణ్యాది దానంబు లెన్ని యేని కావించి తల్లిమనుగడకుం జాలినంత ద్రవ్యం బుంచి తక్కిన దంతయు బ్రహ్మసాత్కృతంబు గావించి తల్లిద్రవ్యంబునుండి యట నదీపాతంబు గానున్నకృష్ణాలయం బామె పేరం గట్టి ప్రతిష్ఠించి కృతకృత్యుండై తల్లి నెల్లవిధంబుల నూఱడిల్లం బలుకుచు నామెపోషణంబున నల్లారుముద్దుగాఁ బెఱుఁగుచుఁ గాలక్షేపంబు నేయుచుండె నక్కాలంబున.

—: శంకరుని విద్యావిశేషాదికము :—

శా. వీణాగానముతోడ సామమును వేవేరీతులం బాడుచో
గాణల్ రాణ లెసంగ మూఁగికొనుటల్ గా దెందు నెం దుండు ని
ద్రాణంబుల్ పికముల్ మయూరములు తద్రాగస్వరప్రక్రియల్
ద్రాణం బేర్పడఁ గూడి పాడుటకు నా దర్పించి కూయుం గడుల్.

ఉ. వీణ ధరించి సామమును విన్ననువొప్పఁగఁ గూర్చి పాడుచో
వీణియ పల్లవంబులను బెట్టెను మెట్టులపట్ల మేల్మిణుల్
ప్రాణము గల్గినట్టు లయి వారి స్రవించె నొకింతవేళ కా
వీణ ధ్వనింపఁ జాలమికి వీఁగక పాడు నతండు వీణ నాల్.

సీ. పుంస్కోకిలములను బొందు పొం దనఁ జాలు
స్వరము చిల్కల కుద్ది వచ్చుపలుకు
పున్నమజాబిల్లి కన్న మిన్నగు మోము
వెన్నెల వెదఁజల్లు చిన్ననగవు
కమలదళంబులం గాదు కా దనుకను
లింద్రనీలంబుల నేలు నెఱులు
కొదమసింగములకు బదులాడఁ గాఁ జాలు
లేఁగౌను కడుపుపై నాగరేఖ

తే. ధవళధవళంబు లగుజన్నిదములతోడ
మిసిమి మీఱెడుమేచాయ మిసమిసన మని
పుడమిపైఁ గలచీఁకట్ల వెడల నడువ
శంకరకుమారుఁ డానాఁట సొరుమీఱె.

సీ. కడఁగి పాల్కుడలితోఁ గాఁగిలింతలఁ దేలి
కైలాసగిరిమీఁదఁ గాలు వెట్టి
మలపట్టితేసితోఁ జెలికార మొనరించి
గిబ్బరాయని మీఁదఁ గెరలకెక్కి
చిక్కరాయని తోడ నెక్క సక్కెము లాడి
యలవేలుపులగౌరు నక్కుఁ జేర్చి
వెలిమ్రాఁకుతోఁ గోఁకలనెల్ల నెలకొల్పి
చిలువ యేలికతోడఁ గలసిమెలసి

తే. నారదమునీంద్రునిం దొట్టి వారి గెలిచి
యలుముకొని మజ్జగంబుల యందు విరిసి
ప్రోడయై తిరుగాడుఁ శ్రీ భూతమహిమ
కీర్తితుం డగుశంకరు కీర్తి కాంత.

—: శంకర వివాహ విచారము :—

క. జగదేకసుందరుండును
దిగంతరవ్యాప్తకీర్తి దీపితజన్ముం
డగుశంకరునకు నెందఱొ
తగువారల్ కన్యల నిడుతలఁపు గలుగుటన్.

వ. కాలటికిఁ గాలు గదలించుకొని వచ్చి తెలియం జెప్పిన నతండు.

ఆ. తనకుఁ బెండ్లియాడుతలఁపు లే దని చెప్పి
వారినెల్ల సాఁగఁ బంపె నపుడు
తల్లి తనయు తలఁపు తెల్లంబుగా విని
యిట్టు లనియె నొక్కపట్టునందు.

మ. తనయా! నాల్గగు నాశ్రమంబుల గృహస్థం బాశ్రమం బుత్తమ
త్వనిరూఢిం బొలుపొందు నిందుఁ బురుషత్వం బంది జన్మింపనై

జనుఁ డాదిం జదువంగనై విబుధుఁడై సాధ్వీమణిం బెండ్లియై
తనయుం గాంచి యజించువాఁడె పురుషత్వప్రాప్తికిం పాత్ర మా.

వ. కావున నోకన్నతండ్రీ! నీ వవిజ్ఞుండు వోలె వాదంబు సేయుచుఁ
బెండ్లియాడ నని వ్రతంబు వట్టి వ్యర్థుండవు గాక.

ఉ. మంచికులంబునం దయినమాన్యచరిత్రను బెండ్లియాడి శ్రు
త్యంచిత ధర్మకర్మములయం దయి యాగము లాచరించి పెం
పెంచుచుఁ బుత్రులం గని పితౄణము దీర్చి గృహస్థధర్మముల్
మించినసంప్రదాయమున మేలు ఘటిల్లఁగ నుండు మాత్మజా.

చ. గురువు లపుత్రజాతకునకున్ గతి లే దని చెప్పుచుండ్రు నీ
వరసితి వేదశాస్త్రములు నాగమము ల్పదియా ర్పురాణముల్
వరమతి వెందు నిట్టులనువాకులు సీచెవిఁ దాఁక లేదె యి
ట్లరమరలాడు దే మెఱుఁగ నట్టిఁడు వోలెఁ కుమారశేఖరా!

వ. అని తఱిమి చెప్పుచున్నంతఁ గొంతలో నతండు తల్లి కిట్లనియె.

శా. అమ్మా! నీయుపదేశవాక్యముల కే నడ్డంకుఁన్ వాకులన్
నెమ్మిం జేయుచునున్న వాఁడ ననుచున్ నిందింప ఁబో కమ్మ శా
స్త్రమ్ముల్ దెల్పు గృహస్థధర్మమునఁ బ్రాశస్త్యంబు దానం బితౄ
ణమ్మున్ దీర్పగ వచ్చుటల్ నిజము లైన న్వీన్ని వాక్రుచ్చెదన్.

మ. జననంబే కడుదుఃఖ మంనునను సంసారంబు పైదుఃఖ మై
కనవచ్చుం బిదపన్ సతీగ్రహణదుఃఖం బెన్నఁగా శక్యమే
జననీ! పెండిలి లేనిభీష్మునకు మోక్షప్రాప్తి లేకుండెనే?
వినవో శ్రీశుకుఁ డుత్తమస్థితిని బ్రాపింపంగ విచ్చేయుటల్.

వ. అని మఱియు.

మ. విను మాశాస్త్రము లాపురాణములు నావేదంబు లాసర్వముం
గనుఁగో నశ్వరముల్ జగంబు లివి స్వప్నప్రాయముల్ రోసి వా
నిని వైరాగ్యమ భోగ్య మంచు మదిలో నిర్వేదముం బూననా
ననియున్ నిత్యుఁడు సత్యుఁ డీశుఁడొకఁడే యంచూని వాక్రుచ్చెదన్.

వ. అని క్షణభంగురంబు లనిత్యంబు లసత్యంబు లగు దారపుత్రాదులు నాస నపేక్షింప నొప్ప దనియుం జెప్పచుఁ బెండ్లియాడని నియమంబున నుండ నొ నని కుమారుండును బెండ్లియాడి పిల్లలం గని కులం బుద్ధరింపు మని తల్లియుఁ బరస్పరసంభాషణంబు లహర్నిశంబు సాఁగించుచుండి రప్పు డొక్కనాఁ డార్యామహాదేవి.

—: శంకరమాత యెండతాకున మూర్ఛిల్లిపడుట :—

ఉ. కాలటి కింతదవ్వులను గ్రాలుచు నుండెనుపూర్ణ నాద ము
న్కాలములందు బోవునదికాన నొకానొకనాఁటి యెండలోఁ
గాళులు గాలుచుండ జలకంబులు దేరఁగ నేగి వచ్చుచున్
జ్వాలలు గ్రమ్మునన్న నగుసైకత మ్మార్గిఁ దగ్గిపోనిదై.

ఆ. దారి మండుచుండ దానిలోఁ బడి నాలు
గడుగు లేసి మీఁద నడువ లేక
కాళ్లు నెత్తి మాడఁ గ్రద్దెనా సైకత
మందు నగ్నిహోత్రమందు వలెను.

వ. అట్లు పడి లేవలేక కొట్టుమిట్టాడుచున్నంత నవ్వృత్తాంత మెవ్వండో రివ్వునం బోయి శంకరునకుం జెప్ప నప్పు డతండు వడివడిం బఱుగిడి వచ్చి లేవనెత్తి తల్లి నెత్తుకొని తన యింటికిం దెచ్చి చేతులనామె మేనెల్ల నిమురుచు శైత్యోపచారంబు గావించె నంతలో నామెయు.

ఉ. కన్నులు విచ్చి చూచి తనకన్నకుమారుఁడు సేదదేర్చుచున్
దన్ను భజించుచుంట గని తండ్రి! ననుం గొని తెచ్చితీవా నే

నున్నది మద్గృహాంగణ మొకో యిసుకం బడు లే నెఱుంగుదున్
న న్నెటు తెచ్చి తేది వ్యథ? నామెయిఁ జల్లన కేది హేతువో?

మ. నవనీతాదులు రాసినట్టులు కనన్ గా రాదు శీతార్ద్రగం
ధవిశేషంబులు పాఁమినట్టులు భవద్ధస్తాంబుజం బొప్పుచుం
డె వరాలయ్యను నిన్నుఁ గన్నతలి నై నే నంటకుం దొంటిపు
ట్టువునం దెట్టితపంబు చేసితినొ చెట్టుం గట్టె ని స్సద్ద యే.

వ. అని తనంతఁ దా లేచి కొడుకు నక్కునం జేర్చుకొని మూర్ధంబు పుడుకుచు ముద్దులాడుచుండె నప్పు డక్కుమారుండు తల్లిదిక్కు మొగం బై.

ఉ. అమ్మరో! నీకు నాఱుపదు లబ్దము లయ్యెను రెండుమూఁడుసూ
సమ్ములు మాత్రమే కొఱగ శాస్త్రవిహితమ్ములు సర్వపుణ్యక
ర్మమ్ములు చేసియుంటివి కుమారునిఁ గాంచితి పూతదేహ వే
యమ్మయు నిన్నుఁ బోలు నన నైతి లభింప దొకింతయేనిఁదయుఁ.

తే. ఇంట నుష్ణోదకము గానియెడలఁ గొరటఁ
దనరు కూపోదకము గాని తాన మాడ
నొప్పు గదె తల్లి! ప్రతిదిన మొండు రెండు
పరులు పూర్ణకుం బోవుట భరము గదవె.

ఉ. ఏటిజలంబు లాడుటకు నేగుట మానుము దవ్వు వోవ నా
రాటము వచ్చుఁ గాదనిన రాతిరి చూడుము రేపులోన నా
యేటిని నీపదంబుకడ కేఁ గొనివచ్చెద నీకు నిచ్చెదన్
మాటికి మాటి కానదిని మజ్జనముం బొనరింప నొప్పెడిన్.

వ. అనిన వాని బాలభాషణంబులకుఁ దల్లి సంతసిల్లె నంత నారాత్రి సాము గా వచ్చినప్పుడు.

—: శంకరుఁడు పూర్ణానదిని దనయింటి ప్రక్కకుఁ దెచ్చుట :—

సీ. ఇది భూమి యివి దిక్కు లిది దివం బనరాని
యట్లు మేఘాస్పృత మయ్యె జగతిఁ
బ్రళయకాలము వోలెఁ బెళపెళార్భటులతో
నురుములు మెఱుములు నుప్పతిల్లె
నేన్గుతొండము లట్టు లెడ మింతయును లేక
జలధార లెల్లెడ నలుము కొనియెఁ
గుండలతో నీళ్ళు కుమ్మరించినరీతిఁ
గురిసె వర్ష మొకింత తెఱపి లేక

తే. కొంపలును గోడలును నేలఁ గూలిపోయెఁ
బ్రజల కిటు నటు నడయాడ వలను చెడియె
బ్రళయమండలిపుష్కలావర్తకములు
కురిసి నట్లై మహోగ్రమై కురిసె వాన.

శా. ఆవర్షంబున బూర్ణ పొంగి త్రిజగద్వ్యాఘాతముం జేయు న
ట్లావేగంబునఁ గొట్టుచుం భయదమై వ్యాపించియు న్మించియుఁ
ద్యావాపృథ్వ్యవకాశ మింతయును లే నట్లై ప్రతీరావనిఁ
వే వే ద్రచ్చుచు వచ్చె నూరిదరికిఁ వేఁగంగ నావేళకున్.

క. ఉదయము వేళకుఁ బూర్ణా
నది నిండి నిజాలయంబునకు దరి దాపై
పొదలంగ నార్య మేల్కొని
నదియై కని కొడుకు నుడికి నచ్చెరు పడియెఁ.

—: దైవజ్ఞుఁడు శంకరున కల్పాయు వని తెల్పుట :—

వ. అంత నొకానొకదినంబున దైవజ్ఞుం డొక్కరుండు శంకరునకుం దనకన్య నీ నెంచి వచ్చి మునుము న్నార్యాంబం గని తనవచ్చిన

కార్యం బెఱింగించిన నామె తనవల్లభుండు వృషభగిరినుండి వచ్చు నప్పుడు చెప్పినచొప్పు తలంపునకు రాఁ గుమారునిజన్మపత్రికం దెచ్చి వానిచేతి కిచ్చినం బుచ్చుకొని యతం డిటు నట్టు లించు కించుకగాఁ జూచి పెదవి విఱిచిన వెఱ చఱచి వడంకుచు శంకరాంబ దీనస్వరంబున

ఉ. ఏమి మహానుభావ! యిటు లేటికి మాటి కనిష్టభావమున్
నీమొగ మెర్గఁ జేసెడిని నిక్కన బీ తగు దెంమి నయ్యయో
స్వామి! మదీయనందనుఁడు వాఁడు చిరాయురుపేతుఁడే కదా
యేమి వచింతువో యనుచు నెంతయు స్వాంతము సంచలించెడిన్.

తే. అనుడు దైవజ్ఞుఁ డనుఁ దల్లి వసరఁ బోకు
మల్పజీవి భవత్సుతుఁ డనువు పడెడు
శాంతి దానికిఁ జేయింప గొంత మేలు
చేకుఱు నటంచు నామది చెప్పుచుండె.

—: మునులువచ్చి శంకరుని సన్యాసిం చేయు మని చెప్పుట :—

వ. అని తనవచ్చినపని వాకిట తీరుటం జేసి మఱియెం డాడ కామెకుం జెప్పి పోయె నామెయు నితాంతచింతాసాగరనిమగ్నమాన మానసయై యున్నంతలో శంకరదర్శనలాలసులై యుపమన్యు ప్రభృతు లెందఱో మునులు వచ్చి శంకరపూజితులై విశ్రమించి వానితో బహువిధప్రసంగంబులం దేలుచున్నంత నార్యాంబ వచ్చి మునులకుఁ మ్రొక్కి యి ట్లనియె.

ఉ. మీరు మహానుభావు లరు మీదగు దర్శనభాగ్య మబ్బుటన్
జేరెను మాకు సర్వశుభసేవధు లోమునులార! నాసుతుం
డీరహి సర్వవిద్యలు గ్రహించినవాఁ డయి వచ్చె వీనికిన్
భూరితరాయు వౌ నటులు పూజ్యులు మీర లనుగ్రహింపరే.

చ. అనఘులు సర్వముం గరతలామలకం బగు మీకు నాకుమా
రుని గ్రహసంపుటిం దెలిసి రూఢి వచింపుఁడి యెల్లసంగతుల్
కనుఁగొన నల్పకాల మది గల్గిన దానికినిం బ్రతిక్రియం
బొనరిచి పెద్దకాల మగుపోడిమి తేఁ దగునంద్రు తాత్త్వికుల్.

క. మును లనిరి తల్లి! మీ కా
దిని వృషభాచలహరుండు దెలిపెను గాదే
ఘనుఁ డగు నీసుతు సన్న్యా
సినిఁ జేసితి వేని బ్రదుకుఁ జిరకాల మిలన్.

ఆ. ఎనిమి దేండ్ల కవుల నెన్మిదేండ్లకు నైన
నజునివ్రాఁత తప్ప దంబ! వీని
సన్యసింపఁ జేయ జన్మాంతరం బది
యగుచు బ్రదుకు నవల నన్ని యేండ్లు.

వ. అని చెప్పి వారు యథాగతకృతగమను లై రప్పుడు శంకరుండు తల్లిం జేర వచ్చి బతిమాలుచు ని ట్లనియె.

శా. అమ్మా నాబ్రదుకు కాన చేసితివ యే నావంతయుం జూడ కీ
వమ్మౌ నేని మృతింపకుండు మని మా తాజ్ఞం బ్రసాదింపవే
కొమ్మా యాశ్రమ మంచు నే నవల నీకు న్మ్రొక్కి సన్న్యాసి నై
మిమ్ముల్ శాశ్వతరుద్రలోకమును సంప్రేక్షింపఁ గావించెదన్.

వ. అనినం దల్లి యి ట్లనియె.

ఉ. ఈ వొకరుండవే సుతుఁడ వెవ్వఁడు ది క్కొకరుండు లే డిఁకన్
దేవర దేవినిం బలెను దేశికునాజ్ఞఁ బరిగ్రహించుచున్
భావజరూపునిన్ సుతుఁ గనం గలవాఁడవవై యనంతరం
బావిహితాశ్రమంబుఁ గొన నాస యొనర్పుము మాను మానుడిన్.

—: శంకరుని మొసలి పట్టుకొనుట. :—

వ. ఇట్లు పలికెడుతల్లినిర్బంధమునుండి తప్పించుకొనం జాలని కుమారుం డామఱునాడు తల్లికిం జెప్పకుండc దనయీడు బాలురతోడం గూడి పూర్ణానదికి జలంబు లాడం జని లోcతునీట మునుcగుచు దేలుచు నొండొరు పందెంబులం జఱచుకొని యీcదులాడుచుc జల్లులాట లాడుకొనుచుం గ్రీడలం గావించు చుండి రప్పుడు.

సీ. ఖరనఖరంబులం గట్టిపాఱిన యట్టి
పొట్టికాళులు నాల్గు దిట్టపడcగ
సూక్షభూధ్రచ్ఛేద దక్షదంష్ట్రాళిన
దృక్షపుచ్ఛచ్ఛటల్ దీర్ఘముగను
మృత్యుముఖం బట్టు లత్యుద్ధతం బగు
ఘోరముఖం బదిరి గుహాకుc జాల
క్రకచసహస్రముల్ కలయc గూర్చినయట్లు
మొరటు దేరిన మేను కఱుకు లీన.

తే. దీర్ఘదీర్ఘమై మోర పైc దేలి యేటి
నీరు పాయలువడ నీదు చారపంబు
పుట్ట నట్టిట్టు చెడుగుళ్ళు కొట్టుకొనుచు
వచ్చి గ్రాహము శంకరుc బట్టెనట్టె.

వ. ఇట్లు పట్టి లోనికి లాగికొని పోవం జొచ్చె నప్పుడు గ్రాహగ్రస్తుం డగు శంకరుండు తల్లికిం దెలియున ట్లుచ్చైస్స్వరంబున.

శా. ఓహో మాతృశిఖామణీ! జలమునం దుగ్రాకృతి న్వచ్చి దు
ర్గ్రాహం బొక్కcడు నన్నుc బట్టుకొని శీఘ్రప్రక్రియన్ లోనికిన్
ద్రోహంబుం బొనరింపc దోడుకొనుచుం బోవు న్వడిన్ వచ్చి నా
దేహంబు న్నిలువంగc బెట్టు మని రోదించెన్ భయం బెంచుచున్.

వ. అట్లార్చుచు నేడ్చుచున్నప్పుడు తోడిబాలు రేమియుఁ జేయఁ జాలక జాలింబడి పఱుగు పఱుగునం బఱచి పోయి తల్లికిం జెప్పి రప్పు డామె హా! రు మని యార్చుచు నోరును నెత్తియు మొత్తుకొనుచు నొక్కండ జ లోనం జని గ్రాహగృహీతుం డై కారియంపడు కొడుకుం గని యురస్తాడనంబు చేసికొనుచు నుచ్చస్వరంబున. 134

మ. కొడుకా! న న్విడనాడి పోయెదవురా ఘోరగ్రహాస్యంబునం
బడి న న్నేమిపొనర్చి పోవుదువు? నాప్రాణంబ! నాకిందు దిక్కెఱరా
కొడుకుల్ కూఁతులు నన్నలుం దములు నీకుం గాక లే రెవ్వరున్
నడికిం గాలము దాఁటె నే నెటులు ప్రాణంబుల్ భరింపం గలన్.

వ. అని గ్రాహంబు నుద్దేశించి. 136

శా. ఓహో గ్రాహమ! నాదువంశమున కీయొక్కండె యంకూర మై
దేహం బందెను వీని నీ విపుడు సందేహింప కాస్యాగ్నిలో
స్వాహాకారము చేసికొన్నఁ బితృవంశం బెల్లఁ గాసిల్లెడిన్
ద్రోహంబుం దలపోయ కీబుడుత సంరక్షింపఁ బ్రార్థించెదన్. 137

క. ఆహారవాంఛయే నా
దేహం బిదె పట్టి కొఱికి తిగుము తనియ నో
గ్రాహమ! మే లగు నీ కిటు
ద్రోహము సేయకుము నీకు మ్రొక్కెద నిదిగో. 138

వ. అని ప్రార్థించునంతలో నాకొలు మొసలియుఁ గుమారుండును బ్రవాహంబున బుడుంగున మునింగి కానరాకుండి రపు డయ్యార్యాంబ యొమ్ముగొట్టుకొనుచు గొల్లున నేడ్చుచుఁ దానును దనకన్నవానితో నదిం బడి చావ నెంచి జలంబులం దిగఁబాఱుచు. 139

—♦ శంకరుఁడు తల్లియనుజ్ఞ గొని సన్యసించుట ♦—

ఉ. దేవతలార! నాకొడుకు దేహముతో నిట వచ్చె నేని భూ
దేవియు వాయుదేవుఁడును దిక్కులు సాక్షులు గా వచింతు నా
భావము మార్చుకొం చతనిపట్లఁ దురీయము నాశ్రమంబుఁ గై
కో వర మిత్తు నంచుఁ బలుకుం బచరించె దెస ధ్వనింపఁగన్. 140

ఆ. అంతలోన బాలుఁ డట్టిట్టు లాడుచు
జననికడకు గొట్టుకొనుచు వచ్చె
వచ్చినంత వాని వడిఁ బట్టి సందిటఁ
బెట్టి కౌఁగిలించెఁ బెరిమ నామె. 141

వ. అంత వా రిరువురును జలాశయంబునుండి మెల్లమెల్ల నడుగు లిడుచు
గృహంబు చేరుకొనిరి. 142

ఉ. అప్పుడు పుత్రుఁ డిట్లనియె నమ్మరో! మస్కరిఁ గాఁగఁ జేసి న
న్నిప్పుడు పంపఁ బల్కితి వదే పరమాజ్ఞయటంచు వందనం
బొప్పుగఁ జేయుచుంటిఁ గొను మోజననీ! చనివత్తుఁ జిత్తమం
దెప్పుడు చింతసేయ వల దే నిట నుండినయట్ల యెంచుమా. 143

చ. కల దిట నీకు దైన్య మది గల్గినఁ బెక్కురు దిక్కుసూపుచున్
బిలిచినఁ బిల్వకుండినను నీకు సపర్య లొనర్పఁగ వత్తు రమ్మరో
తెలియఁగ నే నొకర్త నని దిక్కొది లే దనఁ బోకు నీకు నేఁ
గలను గదా సుతుండ నయి కానల నుండిన నింట నుండినన్. 144

చ. తలఁచినయంతమాత్రమున దగ్గర నుండినవాఁడు నాఁగ నేఁ
గల నని చేర వచ్చెదను గష్టము నీ కెది గల్గకుంగెడిన్
గలిగినయేఁ బ్రతిక్రియ పొనర్పఁగఁ జాలి యిట న్నెలంగెదన్
బలు కిది విశ్వసింపు మని పాదము ముట్టెను బాస చేయుచున్. 145

వ. ఇట్లు మాతృవందనంబు చేసి "సన్న్యస్తోఽహ" మని పలుకుచుఁ
బాలాశదండంబు పాఱవైచి వేణుదండంబును, ముంజమయమేఖ
లఁ విడిచి వస్త్రమేఖలయును, బంచశిఖాపరిత్యాగంబున నేకశిఖా
పరిగ్రహణభావంబును గావించి కంట నీరు నెట్టుకొనుచున్న తల్లికి
మఱియు దండప్రణామంబు గావించి ప్రయాణోన్ముఖుండై మాఱు
మాటాడ నేర కూరకున్న కన్నతల్లి కన్నుల ననుజ్ఞం గొని యిల్లు
వెడలి తనదిక్కుపై మోమునెట్టి చూచుతల్లిదిక్కు తిరిగి తిరిగి
చూచుచుం జని శ్రీకృష్ణాలయంబునకుం జేర నరిగి నాఁటికే యట

విశ్రమించె నని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పు మని
కథకు నడుగుటయును. 146

—♦ ఆ శ్వా సాం త ము ♦—

సీ. ఆధ్యాత్మచింత నిత్యం బైనతనయాత్మ
సలుపు దేవీపూజ సంతతంబు
మాతృపితృభక్తి యాతని కుగ్గుబాల్
గ్రోలునప్పటినుండి గ్రాలుచుండు
పక్షపాతము వానిపట్లఁ గానఁగ రాదు
శాంతస్వభావుఁడు సాధుమూర్తి
శరణాగతత్రాణబిరుద సంకలితుండు
సత్యశీలుఁడు దయానిత్యరతుఁడు
తే. న్యాయమూర్తి నిరాడంబరాశయుండు
సతతమితభాషి కార్యదీక్షాపరుండు
దేవభక్త్యంకితుండు విద్యావినోది
సత్యనారాయణుఁడు పొల్చు సత్యకరుణ. 147

క. కపటము కల్లయు మోసము
విపరీతార్థంబు నికృతి వికటోక్తియు దం
భపదంబు సత్యనాముని
కెపుడున్ లే వతనిఁ బ్రోచు నీశ్వరుఁ డెలమిన్. 148

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతం బైన జగద్గురు చరిత్రమున
ద్వితీయాశ్వాసము
శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# జగద్గురుచరిత్రము

( అను )

## శంకరవిజయము

## తృతీయాశ్వాసము

క. శ్రీమజ్జగదంబా గ
ర్భామలశుక్తిన్ బ్రభూత మగుముత్యంబై
భూమీంద్రశిరోభూషణ
మై మించున్ సత్యనాముఁ డత్యర్ఘుం బై. 1

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె నట్లు గృహంబు వెడలి మెలమెల్ల నడుగు లిడుచుఁ బూర్ణానదీతీరంబునఁ దల్లి పేరం గట్టించిన శ్రీకృష్ణ మందిరంబునకుఁ జని స్వామిదర్శనంబు గావించి చేతులు జోడించు కొని యిట్లని ప్రార్థించె. 2

### — శ్రీకృష్ణస్తవము —

శ్లో. శ్రీకృష్ణ మీడే శ్రితపారిజాతం
జాతం కులే వృష్ణిజనేశ్వరాణామ్
య శ్శిష్టరక్షార్థ మభూ త్ఖలానాం
శిక్షార్థ మే వాత్ర వసుంధరాయామ్. 3

శ్లో. సంకల్పి తో౽హం శివదేశి కేన
త్వం చాపి తద్వ త్పరికల్పి తో౽సి
ఆవా మభూవ స్మ సహజా వ వాతః
మాం కృష్ణ! దత్వా విజయం త్వదీయమ్. 4

వ. అని ప్రార్థించి మొక్కి-చో విశ్రమించి తనప్రియాణంబు విని దర్శింప వచ్చినప్రజల నందఱ నాదరించి యంపిపుచ్చి యారాత్రి భగవ త్సన్నిధానంబునఁ గాలంబు పుచ్చి మరునాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబులు నెరవేర్చినపదంపడి. 5

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ కడ తేర్చి
పాశ్చిమాగ్ని ముఖమును బరఁగఁ జేసి
కాషాయకౌపీనకమును జేలముఁ దాల్చి
తనపాటి వైణవదండ మూని
యొంటిజందెముపోఁగు లొక్క-శిఖయు నుంచు
కొని కమండలు నొండు కొని కరమునఁ
జిఱుపావకోళ్లను జేర్చి పాదములకు
భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్చి

తే. విడువఁ జాలక కొందఱు వెంబడించి
శాకునాదిమంత్రముల్ చదువుచుండ
నెనిమి దేఁడులయీడునఁ దనరునాతఁ
డుత్తరాభిముఖుం డయి యూరు దాఁటె. 6

—♦ శంకరుని శుకపికాదు లనుసరించుట ♦—

చ. చిలుకలు గోరువంకలును జిన్నికుమారుఁడు తల్లిఁ బాసి తా
వలిమల దాఁకఁ బోయెడిని వానికిఁ దో డొకరుండు లే డటం
చలతను దెల్పు నో యనఁగ నట్టిటు కూయుచు వెంబడించెఁ గో
యిలలును వానితోఁ గలసె నింతటిలోపల వింత దోఁపఁగన్. 7

ఉ. ఆత్రము దోఁప నిట్లనియె నమ్మునిరాజకుమారుఁ డల్పవయో
మిత్రములార ! యూరిపొలిమేరను దాఁటఁగ వచ్చినా రిఁకన్
మిత్రిత వీడి నన్ విడిచి మీరు గృహంబుల కేగుఁ డేను నీ
ధాత్రినిఁ బట్టి యేగెదను దల్లియుఁ దండ్రియు నాకు దేవుఁడే. 8

ఆ. అనుడు వార లిట్టు లనిరి పక్షులు నిన్ను
వదల లేక వెంట వచ్చు నదిగొ
సతము కలసి యుండుసహచరులము మేము
విడిచి పోవునట్టివిధ మదెట్లు. 9

క. రేపులు మాపులు మాతో
నే పొదలాడుచును మమ్ము నెసఁగింతు వయో
నీపాటలు నీయాటలు
నీపరిహాసములు లేమి సేతుమె మెలఁగన్. 10

ఉ. కన్నులు మూసి యాటలను గన్గొనుఁ డే మగపట్టుచున్నదో
యన్నపు డేము లోకముల నన్నిటిఁ గన్గొనఁ జాలుచుందు మె
న్నెన్ని విచిత్రచిత్రములు నేర్పడ వచ్చెదు మోద మిచ్చెదున్
గన్నులపండు వయ్యెడిని గల్గునె మా కవి యింక శంకరా ! 11

మ. ఉప్పుపట్టీ లను నాట లాడుతఱి నెన్నో పుంత లం దష్టుకో
నెపుడుం గాచుచు నుండువారికరమం దింతేనియుం జిక్కకో
కపురూపం బగుదారిఁ దాఁటి చని పైపై సామేలు గైకొంటఁ జూ
పి పచారించితి పూర్ధ్వలోకగతు లేవి తండ్రి! మా కింకిటన్. 12

మ. పరమార్థుం బగుకాల ముత్త దయి పోవం జూడరా దంచు నీ
శ్వరభక్తిం బచరించు నాట యనుచున్ వైకుంఠపాళీ పటాం
తరమందుం బెనుఁబాముసోటఁ బడకుండం దాఁటి లోకాళిపెం
పరయం జూపుట లింక మాకు సులభంబా బాలయోగీశ్వరా. 13

వ. అని యనేకవిధంబులం బలుకుచు వానివిరహంబు సహింప లేనివా
రయ్యు నెట్టకేలకు తననిర్బంధంబున మరలి చని రంత శంకరుండు
గ్రామసీమం దాఁటి వనమార్గంబు పట్టి నడచుచుండె నంతలోన. 14

ఆ. లేళ్ళగుం పొకండు ఱాళ్ళ ఱప్పల మెట్టు
బాలయోగి నరసి తాళ లేక
వానిఁ గొలుచునట్టివై నేల మెట్టుచు
దారిఁ జూపునట్టివై రహించె. 15

—♦ శంకరు దారి మృగము లనుసరించుట ♦—

చ. ఎలు గొకరుండు కొండదరి నేగెడుదారినిఁ గూడ ముట్టి చే
తులఁ గొని తెచ్చినట్టిచిఱుతున్కి-ఫలంబులఁ జెంతఁ బెట్టి మ్రొ
క్కులు పొనరించుచుం దినఁగఁ గొల్చుచు సన్నలు నంటి రా నతం
డలుకక దానిఁ జే నిమిరి సాదరతం గనెఁ దోఁడు నీడఁగన్. 16

సీ. కాండ్రు కాం డ్రనుచును దీండ్రించుకొల్పులుల్
దాపు దాపున నుండి దాఁటి పోవ
ఖణిలు ఖణి ల్లని కాన దన్ద్రిర్ల జం
కెలు వేయుసింగముల్ కెలన మెలఁగ
బొ బొ బొ బొ బ్బో యని బొబ్బరించు నెలుంగు
గొడ్డు లడ్డంబుగా నడ్డి పాఱ
గింగు గింగు రనంగ ఘీంకరించుచు రేఁగి
కారుఖేనుంగులు కడల నడచె

తే. జిట్టలును గారుదున్నలు సివ్వగులును
దుమ్ముగొండ్లును దోడేండ్లు దుప్పు లార్పు
లుప్పరం బంటఁ జేయుచు నొకఁడ పోవు
బాలునకుఁ దోడు నీడలై బాట నడిచె. 17

వ. ఇట్లు వన్యంబులు తోడునీడలుగ నడయాడుచు గ్రామైకరాత్రంబుగ నట నట విశ్రమించుచు నుత్తరభూమార్గంబు వట్టి మెట్టుచుఁ బట్టణంబులు, పల్లెలు, నదులు, వనంబులు, పర్వతంబులు దాఁటిదాఁటి కతిపయప్రయాణంబుల నర్మదానదీప్రాంతకాంతారంబు లోచన గోచరం బయ్యె నక్కాంతారంబునం దొక్కచోట. 18

—♦ ఋష్యాశ్రమ వర్ణనము ♦—

సీ. సమచతురస్రమై చదు నయ్యు నొక్కింత
యున్నతస్థల మని సన్నుతిఁ గొన
గాలితాఁకున గాన మాలపించెడుచెట్లు
చుట్టును దట్టమై మట్టు మీఱఁ
బొన్నలు పొగడలు గున్నమామిడులును
నడుమ నం దందును గడిమి మెఱయఁ
జిలుకలు గోరువంకలును గోయిలలును
గేరుచుఁ గొమ్మలఁ గ్రేళ్ళు వాఱ
తే. జాజులున్ విరజాజులు సంపెగలును
మల్లెలును మొల్లలును బూచి మొల్ల మగుచుఁ
గమ్మవాసన నలుగడఁ గ్రుమ్మరింప
నాశ్రమ మొకండు కనుపండు వయ్యె నపుడు. 19

చ. కని యిది యేరియాశ్రమమొ కాని కనుంగవపండు వయ్యెడిన్
మనమున సంతసం బదియు మానని దయ్యెడు నియ్యెడ న్మహా
మునివరు లెవ్వరేనియును ముచ్చట లాడఁగ నుండ కుందురే
చని కనుఁగొందు నం చతఁడు చక్కటిదారిని చక్క నేఁగుచున్. 20

వ. ఈచుట్టుపక్కలన గోవిందనాథులదివ్యాశ్రమం బుండు నని విని యుంటి నిది యదియ కా వచ్చు నని నిశ్చయించుకొనుచు లోనికిం జనియె నంత.

ఉ. పూవులు పండ్లు కాయలును బోవులు పోసినయట్లు చూడ నై
యావల నీవలన్ బొలము నంతట నిండినచెట్లఁ జేమలన్
గోవెలలున్ శుకంబులును గోరలు కూయుచుఁ గూళ్ళు చేరుకో
జేవ చెడన్ దివాకరుఁడు చేరఁగఁ బోయెను బశ్చిమాద్రికిన్. 21

శా. ఆటల్ సేయుచుఁ బూవుఁదీవియల్పై నం దందు రేవానదిన్
మేటిల్లం జనుతమ్మిపుప్పొడులు నెమ్మె నెల్లఁ గాఁ జల్లు కొం
చాటోపం బటి వాతపోత మట శాఖాగ్రంబులన్ వ్రేలుమేల్
శాటీలం గదలించుచు న్నడచె విశ్వశ్రేయస్మై గేయమై. 22

ఆ. ఆచట నాఁకుటిండ్ల నందంద పూనులఁ
గాంచి యొక్కమూనికడకు నేగి
మ్రొక్కి ప్రవరఁ జెప్పి మోకరిలం బడి
నంత లేవ నెత్తి యతఁడు వాని. 23

వ. తేటిపాటిం జూచుచుఁ దనలోన. 24

ఉ. ఈతఁడు బ్రహ్మతేజమున నెల్లకడ వ్యాలిగించుచున్నవాఁ
డాతతశేముషీమహిమ నార్యులకుం దలమానికంబు నాఁ
బ్రీతి ఘటిల్లఁ జేసెడినిఁ జిన్నతనంబున నున్నవాఁ డహో
యీతనిఁ గన్నదంపతు లదెంతటిపుణ్యము చేసి యుండిరో? 25

ఆ. బాలుఁ డితని కింత వైరాగ్య మేలనో
కలిగె వీనిఁ జూడఁ గాంచి నంత
మోహ మంకురించె ముని నైననా కిందుఁ
గారణం బెదేని గలిగి యుండు. 26

వ. అని తలపోయుచు మాణవకునిదిక్కు మొగం బై. 27

—♦ శంకరుఁ డాశ్రమములో నొకమునిం దర్శించుట ♦—

మ. వడుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు నీ వైదుష్య మెవ్వానికిన్
బడయన్ రా దుపనాయనంబునకుఁ జెప్పం జాలెడి న్నీవయ

స్నుడు రాజాభరణాంశసంభవుఁడ వం చూహింప వచ్చు న్నినుం
బుడుతం డంచుఁ దలంప నొప్పెడి నె నీపుణ్యాం బగణ్యాం బగున్. 28

తే. కలదు మీదేశ మెక్కడో కన్నవారి
విడిచి కుఱ్ఱఁడ వేరీతి విపినములను
దాఁటి వచ్చితి పులులు నీదరికి రాఁ ద
లంకెనో యేటి కిట వచ్చి ♦ తంకకాఁడ.

చ. అనవుఁడు శంకరుం డను మహాత్మ! శివాత్మభవుండను నార్య నా
జనని గురుప్రసాదమున సంతలతోఁ బనిలేక విద్య లె
ల్లను దెలియంగ వచ్చె నొకలాఁగున నామది నన్ను లాఁగుటన్
గోనకొని సన్యసించుటకుఁ గోరికఁ జేసి యి టేఁగుదెంచితిన్. 30

తే. అనిన ముని యను వ్యాసునితనయుఁ డైన
శుకునిశిష్యుఁడు గౌడపాదుభచరితుఁడు
వానిశిష్యులు గోవిందపాదు లిచట
నున్నవార లీగుహాదరి నురుతపస్వి. 31

వ. వారికడ నీవు బ్రహ్మోపదేశంబు నొందు మనిన శంకరుండు. 32

మ. ఉపమన్యుప్రభృతుల్ మదంబకడ నే నున్నప్డు నాతో రహ
స్యపథం బేర్పడఁ గౌడపాదులమహాసామర్థ్యమాహాత్మ్యముల్
కృప నాకు న్వచియించి రే నతని నన్వేషించుచు న్వచ్చితిన్
జపిలోకేశ్వర! నీయనుగ్రహమునన్ శ్రేయసం బయ్యెడిన్. 33

తే. ఆడఁ జనుతీర్థ మెదు రైనయట్లు నేను
దర్శనము చేయ నెంచిన దైవతాభు
లైనగోవిందపాదు లీస్థానమందె
కల రనుచు విన్ననాఁడెంద మలరుచుండె. 34

---

♦ తంకకాఁడు = పట్టుదలకలవాఁడు;

వ. అనిన నాశివగురుపుత్రు నారాత్రిఁ దనకడం బెట్టుకొని మరునాఁ
డరుణోదయంబున మేలుకాంచి స్నానసంధ్యాదు లైనవెనుక నమ్మ
నీశ్వరుం డాశంకరకుమారుం దనవెంటం బెట్టుకొని గుహాగేహంబు
కడకుం జని గోవిందతీర్థపాదుల దర్శించి దండప్రణామంబు గావించి
యి ట్లనియె. 35

—♦ శంకరుఁడు గోవిందపాదులకడ నుపదేశము నొందుట ♦—

సీ. వెన్నెలల్ వెదజల్లుచున్నదో యనురీతి
నెమ్మోనినిగనిగ లెమ్మె గొలుప
నవరత్నములు రాలు నవ్వీన ననునట్లు
కాన వచ్చెడు మేనికాంతు లోలయఁ
బొందమ్మి రేకులపోలుపు నిలుపఁ జాలు
సోఁగకన్నులతీలు సొంపు నింపఁ
బలుకు పల్కినఁ దేనె లొలుకున ట్లగువాక్కు
వాణివీణాశ్రుతి ♦ క్రేణి సేయ
తే. దండము కమండలువుఁ దాల్చి దండి యగుచు
నుపనిషత్తులు చదువుచు జపము తపము
నెపుడు విడనాడ కుండెడు నెనిమిదేండ్ల
బాలకుఁడు వచ్చె మీగురుత్వంబుఁ గోరి. 36
క. అతఁ డితఁడ యనుచు గుహకడ
గతి గలుగం దోఁయ గురుఁడు కనుఁగొని వానిన్
మతిలోనఁ దెలిసి ర మ్మని
జతనం గూర్చుండఁ జేసె సవినయగతులన్. 37
ఆ. కూరుచుండి యతఁడు కొంతటిలోన గో
విందపాదయుగమునందు వ్రాలి

♦ క్రేణి = పరిహాసము.

ద్రొక్కి- మీఁసమక్షమునకు వచ్చితి బ్రహ్మ
విద్యఁ గోరి యనుఁడు హృద్యమతిని. 33

వ. సర్వజ్ఞుం డగుగోవిందపదాచార్యుండు శంకరునితో నేమియుం బ్రసం
గింపక బ్రహ్మోపదేశంబు చేసి శిఖాయజ్ఞోపవీతములు విసర్జనంబు
గావించి దండకమండలువులు ధరింపం జేసి తురీయాశ్రమధర్మంబు
లెల్లఁ దెల్లంబు గావించె నంత శంకరుండును. 39

ఉ. తొల్లిటిశంకరుం డనుచుఁ దోఁపఁగ రాక మహోన్నతక్రియా
భ్యుల్లసితార్థసిద్ధుల సముత్సుకతం దపముం జపంబు సం
ధిల్లఁగ నెల్లవేళలఁ బ్రతిష్ఠితహంసమయాత్ముఁడై జగం
బెల్ల నశాశ్వతం బనుచు నెంచుచు నెంచఁగఁ జేసె లోకముల్. 40

తే. ఆతఁ డహ మస్మి బ్రహ్మాహ మస్మి
యనుచు నారాయణస్మరణాతివేల
నిత్యనుధాసమేతుఁడై నిరతసత్య
నిరతుఁడై బ్రహ్మభూతుఁడై నెగడె నపుడు. 41

వ. ఇట్లు శంకరయతీంద్రుండు గురుశుశ్రూషాపరతుండై బ్రహ్మారాధ
నంబు గావించుచుండె. 42

—♦ వర్షర్తువర్ణనము ♦—

క. అంతటఁ బ్రావృట్కాలము
సంతతగర్జార్భటీప్రసంగిత సాంద్రా
సంతాభ్రావృతసర్వది
శాంతరమై తోఁచె విరహు లట్టిట్టు పడన్. 43

సీ. మేఘావృతం బయ్యె మిన్నెల్ల నుఱుములు
మెఱుములు తఱచయ్యె మిసిమిఁ దోఁపఁ
దరణిప్రభ యడంగెఁ దారకల్ నిసి మాసెఁ
బడమట నింద్రచాపములు దోఁచె

విడక శేలుఁ బవళ్ళు వడి హోరు మని జడుల్
పడియెఁ దాపము పటాపంచ లయ్యె
నృత్యంబు గావించె నెమ్మిలు మత్తల్లి
భేకరుతంబులు పెచ్చుపెరిగె

తే. వారిపరిషిక్తమై ధరావలయ మెల్ల
శాంత మయ్యె స్రవంతు లశ్రాంతకాంతి
మత్ప్రవాహము లయ్యె సమస్త భూత
సంతతికి సౌఖ్య మయ్యె నాసమయమందు. 44

మ. పురువార్ధారలు మర్దలధ్వనులు సంపూర్ణాశితాంగంబులున్
నిరతోద్యద్ఘనగర్జలుం గలిగి నిర్నిద్రప్రభావంబునన్
సురవీథిన్ దగునబ్దముల్ మదమునం జొత్తిల్లుసిందూరభా
స్వరనీలేభము లెప్డు బృంహితముల న్వర్తించు నా నొప్పెడున్. 45

మ. జలదధ్వానము మర్దలధ్వనులు గా శంపాలతల్ గుగ్గులూ
జ్జ్వలకీలమ్ములు గాఁ బ్రవర్షరుతి భాస్వద్వాద్యజాలమ్ము గా
నలిఝిల్లీకృతనాద మున్నతగతిన్ వ్యాపించుగీతమ్ము గా
నలిపెన్ నృత్యము కేకిలోక మెపుడున్ షడ్జంబునం బాడుచున్. 46

సీ. మెఱపుఁదీఁగెలతోడ మెలఁగుచు మదపుటే
నుగుల బోలి నల్లనై కొన్ని కొన్ని
పసపున కెనవచ్చి పచ్చనై హెచ్చి హిం
గులసమప్రభ నొప్పి కొన్ని కొన్ని
నగరవరంబులో నడగొండలో నాఁగ
ఘోరరూపము లయి కొన్ని కొన్ని
చిదురుపలై విడి కూడి చిక్కనై యుక్కెక్కి
కూటువల్ గట్టనై కొన్ని కొన్ని

తే. చిమ్మచీఁకట్లు గ్రమ్మిన ట్లుమ్మలించి
ఘోరనిశ్వాసమున దెసల్ పూరటిల్ల
నాకసం బెల్లఁ గ్రిక్కిఱియంగ నగుచుఁ
గురిసె ధారాధరంబులు కుంభవృష్టి. 47

శా. ద్యావాపృథ్వ్యవకాశ మింతయును లే దన్నట్లు కాలాబ్దముల్
చేవం బూరటిలన్ గజేంద్రకరపుష్టిన్ వృష్టి ధారల్ ధరన్
బ్రావంగాఁ బరమేష్ఠిచోదితములై పండ్రెండు నా ళ్ళబ్దముల్
ప్రావృడ్భార మనంగ నై కురిసె సర్వత్రామ్మయం బై కడున్. 48

సీ. ఇది భూమి యిది దిక్కు లిది దివం బన రాని
యట్లు మేఘావృత మయ్యె జగతిఁ
బ్రళయకాలము వోలెఁ జెళపెళార్భటులతో
నురుములు మెఱుములు నుప్పతిల్లె
నేన్గుతొండము లట్లు నెడ మింతయును లేక
జలధార లె ల్లెడ నలుము కొనియెఁ
గుండలతో నీళ్లు కుమ్మరించినరీతిఁ
గురిసె వర్ష మొకింత తెఱపి లేక

తే. కొంపలును గోడలును నేలఁ గూలిపోయెఁ
బ్రజల కిటు నట్టు నడయాడ వలను చెడియె
ప్రళయమందలి పుష్కలావర్తకములు
కురిసిన ట్లై మహోగ్రమై కురిసె వాన. 49

శా. కల్పాంతంబున నైనవర్ష ముగతిం గన్పట్టునవ్వర్ష మే
స్వల్పం బైనప్రదేశమే మిగులన ట్లై సర్వభూభాగముల్
బోల్పన్ సాగరమట్లునై కనుఁగొనన్ ఘోరప్రకారమ్ము నై
తెల్పం డెప్పర మయ్యె నయ్యెడ మహోద్రేకంబు పాకంబుగన్. 50

ఉ. కొండలమీఁది వర్ష మది కొంచెము గానిది యూట వాఁగులన్
నిండి మహోన్నతం బగుచు నిమ్నగలై వడి నేకకాలమం
దుండినయట్లు లుండి యవు డొం డగుతూఁకున నర్మదానదిన్
గొండకు నెత్తివచ్చి పడె గొండొకనాఁటికి లేని వగ్గతుల్. 51

సీ. బుసకొట్టుచుం దాఁచు కసి చూపుచుం బాఱు
వఱ్ఱు భీతిద మయ్యెఁ బ్రాణితతికి
గుభులు గుభు ల్లను ఘోరారవ మ్మొక్క-
చోట హోర్మను నట్టి మేటిధ్వనియు
మఱియుఁ గొండొక చోబ మదుపుల ధింధిమి
శబ్ద మొండొకచోట నబ్దనాద
మొక్క-చో మద్దెళ్ళయులివు వేఱొకచోట
శంఖారవ మ్మొక్క-చక్కి-వేణు

తే. నాద మిఁకనొక్క-చో వీణనాద మవల
నొక్క-చో జిమ్మ్మ రనుశబ్ద ముప్పతిల్ల
భువికి దివి కంతరము లేనిపోల్కిఁ బొంగి
నర్మదానది రేకెత్తె నలుగడలను. 52

—♦ శంకరుఁడు నర్మదానది నరికట్టుట ♦—

మ. అవు డానర్మద దండికొండపొడవై యడ్డంకు లానొడ్డులన్
టుపు టు ప్పొంచుఁ దెగం బొనర్చి దివమున్ ముట్టంగనై పొంగుచున్
సుపరిష్కారము చేసి రెండుకడలన్ జూపట్టుపెంజెట్టులన్
విపరీతంబుగఁ గూల్చి నైచెఁ బురముల్ వేశ్మంబులున్ సర్వమున్.

మ. అలపోమోద్భవ పొంగి యట్లు భయదం బైయుండఁ దద్రోధమం
దలి పెన్ కందరమందు యోగమును సంధానించి లోకస్థితిం
దెలియం జాలక యున్న దేశికున కేదే బాధ యౌ నంచు లోఁ
దలపోయం గలఁడై శివాత్మజుఁడు విత్రస్తాత్ముఁడై తత్తఱన్. 54

వ. తత్రత్యులకుం జెప్పి యప్పుడ కమండలువుం గొని యభిమంత్రించి కుంభసంభవుండు సముద్రోదకముం బోలె నర్మదానదీప్రవాహం బున కభిముఖంబుగా దానిముఖంబుచేర్చి పట్టుకొని మంత్రబలంబునం జలింప కెదురు నిలిచె నంతలోన. 55

మత్త. కొండసొద్దునఁ బొంగి వచ్చెడు కొత్త మేఖలకన్య యం
దుండి మీఁదికిఁ బోవఁ జాలక యొక్కతూఁకునఁ గుంభమం
దొండొకం డగుచోట డాఁకొనునోజ కయ్యె నొకింతలో
నెండకాలమునందునుం బలె నెండిపోయె జలం బొగిన్. 57

తే. అంత గోవిందయోగి సమాధినుండి
లేచి శంకరమూర్తి కల్పించినట్టి
సిద్ధి కచ్చెరుపడి వానిఁ జెంతఁ జేర్చి
కౌఁగిలించుచు నిట్లనెఁ గౌతుకమున. 57

శా. వత్సా! నీదుకమండలూదరమునన్ వర్తిసరేవానదిన్
వాత్సల్యంబున వోలెఁ బట్టితఁట! నీసద్జ్ఞాపరిభావంబు నే
తత్సభ్యుల్వచియించి రే నెఱుఁగుదుం దత్పూర్వకాలంబునం
దుత్సారించెదు దుర్మతంబులను నే నూహించితిన్ సర్వమున్. 58

వ. కుమారశేఖరా! నేను నీ కొక్కసందేశంబు చెప్పెద నాకర్ణింపు మిప్పుడు. 59

క. సురచిరసంభృత మగుచున్
వఱలెడుజీవనము ద్విజగణముల కిడి మొగుల్
మెఱపునెలంతల విడి చె
చ్చెర దివిగ్రుహ మీఁగి ప్రవహించెడుఁ గంటే. 60

వ. ఇక్కాలంబున. 61

—♦ శ ర దృ తు వ ర్ణ న ము ♦—

సీ. నదు లెల్ల నిర్మలానందకందము లయ్యె
నంచల కానంద మతిశయిల్లె
నాకసంబు వినిర్మలాకారమును బొందెఁ
దీరి నక్షత్రముల్ తేజరిల్లెఁ
బండువెన్నెల గాచె నిండి శే ల్కన్నుల
పండువై తమలముల్ పరిఢవిల్లెఁ
బొలము లెల్లను సస్యకలితంబులై యొప్పెఁ
గపిపనంటులు కడుఁ దలిర్చె

తే. నలినగర్భమరందపానప్రమత్త
భృంగసంగీతనాద మెసంగె దెసల
భూమిసతి కిడ్డ మేటివింజామరములు
నాఁగఁ దగె తెల్లుపూల్ శరదాగమమున. 62

మ. ఎలమిన్ గార్తికమాధవుండు త్రిజగద్వ్యాప్తాపరస్వాంతుఁడై
యిలపై మెట్టఁగ రాఁ దదీయు లపు డెంతే భక్తి గావించి ర
త్తులసీకాంత సహస్రదీపములతోఁ దో తెచ్చె నత్తమ్మి పూ
ల్సెలగం జల్లె ననంటి పం డ్లిడె వహించెన్ తెల్లు వింజామరల్. 63

తే. తమకు నాకాశధర్మము దవిలి కొనఁగఁ
గలక దేరి వినిర్మలగతులు గలిగి
సరసు లుల్లసిలున్ శరత్సమయమునఁ బొ
నరు పరమహంసల కగుమానసము లట్లు. 64

తరువోజ. శరదృతు వీరీతిఁ జనుదెంచె నభము
శరదవిహీనమై శాంతమై యుండె

ధరణిపైఁ బంకముల్ తగ నాఱె నేళ్ళ
తర చడంగెను గాలిదారు లేర్పడియెఁ
గరువలి చల్లనై కడలందు వీవఁ
గడఁగె వెన్నెల శేలఁ గాయు నచ్ఛముగ
సరసిజంబులు వికస్వరములై తోఁచె
సకల దిక్కులును విశదములై యొప్పె. 65

వ. ఈదినంబులు ప్రయాణసుకరంబులు గావున నీ విప్పుడు వారణాసీ పురంబునకుఁ బయనంబై పొమ్ము నీ వక్కడఁ జేయఁ గలకార్యం బుండె నది సర్వోత్తమం బాకర్ణింపుము, 66

ఉ. అత్రిమునీశ్వరుండు మును నాహిమవన్నగపార్శ్వ ్యమం దొగిఁ
సత్రి మొకం డొనర్చె మునిచంద్రులు నింద్రముఖామరోత్తములే
మైత్రిపురస్సరంబుగ సమాగతులై రపు డల్లశక్తికిన్.
బౌత్రుఁడు బ్రహ్మసూత్రకవి వచ్చెను శిష్యసమేతుఁడై తగన్. 67

ఆ. ఆతఁ డాసత్రమున నుపన్యాసముగను
బ్రహ్మసూత్రములను వినం బలికె నపుడు
వీనికిని భాష్య మొనరించి విశదపఱుప
నొప్పు ననునంత వ్యాసుండు చెప్పె నిట్లు. 68

శా. నాకుం బైచెయి లోకరక్షకుఁడు నానాశాస్త్రవిద్వర్యుఁ డై
వాక్శ్రీ మెప్పినవాఁడు పుట్టు ఘనుఁడై వర్తించి గోవింద శి
ష్యాకారంబును దాల్చి సోమతనుజన్మాసక్ష్యయం బెల్ల ని
చ్ఛాకల్పంబునఁ గుంభమందు నిలుపున్ శశ్వద్వశిత్వంబునన్ 69

తే. అతఁడు భాష్యము రచియించి యఖిలజగతి
యందు వెలయించు నని చెప్పి యరిగె ననుచు
గౌడపాదులు నాగురుల్ కరుణఁ జేసి
నాకుఁ జెప్పిరి కావున నోకుమార. 70

వ. నీవు ప్రయాణంబు గావింపుము మహాకార్యంబు నిర్వహింపు మని
యంపి పుచ్చిన శంకరుండు గురునకుం బ్రదక్షిణనమస్కారంబు
లర్పించి యెల్లవారికిం జెప్పి యొప్పించి పయనంబై కతిపయ
ప్రయాణంబులఁ బుణ్యారాశి యగు కాశికిం జనియె నదియును. 71

—♦ కాశీ వర్ణనము ♦—

సీ. ప్రవహించు నేపురి ప్రాగ్భాగమునయందు
రంగదుత్తుంగతరంగ గంగ
మానొందు నేపురి మణికర్ణికాకుండ
మఖిలాప్లవన్నరాంహఃప్రకాండ
మింపొందు నేపుర మేకార్ణవం బగు
నపుడును శివుత్రిశూలాగ్రమందు
సతతమే ప్రోలిపంచక్రోశముల మేరఁ
జచ్చువారికి మోక్ష మిచ్చుమహిను.

తే. అట్టివారాణసీపురి నన్నపూర్ణ
దుండిమాధవభైరవదండపాణు
లెల్ల సురలు వందేకాశి యింపు మీఱ
నెప్పుడుఁ గొల్వ వశించు విశ్వేశ్వరుండు. 72

తే. తనదుకడుపునఁ బడునట్టిజనుల నెపుడు
వెండిఁ గూర్చుండి బంగారు వేల్ల నంటి
యష్టభూతు లనుభవింప నాచరింతు
ననుచుఁ గై కంకణము గట్టుకొనియెఁ గాశి. 73

క. వరుణాసీమధ్యమునన్
బరఁగుట నిది వారణాసి వారాణసి నా
ధరఁ జే రొందెను గాశీ
పురవరము ప్రకాశమానపురమై వరమై. 74

చ. దురితలతాలవిత్ర మయి దుర్నయగాఢతమిస్రమిత్రమై
పరమపవిత్రమై సుజనవర్యుల కెంతయు జ్ఞానసూత్రమై
గురుతరమోక్షసత్రమయి కోరికచేలను బెంచు క్షేత్రమై
పరఁగెడుఁగాశికాపురము భర్గనివాసపురాతిపాత్రమై. 75

వ. అని యభివర్ణించుచుం జని చని మును మున్న త్రిపథగామినిం దర్శించి. 76

మ. పరఁగం దొల్త హిరణ్యగర్భునిశుభవ్యాపారపాత్రంబునన్
వరనీరం బయి పిమ్మటన్ హరికి సత్పాదోదకంబై యనం
తర మీశానునిశీర్షభూషణమునై తర్వాత శ్రీజహ్నుస
ద్వరకన్యామణియై ప్రకాశిలెడు నీభాగీరథీగంగయే. 77

సీ. అతఁ డంతదనుక స్వర్గతి నొందు నిం దెంత
దనుక నెవ్వనియెమ్ము లొనరుచుండు
నతఁడు జగద్వంద్యుఁడై శివరూపుఁ డౌ
నేతత్తటమునందు నెవ్వఁ డీల్గు
నతఁడు సవితృగోళమం దుండు నెవఁ డిందు
సావిత్రి జపియించి సంధ్య వార్చు
నతఁడు పితృప్రీతి నమరత్వముం బొందు
నిందుఁ బిండము లెవ్వఁ డిడునొ పితృల

తే. కిందు వారాణసీక్షేత్రమందు మరణ
మంద నెంతు రిం(?)దుందొట్టియమరు లెల్ల
మూఁడుకన్నులు నైదుమోములును బొంది
చిలువపేరులు నెలనగల్ చేకొనంగ. 78

వ. అని యభివర్ణించుచు సమీపించి చేతులు మోడ్చుకొని. 79

శ్లో. మహోత్తుంగే! గంగే! ప్రవిమలతరంగే! శివగురో
ర్జటాజూటా జ్జాతా సగరతనయానాం శుచివిధౌ

సమాయాతా పూతా సుకృతసమవేతా శుభయుతా
పునీ హ్యంబే! త్వం మాం సకలజగదంబే! కరుణయా. 80

వ. ఇట్లు భాగీరథిం బ్రార్థించి కంఠదఘ్నం బగుజలంబుల నఘమర్షణ స్నానంబు గావించి జపతపంబు లైనవెనుక మణికర్ణికాజలం బాడి విశ్వేశ్వరాలయంబునకుం జని శతరుద్రీయాభిషేకంబు గావించి పూజించి లేచి చేతులు జోడించుకొని— 81

—♦ ఈశ్వర ప్రార్థనము ♦—

శ్లో. శ్రీనాథ ప్రముఖాఖిలామరగణై స్సాకం ప్రపంచం సదా
సర్వం వస్తు మహేంద్రజాలవిధిగా విజ్ఞో యథా లీలయా
కుర్వ న్సృష్టివినాశనంచ విలసత్సర్వేశ్వర శ్శంకరః
పాయా ద్భారతభూజనా ననుదినం సంరక్ష్య మార్గం మనోః. 82

శ్లో. మా మవ సకలజనాంత
ర్యామిన్ సనకాది సన్నుతామలధామన్
స్వామిన్ భక్తావనసు
ప్రేమన్ వృషభాధిరాడ్వరేణ్యాలలామన్. 83

సీ. శర్వాయ రుద్రాయ సర్వేశ్వరాయ ప
శూనా మధీశాయ సుస్థిరాయ
దేవాదిదేవాయ దివ్యప్రభావాయ
భక్తజనావన ప్రాభవాయ
లోకస్వరూపాయ లోకేశ్వరా యాది
మధ్యాంతశూన్యాయ మహిరథాయ
నిత్యాయ సత్యాయ నిర్గుణాయ గుణస్వ
భావాయ మునిజన ప్రస్తుతాయ

తే. లోహితాక్షాయ నిటలవిలోచనాయ
సర్వదేవస్తుతాయ వృషధ్వజాయ

చంద్రశేఖరాయ శివాయ శాశ్వతాయ
విశ్వరూపాయ భవ్యాయ తే నమోఽస్తు. 84

వ. అని ప్రార్థించి ప్రసాదంబు నడసి మాధవ, డుంఠి, దండపాణి, భైరవ, వందేకాశీ, గుహా, గంగా, భవానీ, మణికర్ణికల సేవించి మధ్యాహ్నంబున మధుకరాన్నంబు భుజించి యొక్కచో విశ్రమించె నిట్లు కొన్ని దినంబులు కడచనిసప్పు డొక్కనాఁడు. 85

సీ. కాషాయవస్త్రము కాపీనము ధరించి
కటిసూత్రముగ ముంజగడ్డి చుట్టి
యేణాజినముముక్క యింతఁ గటి స్త్రోలఁ
దాలిచి సాలాశదండ మూని
కాళ్ళకుం జిఱుపావకోళ్ళలం దొడిగియు
దాళపత్రచ్ఛత్ర మోలిఁ దాల్చి
కకపాలయును బుస్తకములు చంకం బెట్టి
కృష్ణాజినపుచుట్ట కేలఁ బూని
తే. ఉపనిషత్తు లోంకారసంయుక్తములుగఁ
జదువుకొనుచును మెలమెల్ల పదము లిడుచు
బాలుఁ డగువాఁడు బ్రాహ్మణబ్రహ్మచారి
క్రన్నఁ జనుఁదెంచె శంకరుఁ డున్నకడకు. 86

—• శంకరుఁడు శిష్యులంబరిగ్రహించుట •—

వ. ఇట్లు చనుదెంచి శంకరభగవత్పాదాచార్యుల పాదపద్మంబులపైఁ బడి ప్రణామంబు గావించి నంత నాచార్యు లాతని నెత్తి కరస్పర్శనంబు సేయుచు. 87

ఉ. ఎవ్వరు నీవు నీయునికి యెవ్వరమం దిట నేమి కోర్కిమై
నివ్వయసం బ్రయాణము వహించితి బాలుఁడవై యబాలున

ట్లైన్వగఁ గానిపించెద వి దెల్ల ననుక్రమ మేర్పడంగ వా
కుృవ్వ మనంబు సేయు మనఁ గొండొకయింతటిలో నతం డనున్.88

చ. గురువర ! నేను బ్రాహ్మణులకొండిక కొండొక వేదపాఠమున్
గురులకడం బఠించితి నకుంఠితభక్తిఁ గవేరకన్యకా
వరతటమందుఁ జోళమున వాసము చేసెడివాఁడ నెన్నియో
పురములు గ్రామముల్ నదులు భూధ్రములు న్వడి దాఁడి వచ్చితిన్.

ఆ. ఏకదేశమఁద యిద్దఅజన్మ మ
ట్లయిన మిమ్ముఁ జూడ నైతి కలుగ
దయ్యె నింతలోన నియ్యుదీచికి మీరు
చేరితి రని మాట చెవికి వచ్చె. 90

ఉ. పెద్దలఁ జూచువేడ్క నను బ్రేరణముం బొనరింపఁ బెద్దద
వ్వొద్దియు నాక వచ్చితి యతీశ్వరపాద ! భవాబ్ధి మున్గ నై
పెద్దవిపద్దశం బడెడువీనికి నీదుదయాప్లవంబు మే
లద్దిర నాఁ నొసంగుటకుఁ బ్రార్థనముం బొనరింతు దేశికా. 91

ఆ. *ఏ సనందనాఖ్య నెసఁగెడువాఁడ నా
కిహాపరంబులందు నీవె దిక్క
టనుఁచు బదము ముట్టఁ గని శంకరుఁడు కృపా
కలితహృదయుఁ డగుచు గదియఁ దీసి. 92

వ. హస్తమస్తకసంయోగంబున బ్రహ్మోపదేశంబు చేసి సన్న్యసింపం జెప్పి యుత్తమపదంబునం బ్రతిష్ఠించె నంతఁ గొంతకాలంబులో మఱియుం గొందఱు దేవతాంశసంభవు లగువా రాశంకరు నాశ్రయించి తురీయాశ్రమస్వీకారంబు చేసి యంతేవాసులై భాసిల్లిరట్టికాలంబున. 93

ఆ. పరిమళించుపూలఁ బారిజాతము వోలె
భానుమండలముల భానురీతి

---

* సనందనునకు, సునందుఁడు, సుసనందనుఁడు, సానందుఁడు అనియుం బేరులుకలవు.

నేత్రకమలములను వృత్రారియుం బోలె
శిష్యగణమునడుమ శివుఁ డెసంగె. 94

తే. ఇట్లు శిష్యప్రశిష్యసమేతుఁ డగుచు
వేదవేదాంగవిషయముల్ విస్తరించి
వ్యాససూత్రార్థముల నుపన్యాససరణిఁ
దెలుపుచుం గాశికాపురి నిలిచి యుండె. 95

తే. ఒక్కదివసంబునం బ్రాహ్ణ మొయ్య నొయ్య
నపసరిల్లినయంత శిష్యతతి గొలువ
శంకరస్వామి కుండి హస్తమునఁ బూని
స్నాన మొనరించుపొంటె జాహ్నవికి నేగె. 96

—♦ శంకరునకు మాయాపుల్కసదర్శనము ♦—

వ. అయ్యవసరంబున. 97

సీ. పచ్చితోల్తిత్తులఁ బలలంబు నిండించి
మోపది నెత్తిపై మోసికొనుచుఁ
బసులడొక్కలలోనిపచ్చినెత్తురు దీసి
తెగఁ ద్రావి గట్టునఁ దేంచికొనుచు
లొట్టెలఁ బులియంగఁ బెట్టినతాటిక
ల్లొలిమై మాటికిఁ గ్రోలికొనుచు
మెత్తనైమాంసము నెత్తురు వెలి జిమ్మ
గొడ్డుంతోళ్ళను మేనఁ గొట్టుకొనుచు

తే. దుష్టుక ట్టొండు వలకేలఁ దులకరింపఁ
గహగహార్భను లెల్లెడఁ గ్రందుకొనఁగ
జాగిలపుఁగుక్క లెన్నియో మూఁగి నడువఁ
బుల్కసుం డొక్కఁ డెదు రయ్యెఁ బోవుదారి. 98

వ. ఇట్లు వెలివాడవాఁడు మార్గమధ్యంబున నెదురుపడుటకు శంకరుండు
తృణం బంతర్ధి గావించుకొని వానిం గాంచి యి ట్లనియె. 99

శా. ఓరీ! బ్రహ్మము నుచ్చరించుచును మే మోంకార మాలించుచున్
సౌరద్వీపవతీప్రవాహమున స్నానంబుం బొనర్పంగ నీ
దారిం బోవుచు నుంటి మీవు మము సందర్శించియున్ దవ్వుగాఁ
దారం జూడవు పుణ్యపాపములపొంతం బోవ కుంటొప్పనే. 100

క. తొలఁగుము దారి యొసంగుము
కలుషము నీ కంట వచ్చుగతిఁ బోవకు మో
వెలివాడవాఁడ! యనుడున్
హాళహాళ మని శ్వపచుఁ డనియె నాయతితోడన్. 101

సీ. అద్వితీయ యతీశ్వరా! ద్వైతభావము
పాటించుచుంటి వి దేటిమాట
పరమాత్మయే జీవ మరయ సత్యము నన
వద్య మఖండము ప్రత్యగాత్మ
మని నిగమాంతము లనుచుఁట భేదభా
వమును గల్పించుట చనునె చెపుమ
జ్ఞాను లి ట్లనుటలు గానము కాషాయ
దండాదు లీదేహమండనములు

తే. బ్రహ్మపుల్కసభేదకల్పనము దేహ
మునకొ జీవమునకొ యెగ్గికొనుము గంగ
యందు సురయందు బింబించునర్యమునకు
భేదబుద్ధి చేయుటలు వివేక మొకొ. 102

మ. అనినన్ విస్మితుఁడై యతీంద్రుఁడు భవద్వ్యాహారము ల్సత్యముల్
తనుభృద్వర్య! ప్రమాదవాక్యములు వేదప్రోక్తము ల్వాల్కితిన్

గనుఁగొ నంత్యజుఁ డీ వ టన్న మతి పోకారెన్ జగం బీశ్వరుం
డనుబుద్ధిం గలవాఁడు నాగురువరుం డౌఁ బుల్కసుం డేనియున్.103

ఉ. ఈవు మనుష్యమాత్రుఁ డని యే నెటు నమ్ముదు నచ్యు దండముల్
గావులు దాల్చి యున్ననుఁ గన్గొన వచ్చితి పుల్కసుండ వై
నావలనం బ్రమాదమును నాటఁగఁ జెప్పితి దేవదేవ ! గౌ
రీవర ! నీపదాబ్జములు రేపులు మాపులు మ్రొక్కి కొల్చెదన్.104

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు.

సీ. చే నున్నలగుడంబు చిత్రచిత్రింబుగా
మువ్మొనవా లయి పొలిచెఁ గేల
నలుగడం బూతిగంధం బీనుపచ్చితో
ల్శార్దూలచర్మ మై సౌరు మీఱె
మొఱుఁగుచు వెన్నంటి పఱచివచ్చెడునాల్గు
కుక్కలు శ్రుతు లయి గొనబు సూపె
నెత్తురు గార్చుచు నెత్తిపై నున్నప
లలము మిన్నే రయి లలిఁ దలిర్చె

తే. ఒడలు నల్లదఁ బూయంగఁ బడిననెత్రు
వసయు మాంసము భూతియై పరిఢవిల్లెఁ
గహకహధ్వని వేదవాక్కులకల మయి
వఱలె శ్వపచుండు శంకరస్వామి యయ్యె. 105

వ. ఇట్లు పొడకట్టి తనయడుగులఁ జాగిలం బడినవాని లేవ నెత్తి
నెత్తిపైఁ జెయి పెట్టి యి ట్లనియె. 106

ఉ. ఏ నొకరుండ నీ వొకఁడ వి ట్లనుభేదము సేయ రాదు నీ
వైన నెన రెంతయేనియును బర్వె సుపర్వసమంచితుండ వీ
వానలినాక్షతుల్యుఁడవు వ్యాసునిఁ బోలినవాఁడ వెన్న నో
మానివరేణ్య ! నీ వరుల మార్గాని చేసెడుకార్య మెయిం డగున్.

తే. జైన చార్వాక బౌద్ధాద్యసమ్మతములు
పెక్కు లుదయించె వానినిఁ జక్కడంచి
వేదమత ముద్ధరించెడు వేళ వచ్చె
నీవు జతనింపఁ దగు దాని కోవలంతి ! 108

ఉ. వ్యాసుని నీ వెఱుంగ వఁట వైదికమార్గము చక్కఁ జేయఁ గా
నాసరసీరుహాక్షపరమాంశమునం బ్రభవించె భూమిపై
భూసురవంశమం దతఁడు పోహణచేసెను బ్రహ్మసూత్రముల్
న్యాసము చేసి దాని కగువ్యాఖ్య పౌనర్భవము నేర్పు పేర్పడన్.109

తే. మఱియు నీవు మండనముఖ్య మహీసుపర్వ
వర్యులం గెల్చి యద్వైతభవ్యమతము
స్థాపన మొనర్చి కృతకృత్యతను వహించి
తనువు విడనాడి ననుఁ జేరు దనుచుఁ బలికె. 110

వ. శివుండు కన్ను మొఱంగె నంత మాయామానుషదర్శనంబున నొడ లెఱుంగకున్న సనందనాదిశిష్యు లపుడు నిదురనుండి మేలుకొనిన వారిచందంబున మేలు కాంచి గురువర్యా ! దివాకీర్తి వర్తనం బించుక యెఱింగితి మనంతరవృత్తాంతంబు మైకమ్ము పెంపున నెఱుంగ మని పలుకుచుండఁ గానిం డని వారిం దోడుకొని గంగకుం జని మజ్జనం బాచరించి మాధ్యాహ్నికకృత్యంబులు నిర్వర్తించు కొని మాధుకరాన్నంబు భుజించి యొక్కచో విశ్రమించి రంత శంకరుండు తనమనంబున. 111

ఆ. బ్రహ్మసూత్రములకు భాష్య మొనర్పు మ
టంచు నాగురువరుఁ డానతిచ్చె
వ్యాసమునియు నాకు వాక్రుచ్చె శివుఁ డిట్లు
పొలిచి జ్ఞప్తి చేసెఁ బూర్ణకృపను.

ఉ. భాష్యము సేయ నేఁ బ్రతినపట్టితి బ్రహ్మముపట్ల నాకు నై
దుష్య మెటుండునో యనుచు దొప్పలు దొరలు సందియంబు లౌఁ
గృష్యనుకూలతల్ గలుగ వీపురి నుండిన రేఁగుగడ్డకున్
శిష్యుతో గమించి యటఁ జేసెద భాష్యము భూష్యమై తగన్. 113

వ. అని తలంచి పయనంబు నిశ్చయించి. 114

—♦ శంకరుఁడు బదరికిం జని భాష్యములు చేయుట ♦—

సీ. అవల శిష్యసమేతుఁ డై పదిరెండేండ్ల
వాఁడు శంకరభగవంతుఁ డలరి
కాల్నడఁ గ స్థికై కతిపయవాసరం
బులకు బదర్యటవులకు నేగి
యట నొకచో జొంప మగుచెట్టుక్రింద నా
శ్రమ మొండు నిర్మాణ మమరఁ జేసి
యం దుండి కృత్యము లన్నియుం దీర్చుచుఁ
గరతలామలకముగాఁ గనఁ బడఁ

తే. దమలువడ సూత్రభాష్యము తా వచించె
శోకమోహాదు లూర్ము లె కాక స ప్త
ధాతువులు నింద్రియార్థముల్ తరిమి నట్టి
ఋషివరేణ్యులు తన్నాశ్రయించి వినఁగ. 115

తే. దినము చేసినభాష్యము విని పఠింపఁ
జెప్పె నందు సునందనుఁ డప్పవిత్ర
భాష్యమును మూఁడువారముల్ పఠనపాఠ
ముల గ్రహించి ఘనుం డయి పొలుపు మిగిలె. 116

వ. మఱియు శంకరస్వామి గీతాభాష్యము, నుపనిషద్భాష్యము, సనత్సుజాతీయభగవద్గీతాదులకు మహోన్నతవ్యాఖ్యయుం గావించి

యుపదేశసహస్రము లోనగుమహాగ్రంథంబు లనేకంబులు రచించి నిజాంతేవాసులకుం జెప్పి బదరికాశ్రమంబున నున్ననారాయణు నకు నమస్కారంబు గావించి తదనుజ్ఞం బడసి వచ్చినపని సంపూర్తి యయినది గావున మరలి కాశికాపురంబునకుం జను దెంచె నంత. 117

క. గురుభక్తిభరితుఁ డగుచున్
బరఁగె సునందనుఁడు గురుఁడు పలికినభాష్యం
బరమరలు లేక తెలిసెన్
గరబదరము వోలె నగ్రగణ్యుం డగుచున్. 118

—♦ సు నం దుం డు ప ద్మ ప దుం డ గు ట ♦—

చ. గురుఁడు సనందనా! యనుచుఁ గొంచెము లోపలఁ గూఁడఁ గొంచెమా
స్వరమునఁ బిల్చిన న్నిదురశయ్య నెసంగుచు నున్న నోఁ! యటం
చురువడి వచ్చి స్వామి! యిదె యుంటి నిటన్ గురునాజ్ఞ యేమి యం
చరమర లేనిచిత్తమున నాడు సనందనుఁ డార్యు లా ననన్. 119

ఆ. అట్టివానియెడల నాచార్యులకుఁ బ్రీతి
యగ్గలించె దాన నవలిశిష్యు
లట్లు చేయు టొప్పునా? గురునకు శిష్యు
లెల్ల సములు గారె యెన్ని చూడ. 120

వ. ఇట్లం తేవాసులలోనియభిప్రాయం బెఱింగి దాని మాటలం గాక చేఁతలం జేసి తొలంగింప నెంచి గురుండు సమయప్రతీక్ష గావించు చుండె నాలో నొక్కసమయంబున సనందనుం డెద్దియేనిపని గలిగి గంగం దాఁటి యవలిగట్టున మెట్టుచుండె నది మంచితరుణం బని గురువరుండు. 121

ఉ. ఓయి! సునంద రమ్మిగి తెట కొండొకకార్యము సత్వరంబుగన్
జేయఁగ నుండెఁ గన్నెఱవఁ జేసెదులోపల రమ్ము ర మ్మటం

చాయెడఁ బల్క నప్పలుకు లారసి వెన్కయు ముందుఁ జూడ న
ల్లై యొకయింతలోన నదియందు నడం గడగెం గడు న్వడిన్. 122
తే. అజ్ఞుఁడై యట్లు చేయలే దాతఁడు గురు
భక్తి సంసారసాగరప్లవ మటందు
రిప్పు డీచిన్ననదిదాఁటు టేమి బ్రాతి
యనుచు ధైర్య మాతనిమది కయ్యె నిజము. 123
చ. అతఁ డొకకాలు నీట నిడి నంతన బంగరు తమ్మి క్రింద నై
క్షితిపయి మోపిన ట్లయినఁ జెంగున రెండవకాలు వేయ న
గ్గతిఁ గమలంబు పుట్టె నది గన్గొని దేశికుభక్తి నెంచుచున్
బ్రతిపదమందు న ట్లయిన వచ్చెను దాఁటి నదిం బదంబులన్. 124
తే. గురునకు నమస్కరించె నగ్గురుఁడు మెచ్చి
పద్మపదుఁ డని పే రొట్టి పలుకరించెఁ
దక్కునం గలశిష్యులు తమకుఁ దామ
దిద్దుకొనఁ జాలి సుహృదులై తేరి రపుడు. 125
మ. ఇటు లాశంకరమూర్తి కాశిపురిలో నిద్ధప్రచారంబులన్
స్ఫుటదీప్తి న్విలసిల్లుభాష్యమును శిష్యుల్ దాను లేకెత్తున
ట్లట వ్యాప్తిం గొనఁ జేయుచుం గుమతమం దాసక్తులై వాదముల్
పటుశక్తిం బచరించుపాశుపతులం బ్రత్యర్థులం దూలిచెన్. 126
మ. శ్రుతిశాస్త్రాదుల సూత్రభాష్యము జగత్ప్రఖ్యాతమై సర్వసం
మ్మతిఁ గైకొనఁ బొనరించుచుం బురము నల్ మార్గంబులం బొల్చుపం
డితవర్యుల్ బళి రే యటంచు నుతు లుత్కీర్ణంబుగాఁ జేయుచున్
బ్రతిపాదించె శ్రుతిప్రచోదితమహాద్వైతంబు పూతంబుగన్. 127

— శంకరుఁడు కాశిలో చార్వాకాదులను నోడించుట —

శా. చార్వాకాదులు బౌద్ధముఖ్యులు జినాచారప్రచారస్థితుల్
గర్వం బేర్పడ శంకరుం బొదివి దుర్గ్రంథప్రకారంబులన్

నిర్వర్తిల్లఁగఁ జేయుచుం గుపథముల్ నిర్మించుచున్ శంకరుర్
సర్వేశుం దొడరంగ వచ్చి విముఖస్వాంతాత్ము లై రందఱున్. 128

తే. శంకరోపనిషద్భాష్యసార మెల్ల
నరసి వారాణసీపురవరనివాసు
లయినకొంద ఱక్షీపదపక్షాశ్రితు లయి
యోపి ఖండింపఁ గాఁ బూని యోడి రపుడు. 129

తే. సర్వతంత్రస్వతంత్రులై శర్వుపురినిఁ
గలరు భాస్కరగుప్తమిశ్రులు మొదలగు
వారు విద్యేంద్రగురులు శారీరసూత్ర
భాష్యము న్విని సంతోషభరితు లైరి. 130

చ. మునివర దుగ్ధసింధువునఁ బుట్టినభాష్యశశాంకమూర్తి తా
ననిశము గోపరంపరల నచ్ఛము చేసి సుధారసంబు పెం
పున విబుధాళి కిచ్చి తమము న్విదళించుచు నెల్లవీథులర్
మునిజనహృచ్చకోరములభుక్తికి నై పొలుపొందె నిద్ధరన్. 131

మ. పదిరెండేడులవాఁడు బాలకుఁ డహో బ్రహ్మణ్యు లావారితో
బదులాడం గలఁడై మహోన్నతము నౌభాష్యప్రపంచంబునర్
మొద లేదో తుద యేదొ శోధనగతిర్ మోహింపఁగాఁ జేయుచుర్
సదసద్భేద మెఱుంగఁ జేసె శ్రుతులన్ శాస్త్రంబులన్ ధీరుఁడై. 132

తే. ఇట్లు కాశికాపురమున నెల్లకడలఁ
దనదుపాండిత్యగరిమం బుదారగతులఁ
బ్రస్తుతింపఁగఁ జేయుచుఁ బ్రతిమతములఁ
దూలిపోఁ దోలుచుఁ బ్రశస్తిఁ జాలి కొనియె. 133

వ. ఇట్లు శంకరభగవత్పాదుం డవిముక్తక్షేత్రంబున శారీరసూత్రభాష్య
ప్రచారంబు చేయుచు శిష్యుల కుపదేశించుచుఁ గుమతంబులం

దూలించుచు స్వమతం బగునద్వైతంబు పాలించుచుఁ జార్వాకాదు
లకు గుండెతల్లడం బగునట్లు ప్రచరించు చుండునంత నొక్కనాఁడు.

—♦ శంకరునకు వ్యాసుండు దర్శన మిచ్చుట ♦—

ఉ. మిత్రుఁడు తూర్పుకొండ మొనమీఁదికి వచ్చెడునప్డు లేచి తా
ఛాత్రులతోడ సౌరనది స్నానము చేసి సమాప్తకృత్యుఁ డై
ధాత్రి పటద్రుమంబుకడఁ దత్పరత న్నివసించి భాష్యమున్
ఛాత్రులకు న్సుబోధ మగుచక్కి వచించుచు నుండె దండిమై. 135

క. ఘటికలు హోరలు జాములు
చిటికల నై నట్టు లయ్యె శిరముల సూర్యుం
డటమటఁ గొలుపుచు నిలిచెన్
స్ఫుటగతి నాతపము గాచెఁ జుఱుచు జ్జనఁగన్. 136

తే. మట్టమధ్యాహ్న మగుట నాచెట్టుక్రింద
నున్నవార లెఱింగికొ నోప నట్టి
రయిరి భాష్యార్థలగ్నసుస్వాంతు లగుచు
నెండ వేఁడిమి వారల నేఁచ దయ్యె. 137

వ. అయ్యవసరంబున. 138

సీ. నిలువెల్ల నెఱసిన నెఱులు విభూతియుఁ
బండువెన్నెల కడల్ నిండఁ గాయఁ
దలయుఁ జేతులు గాళ్ళు తడ వింతయును లేక
వడక నుదుల్ తొట్రుపాటు నొంద
నిట్టితోల్చుట్టుతో నీవల వ్రేలాడ జా
రీ లంకె భుజముపై వ్రేలుచుండ
నడుగులు తడఁబడ నడచుచు నేలపై
వడకించుచుం గఱ్ఱ నిడుచు నుండ

తే. గంగడో ల్వాలె మేనితో ల్గదలు చుండ
మెదుకవాసన గొట్టెడుమేను జన్ని
దములు గావంచయును గ్రాలఁ దడుము కొనుచు
నచ్చె ముక్కాలిముదుసలిబాపఁ డొకఁడు. 139

ఉ. వచ్చి యెవండునుం దనదువంకఁ గనుంగొని ర మ్మటంచు వా
కిచ్చుట కాదిఁ దా నచటి కేగి యొకానొకచోట నేలపైఁ
బొచ్చెము లేక కూలఁ బడి మూల్గు చొకించుక నీ వెవండ వి
ట్లిచ్చటఁ జెప్పుచున్న దిది యేమి? వచింపు మటంచుఁ బల్కుడున్.

సీ. పలికిరి శిష్యు లీపగిది నోబ్రహ్మవి
దగ్రణీ! చెప్పెద మాలకింపు
మీమహాత్ములు మాకుఁ బ్రేముఁ గూర్చెడిగురుల్
సర్వోపనిషదర్థసార మెఱిఁగి
నట్టిరు సూత్రభాష్యము భేదవాదముల్
తొలఁగి పో యెడునట్లు సలిపినారు
ఎన్నఁ బ్రస్థానత్రయీభాష్యకర్తలు
ఘనులు గీతాభాష్యమును బొనర్చి

తే. రనఘులును భగవత్పాదు లాదిశంక
రులు చతుర్థాబ్దమున వేదములును శాస్త్ర
ములును నేర్చినమేధావు లెలమి మాకు
భాష్యము వచించుచుండి రోబ్రాహ్మణవర! 141

మ. అనువారిం గమనింప కాద్విజుఁడు లోకారాధ్యుఁ డౌశంకరుం
గని కీరల్ నిను భాష్యకర్త వనుచున్ భాషించుచున్నారు దా
నిని విన్నంతన విస్మయం బొదవెఁ గానీ యొక్కసూత్రార్థమున్
వినిపింపం దలపోయు మే వినెద నీవిద్యావిశేషాదులన్. 142

తే. అనుడు గురువందన మొనర్చి యతఁడు దేవ!
యేది వచియింతు ననఁ దృతీయాదినగు "త
దంతరే" త్యాదిసూత్రము దానిఁ దెలుపు
మర్థ మీవు గ్రహించినయట్టు లేని. 143

వ. అనిన శంకరుం డనేకహేతువాదంబులతో గౌతమ జైమిన్యాది ప్రశ్నప్రవచనంబుల నుత్తరంబు చెప్పిన జరఠబ్రాహ్మణుండు ఫక్కున నవ్వి శంకరులవచనంబు శతధా భిన్నం బగునట్లు ఖండించిన నతండు మఱియు ననేకశతసహస్రంబు లగుహేతువాదంబులఁ దద ర్థంబు ఖండించి తాను చెప్పిన వాని నెల్ల సమర్థించుచు వచ్చె నిట్లు దినాష్టకం బెడ తెగకుండ వారివాక్కలహంబు తీవ్రతరం బయ్యె నయ్యెడన్ జరఠబ్రాహ్మణుఁడు శంకరశిష్యులం గాంచి యి ట్లనియె.

ఉ. మీరు మహాప్రవీణులరు మీర లిదంతయు వించునుంటి రీ
తీరున నే నొకం డనినఁ దెం పది లేనటు మీగురుండు వే
సారులు వేనవేల్ శ్రుతు లొసంగుచు వాదము విస్తరిల్లు న
ట్లోరిమి లేక పల్కెడి నహో! యిది కా దని మీరు పల్కరో.

వ. అనుడు వారిలోఁ బ్రథమశిష్యుం డగుపద్మపాదుండు లేచి మోడ్పుఁ గేలు ఫాలంబునం గీలించి యి ట్లనియె. 146

శా. మీ రాకృష్ణులు కృష్ణునంశమున భూమిం బుట్టియున్నట్టి రో
కారుణ్యాంబుధి! వీరు శంకరులు సాక్షాచ్ఛంకరు ల్మీరు మీ
రీరీతిం దగ వాడుచున్నపు డహో యెంతెంతలేఁ గి మ్మనన్
నో రెత్తం గల రేము కింకరుల మేను వ్వీరు నే మందుమో? 147

మ. అనుచున్నంత నెఱింగి శంకరుఁడు రంహశ్శప్రక్రియన్ లేచి యో
మ్మనుచున్ వృద్ధునిపాదమందుఁ బడి సాష్టాంగప్రణామంబు చే
సి నొడిం జేయఁగ నోడినంతఁ గరుణం జేకొంచుఁ భూదేవుఁ డ
మ్మునినిం గౌఁగిటఁ జేర్చె నంతట మహామోఘుప్రభావంబునన్.

సీ. కొ్రిక్కారుజలదమున్ గిక్కురు మనకుండ
మెలపఁ జాల్నల్లనిమేను మెఱయఁ
బల్లవారుణజటాపటలంబు శిరముపై
గరుడపచ్చలమెచ్చు గా దనంగఁ
జరమావలగ్నసుందరతరైణాజిన
దీప్తులు దెసలందు వ్యాప్తిఁ గొనఁగఁ
గంఠభాగము నుండి కడుపుపై వ్రేలఁబడి
రుద్రాక్షమాలలు రూఢి మెఱయ
తే. దండము కమండలువు దరిదాపునందుఁ
దవిలి యుండఁగ బ్రహ్మసూత్రముల నొప్పు
తాటియాఁకులపుస్తము దనరుచుండ
జరఠవిప్రుఁడు వ్యాసుఁడై పరిఢవిల్లె. 149

వ. అట్లు ప్రత్యక్షంబై వ్యాసభగవానుండు శంకరస్వామి నుపలాలించు చున్నంత నతండు పునఃపునఃప్రణామంబు లాచరించి చేతులు జోడించుకొని. 150

—♦ శంకరుఁడు వ్యాసుని స్తుతించుట ♦—

శ్లో. స్వాగతం భగవతే మునినాథ !
త్వాం భజామి శిరసా ప్రణిపద్య
త్వం హి లోకగురు రచ్యుతమూర్తి
ర్భాసి భాస్కర ఇ వాపరకృష్ణః. 151

శ్లో. నమ స్తే దేవ! త్వం ద్విభుజ హరి రేవ త్రియణ్ణైన
ర్ద్విహీన స్సర్వేశోఽ చతురమలవక్త్రః కమలజః
బదర్యాం సంజాతో హరిహరవిరించాదివినుతః
క్షమ స్వాహో స్మాకం ప్రతిఘునటరూపప్రవచనమ్. 152

వ. అని దేవవాక్కులఁ బ్రస్తుతించినఁ బ్రసన్నుండై భగవంతుం డగు పరాశరాత్మజుండు పరిపరివిధంబులఁ బ్రణయంబుం బ్రదర్శించుచు నాచార్యుల దిక్కు మొగంబై యి ట్లనియె. 153

మ. శివసంబంధసభాంగణంబున ననుం జేరంగ నేతెంచి సి
ద్ధవరేణ్యుం డొకరుండు వ్యాసమునినాథా! నీ వొనర్పంగ నై
భువనవ్యాపక మైనసూత్రతతికిన్ భూతేశదివ్యాంశజుం
డవుబాలుండు యతీశ్వరుం డొకఁడు భాష్యంబుల్ రచించెం ధరన్.

క. నే నెందుఁ జనిన నందే
దానిం బ్రజ లాడుకొనిరి తాత్పర్యమునన్
నేను విని నీకుఁ జెప్పం
గా నిటకు న్వచ్చినాఁడఁ ఘనపుణ్యనిధీ. 155

క. అని చెప్పి పోయె నే నిన్
గన నిచ్చం జేసి యిటకుఁ గడుకొని ప్రీతిన్
జను దెంచినాఁడ నాకృతి
కనూనకీర్తి గలిగించి తమలవిచారా. 156

ఆ. బ్రహ్మసూత్రములను రచియించుటకు నాకుఁ
గలిగినట్టిశ్రమము కంటె వేయి
మడుఁగు లెక్కువగుశ్రమంబు నీ కగు నంచుఁ
దలఁచుచుంటి నోయి తండ్రికాన! 157

వ. నీవు బ్రహ్మసూత్రభాష్యంబు గాక గీతాభాష్యము, నుపనిషద్భాష్యము, సనత్సుజాతీయభాష్యముం జేసి తని వినియుంటి నని వానిం జెప్పించి యన్నియు నాద్యంతంబులుగాఁ బరిశీలించి ప్రోక్తంబు గావించి నీవు మహానుభావుండవు నీ నోటికిం దప్పు రాదు నీభాష్య

ములు కొన్నికొన్నిచోట్ల మూలమునకు మెఱుఁగు పెట్టు నట్లున్న వని పొగడుచుఁ బ్రియాణోన్ముఖుం డగుట యెఱింగి శంకరుండు.

ఉ. చేసితి భాష్యముల్ తెలియఁ జెప్పితి శిష్యుల కెల్ల దుర్మతా
భ్యాసములన్ సడల్చితి మహామునిచంద్రమ! యింక నే నిటన్
జేసెడిదేమి లే దనుచుఁ జెప్పెద దేవరయాజ్ఞ యేమి నా
వ్యాసమహర్షి శంకరునివంకఁ గనుంగొని పల్కె నిగ్గతిన్. 159

మ. కల రద్వైతపరాఙ్ముఖుల్ కుమతరక్షాదక్షులై పెక్కు రా
ఖలులన్ గండడఁగించి కాని కదలం గా ద్వైతి పెక్కేడు లం
దులకుం బట్టెడు బమ్మ నీకెనిమిదేండ్లు న్నీతపశ్శక్తి న
వ్వల నన్నేడులు కల్గె నీపదియు నాపై నాఱు నీకాయు వౌ. 160

చ. అదియును జాల వింకఁ బదియాఱగునే సరిపోవు నవ్వి నీ
కవు నామాటబడిన్ శివాజ్ఞ నిట నీవాలస్యముం జేయ కీ
భువి సంచారము చేయు మంచుఁ ద్రుటిలోఁ బోయెం గనన్ రాక తా
నవలం దోఁపనివాఁడయై నిలిచె నత్యాశ్చర్యమగ్నాత్ముఁడై. 161

వ. అట్లు వ్యాససందర్శనం బైనపదంపడి భగవత్పాదాచార్యుండు శిష్యజనపరివారపరివృతుండై గుర్వాదేశంబున దేశసంచారంబు చేయువాఁడై మునుమున్న కుమారిలభట్టుచే నిజభాష్యంబునకు వార్తికంబు చేయింప నెంచి దక్షిణదేశయాత్రం బొనరింపఁ బ్రయాణం బయ్యె నని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబు జెప్పు మని కథకు నడుగుటయును. 162

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. ద్విజుఁ డీతండు ద్విజేతరుం డితఁడు స్వాత్మీయుం డితం డీతఁ డ
న్యజనుం డంచు విభేదమున్ సలుప కేనాఁడుం బ్రవర్తించుచున్

వృజినం బంటసియట్లు కర్జమును గావించు న్నిజోద్యోగమం
దజితుండై వరసత్యనామబుధుఁ డాహా యంచు నెంచర్ బుధుల్.

ఆ. అరసి యరసి కాని యది యిదియుం జేయఁ
డతఁడు వేరి కైన ననినయేని
చేయఁ డనిన మాట చెప్ప రెప్పుడు గాని
సత్యమూర్తి యతఁడు సత్యమూర్తి. 164

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతం బైన జగద్గురు చరిత్రమునఁ
దృతీయాశ్వాసము
శ్రీశ్రీశ్రీ



శ్రీరస్తు

# జగద్గురుచరిత్రము

( అను )

## శంకరవిజయము



## చతుర్థాశ్వాసము

క. శ్రీలకుఁ దానక మగుచున్
హాళిఁ జనునృసింహదేవరాన్వయమందున్
హేళి యన నొప్పుసత్యా
శ్రీలలితుం డలరుఁ గాక శ్రీహరికరుణన్. 1

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె. నట్లానాఁడు మహాదేవునిచే నాజ్ఞాపితుం డగుకుమారస్వామి భూమిపై నవతరించిన విధంబు చెప్పెద నాకర్ణింపుఁడు. 2

—♦ కుమారస్వామి భూమింబుట్టి ప్రవర్తించుట ♦—

చ. అమరచమూవిభుండు శివునాజ్ఞ శిరంబునఁ దాల్చి పెల్చ న
య్యమరధరాధినాథునకు నంతయుఁ జెప్పియు నుత్కలాంధ్రదే
శములకు నైనసంధినిఁ బ్రశంసకు నెక్కినబ్రాహ్మణాగ్రహా
రమున సుధన్వుఁడన్ తెలుఁగుబ్రాహ్మణమూర్తికిఁబుట్టెఁబుత్రుఁడై.

చ. శ్రుతులుస్మృతుల్పురాణములుసూక్తిముఖంబులుసర్వశాస్త్రముల్
చతురత నేర్చి పేర్చినప్రశస్తయశంబునఁ జెప్ప నొప్పి దు
ర్మతములఁ దూలఁ జేయుచు క్షమాతల మంతయు మెట్టె దక్షుఁడై
ప్రతిభ గణించి మించినప్రభావమునం బచరించెఁ బేర్మినిన్. 4

తే. అప్పుడు చార్వాకమతము బౌద్ధాదిమతము
భూతలంబున సర్వత్ర పూరటిల్లె
వేదములు వేదకర్మముల్ వైదికులను
నరయువాఁ డయి దిగ్విజయంబు చేసె. 5

చ. అతఁడు కుమారిలుండు ఘనుఁ డై కుమతంబులఁ గూల్ప నెంచి త
న్మతము తెఱుంగఁ గోరి యొకమంత్రవిదుం డగుబౌద్ధుచెంగటన్
శ్రుతిరిపు వట్లు వర్తనముఁ జూపుచు నేరిచె బౌద్ధమార్గముల్
హితుఁ డయి వారికిం దనదుహృద్గత మేర్పడ కుండునట్లుగన్. 6

ఆ. ఇట్లు కొంతకాల మేగించునప్పుడు
జినమతస్థులందుఁ జేరి శ్రుతుల
శ్రుతిజనిత్రి దూరఁ జొచ్చిరి విని యతం
డశ్రువులను విడిచె నంతలోన. 7

వ. ప్రతిపక్షులు వానిప్రవర్తనంబునం జేసి మోసకాఁ డని నిశ్చయించి గురున కెఱింగించిన నతండు వీని నీరాత్రి నిద్రించుచుండ సౌధాగ్రంబునుండి క్రిందికిం బడఁ ద్రోయుం డని చెప్పిన వా రట్లు చేసిరి. కాని శ్రుతిప్రమాణం బనునాతండు మృతింపక తూలరాశిం బడినవాఁడుం బలె నిరపాయంబుగ బయటఁ బడి యోటువడక దేశాటనంబు సేయుచు భట్టపాదుం డనుపే ర్వడసి యమరావతీపురీశ్వరుం డగుసుధన్వు నాశ్రయించి తనయభిప్రాయం బెఱింగించి ప్రత్యహంబును బ్రతిపక్షు లైనచార్వాకాదులతో వాదోపవాదంబులు చేయుచుఁ బ్రొద్దులు పుచ్చుచుండె నప్పు డొకనాఁడు. 8

చ. తమతమవాదముల్ పతి సుధన్వునకుం దెలియంగఁ జెప్పి రా
సమయమునం గుమారిలుఁడు క్ష్మాధరశీర్షమునుండి క్రిందిభా
గమునకుఁ గూలి చాక బ్రదుకం గలవానిమతంబు సెల్లు ను
త్తమ మని నిల్పునట్లు వసుధం బొనరింపుము శాసనం బనన్. 9

వ. రాజేంద్రుఁ డౌ నని చార్వాకపండితులం బిలువ నంచి యి ట్లనియె.

మత్త. భట్టపాదుఁడు పల్కుచుండెను బర్వతాగ్రమునుండి యే
ర్పట్టి కూలి మృతింప కుండెద రట్టివారిమతంబె కా
కెట్టివారిమతంబు భూస్థలి నెందు నేనియుఁ గాన రా
నట్టి శాసనముక్ సృజింపుఁ డటంచు న న్నడిగెం జుఁడీ. 11

ఆ. ఏమతంబు శ్రేష్ఠ మేది యశ్రేష్ఠమో
యెఱిఁగి కొనఁగ నాకు నిష్ట మయ్యె
జైనులార! మీరు దీనికిఁ బూనుకొం
డనుచుఁ బలుకుచున్న యవసరమున. 12

ఉ. నా విని భౌద్ధు లొండొరులు నల్గడఁ జూచుచు వెల్లఁ బోయిన
ట్లై వెనుకొంచుఁ జూచుకొనునట్టిర యై రపు డక్కుమారిలుం
డావసుధాస్థలిం గలమహామహిభృచ్ఛిఖరాగ్ర మెక్కి యో
దేవ! ననుం గనుంగొను మిదే పడుచుంటి నటంచుఁ బల్కుచున్.

—♦ కుమారిలుఁడు మేడమీఁదినుండిఁ క్రింది కుఱుకుట ♦—

క. ఓంకారమ్ము పఠించుచు
శంకాతంకములు లేనిస్వాంతమ్మున నా
శంకరభక్తుం డిలకున్
గొంకక కూలంగఁ బడియె గొ ల్లన జనముల్. 14

వ. అట్లు దూదివామిం బడినట్లు పడి కుమారిలుండు నొ వ్వెఱుంగక రాజుకడకు వచ్చి ముచ్చటించుచుండె నప్పు డప్పుడమిఱేఁడు చార్వాకులం బిలిచి. 15

శా. ఓచార్వాకవరేణ్యులార! యిఁక మీయున్నట్టిపాండిత్యమున్
వాచింపం దలపెట్టఁ బోవ కిట నీభట్టారకోద్యన్మతం
బే చెల్వారెడు నంచు నెంచి యిఁక నేవే వేనియుం గాని యీ
భూచక్రంబునఁ జెల్లఁ బో వనుచు నే బోధించుచున్నా, ననెన్. 16

తే. అనిన వా ర్మతసిద్ధాంతమునకు సిద్ధి
సుప్రమాణము గాఁ బోదు క్షోణినాథ!
దేహసంరక్షణమున కీదేశమునను
గలవు మంత్రౌషధములు పెక్కులు తెలియఁగ. 17

శా. నా రాజేంద్రుఁడు రోసి మీవచనముల్ న్యాయార్థముల్ గావు దు
ర్వారోగ్రప్రతికూలవాక్యము లిఁకం బల్కంగఁ బో కుండుఁ డే
నీరాజత్వము పేర్మిఁ బల్కెదను జం డీనాపరీక్షావిధా
నారంభంబున మీరు పాల్గొనుఁడు నే నాపై విచారించెదన్. 18

వ. అని పలికి తత్పరీక్షాఫలితం బోడినవారికి సాముదాయికమరణంబు నిర్ణయించి వేరికిం దెలియకుండ నొక్కకుండలోఁ గృష్ణసర్పంబు పెట్టించి దానిముఖంబు మూసి తెప్పించి సభామధ్యంబునం బెట్టించి యుభయమతంబులవారిం దిలకించి పణం బెఱింగించి యి ట్లనియె.

శా. ఇం దే మున్నది చెప్పుఁ డోమతవివాదేర్ష్యాకులస్వాంతు లం
చుం దెల్లంబుగఁ బల్కనంతటన వించున్ జైనచార్వాకు లో
కుందేందుప్రతిమానకీర్తివిభవా! కుంభంబునం దుండు దా
నిం దెల్పం గల మెల్లిమాకు గడు పీ ని న్నెంతు మెంతేసియున్. 20

వ. అనిన నతం డట్లగుం గాత మని గడు విచ్చె వారు నాజ్ఞ గొని గృహంబులకుం జనిరి భట్టపాదుండును నాఁటిరేయి కంఠదఘ్నం బగుజలంబుల న్నిలిచి పరమేశ్వరుం బ్రార్థించె నంత మఱునాఁడు నేలతేఁడు తొంటివలెఁ గుంభంబుం దెప్పించి సభం బెట్టించి చెప్పుం డనియె నప్పుడు సమంతభద్రమతపండితులు. 21

ఉ. వ్రేళులు లెక్కవేయుచును వ్రేలెడు నిం దొకసర్ప మింక నొం
డేలవమాత్ర ముండ దని యేకముఖంబునఁ జెప్పి రంత భూ
పాలునిదిక్కు మోమగుచు భట్టపదుం డను రాజచంద్ర! ల
క్ష్మీలలనామనోహరుఁడు శేషునిపై శయనించి యుండెడున్. 22

తే. అనుచుఁ జెప్పెడు నంతలో నభ్రవాణి
భట్టపాదులు చెప్పినపగిది శేష
శాయి యుండె ఘటంబున నోయిలాధి
నాథ! యని పల్కె నాశ్చర్యబోధకముగ. 23

సీ, ఆకుండమూఁత రా జప్పుడు విప్పి చూ
చినయంతఁ దోఁచెను శేషశాయి
యపుడు చార్వాకాదికృపణు లందఱు నోడి
పోయి రటంచును బుడమిఁ జాటి
వారి కందఱకును గారాగృహంబున
నామరణము శిక్ష యది విధించి
వారిమతం బెందు వర్తిల్లకుండఁ గాఁ
జేసె రాజాజ్ఞ భాసిల్లఁ జేసి

తే. భట్టుఁ డది విని తనకట్లు బౌద్ధమతము
నొప్పఁ జెప్పినగురువు నం దుంటఁ దెలిసి
దానఁ బాపము తన కట్లు దాఁపరించె
ననుచు నెంతయుఁ జింతించెఁ దనమనమున. 24

వ. విరక్తుండై తనసర్వస్వంబు నుర్వీసురసాత్కృతంబు చేసి ప్రాయశ్చి
త్తంబు చేసికొని ప్రాణంబులు విడనాఁడువాఁడై ప్రయాగరాజంబు
నకుం జనియె నీవృత్తాంతము వారాణసీపురంబున నున్న శంకరుండు
విన్నవాఁడు గావున విన్నఁబోవుచు వానిం జూడఁ బయనంబై కతి
పయప్రయాణంబులఁ బ్రయాగపురంబునకుం జనియె నదియు. 25

—♦ ప్రయాగపురవర్ణనము ♦—

సీ. ప్రవహించు నేయూరిప్రాగుత్తరంబున
భాగీరథీగంగ భాగ్యసంగ

భాసిల్లు నేపురి ప్రాగ్దిక్కునఁ ద్రివేణి
సంగమ మ్మతి పుణ్యసంగమమ్ము
తనరు నేప్రోలిదక్కిణమునఁ ద న్నంటి
మడియఁ గోర్కుల నిచ్చుమఱ్ఱిచెట్టు
మానొందు నేపీఠిమధ్యంబునన్ మాధ
వేశ్వరుండు మహేశ్వరేశ్వరుండు
తే. అట్టిపరమోన్నతస్థాన మంది జగతి
నెల్లతీర్థములందు సర్వేడ్య మగుచుఁ
దీర్థరాజము నాఁ బడి తేజరిల్లు
యాగసుఫలప్రదమ్ము ప్రయాగపురము. 26

వ. అట్టిప్రయాగరాజము లోచనగోచరం బయినంత శంకరుండు గంగా యమునాసంగమప్రాంతప్రదేశంబునకుం జని కలయఁ బరికించి ప్రవాహవేగసంజనితశబ్దంబు విని తన మనంబున. 27

చ. ఎలమిఁ బురాణదంపతులు లొకించుక మించిన వేడ్కఁ బూలసౌ
తలిమమునం ది ట్టులయి తారు శయించి మనోహరార్భటుల్
సలుపుచు నుందురో యనఁగ సైకతభూస్థలి నీత్రివేణి తా
గలగలలాడుచుం బఱవఁ గల్గు సరస్వతి లోఁ నడంగఁగన్. 28

క. వేణీదానము చేసిన
యేణాక్షుల కీర్తివేణి యేనాఁటికి నే
క్షోణిన్ వైధవ్యము ద
ప్రాణ రానీక ప్రోచుఁ దాత్పర్యమునన్. 29

వ. అని ప్రశంసించుచు లోనికిం జని యఘమర్షణస్నానంబు గావించి నిర్వర్తితనిత్యకృత్యుండై తీరంబునందలితమాలవృక్షచ్ఛాయం గూరుచుండి కల్హారశీతలవాతపోతంబు సేవించుచు విశ్రాంతిం బడయుచుండె నాసమయంబున. 30

—• శంకరుఁడు తుషాగ్నిలో నున్న కుమారుని జూచుట •—

చ. ఘనుఁడు కుమారిలుం డట నొకానొకచోటఁ దుషాగ్నిఁ జొచ్చె నం
చని జనులాడుకో విని రయంబునఁ జట్టులతోడ లేచి నె
మ్మనమున సంతపించుచుఁ గ్రమం బఱి కాళుల దాట్లు వేయుచుం
జని కనియెం గుమారిలుఁ దుషజ్వలనంబున నున్నవానినిన్. 31

క. ఆర కాలినట్టి మేనునఁ
బరిపరిగతులం దపించుపండితవర్యున్
బరికించి పరివ్రా ట్టగు
పరశివుఁడును గంట నీరు వ ఱ్ఱగుచుండన్. 32

ఆ. ఓయి భట్టపాద! యోయి కుమారిల!
నేను వచ్చినాఁడ నిన్నుఁ జూడ
శంకరుండ నాదుజాడఁ గనుంగొనఁ
గన్ను విప్పు మన్నఁ గాంచి యతఁడు. 33

తే. ఎట్టకేలకు చేయెత్తి యేటికొళ్ళు
సలిపి ధన్యుఁడ నైతి నోసంయమీంద్ర!
నీదుదర్శన మొనరింప నేఁ దలంతుఁ
గాని కా దయ్యె స్వాస్థ్యము గలిగినపుడు. 34

సీ. విన్నవించెద నాది వేదశాస్త్రంబులు
చదివితి వైదికాచారనిరతిఁ
గర్మకాండమునకుఁ గతి గలిగించితిఁ
దంత్రవార్త్తికముఖోత్తమకృతులను
వెలయించితిని మతద్వేషు లౌవారినిఁ
గట్టితిఁ బేరోలగములయందు
వేదమార్గరిరక్ష వెదకి వెదకి యెల్ల
నాస్తికులపరిభావ మడఁచినాఁడ

తే. జనికిఁ జేయంగ నగునట్టిపనుల నెల్లఁ
జేసినాఁడ మతముపిచ్చిఁ జేయ రాని
పనులు చేసితిఁ బాపము వాపుపొంటె
నిష్కృతిఁ బొనర్చుచుంటి నీనెఱి వశించ్రి ! 35

తే. అనుడు వైదికధర్మరక్షార్థ మీవు
చేసినవి ఖలక్రియ లని చెప్ప రాదు
వాని కింత నిష్కృతి చెప్పునే నిగమము
చాలు నీమాత్రి లేచి ర మ్మేల యిట్లు. 36

ఉ. నాదుక మండలూదక మునన్ బ్రదికించెద ని న్నొకింతలోఁ
గాదన కీచితాగ్నిఁ బడి కాలి మృతించెదుచింత మాని యో
భూదయితప్రియా ! బ్రదుక బుద్ధి యొనర్పుము సూత్రభాష్యమ
ర్యాదను నిల్పువాఁడ వయి వ్రాయుము వార్త్తిక మీవు దానికిన్.37

ఆ. భట్టపాదుఁ డనియె నిట్టు లేఁ దలఁచితిఁ
గాని సాఁగదయ్యె మానిచంద్రి !
నాకు సెల వొసంగు మీకుతలంబునఁ
గలదు కర్జమెంతొ గాని నీకు. 38

శా. ఉంబేకుం డన విశ్వరూపుఁ డనఁగా నొప్పారు నాశిష్యరూ
పంబుం గాంచినమండనుం డతని కుంబానామస్త్రీరత్న మా
యంబన్ భారతి యంద్రు నీ విపు డొకం డౌవానినిం గెల్చి తే
సంబాళించినవాఁడ వౌదువు సమస్తంబున్ యతీంద్రోత్తమా ! 39

వ. అని చెప్పి నీవు విశ్వనాథుండవు నాకుఁ దారకం బుపదేశింపు మని కన్నుమూసి ప్రాణాయామంబు వట్టి శంకరముఖోదితతారకంబు వినుచుఁ బ్రాణంబులు వాసి బ్రహ్మసాయుజ్యంబు నొందె నంత శంకరస్వామి సహశిష్యుండై నభోమార్గంబున నిర్గమించి మండన

మిశ్రినిమాహిష్మతీపురంబునకు నంటియున్న ప్రమదావనంబునం
డిగి యించుక విశ్రమించినపదంపడి పురమార్గంబు వట్టి చనుచు. 40

—♦ శంకరుఁడు మండనమిశ్రినివీటి కరుగుట ♦—

చ. అలరిచి సూత్రపట్టినటు లారయ వచ్చెడు సోమసూర్యవీ
థుల నిరువంకలన్ మణులతో మఱి మేల్మిసువర్ణకోటితోఁ
గలుముల నీనుజాతిఫలకంబులతో నొనరింప నొప్పుమే
డలు బలుమాడుగుల్ గన నెడందకు సంతస మావహిల్లెడిన్. 41

మ. సకలాభ్రంకషనాళికేరమహిరుడ్జాలాతిథేయు ల్వ్యలో
లకమార్గశ్రమ ఖిన్నుఁడై కుతపకాలంబందు నిచ్చ ల్నిజాం
తికముం జేరినభాస్కరాతిథిని నెత్తిం బూని యాతిథ్య మా
ప్రకటస్వాదుఫలోదకం బొసఁగి పత్రస్పర్శముం జేసెడిన్. 42

తే. గోపురము నాఁపునాపురగోపురములఁ
జెలఁగుసౌవర్ణసాలభంజికలు ప్రోలి
మేలుసింగారమును జూచి మేను మఱచి
మాఁనుపడియున్న యచ్చరచాన లనఁగ. 43

మ. పౌనరన్ రాజనముల్ పయస్సులను నెప్డుం బెంచునయ్యేళులం
దనిశక్రీడలు సల్పుస్త్రీలకు నొడళ్ళం దానుగంధంబు పేఁ
గి నదీతోయములందుఁ గల్వలకు నాఁగెం గాన సౌగంధికా
ర్చను బెంపొందెను గల్వ లట్టు లగు సత్సాంగత్య మెవ్వారికిన్. 44

శా. బ్రహ్మణ్యు ల్బహుశూరు లక్షయధనుల్ పాలించద్ధల శ్రీయుతుల్
బ్రహ్మన్ భార్గవు నర్థనాథు బలినిన్ బాటింప కర్థిం బర
బ్రహ్మం బెంచి శరంబు లూని కృతులన్ వర్ధించి పై ర్వాట్టి యా
బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర జనముల్ భాసిల్లుచుం డిప్పురిన్.

వ. ఇట్లు మహోన్నతవైభవంబున వెలయుమాహిష్మతీ పురంబునం
జనునాశంకరాదులకు జలకుంభంబులం గొని యమునాస్రవంతికిం

జనునిరువురు మండపరిచారిక లెదురుపడి శంకరుం గాంచి నిర్వేరం పడుచుఁ దమలోన.

—• మండనుని పరిచారికలు శంకరుని జూచుట •—

సీ. బంగారుబొమ్మ కీపసిబాలునకు హెచ్చు
కుందులు చెప్ప నే రుందురు ధర
నచ్చు వోసినయట్టు లవయవంబులు వీని
యొయ్యారమున కెంతొ హొయలు గూర్చుఁ
జిత్రిపరిభావుఁ డీచిన్నారిబాలుని
పలుకులు చిలుకలఁ బాఱఁ దోలు
ఖంజరీటంబులఁ గా దనుకంటిచూఁ
పులచా లఖిలజగన్మోహనంబు.
తే. వీనిచేతులు కాళులు వేష మనెడు
భ్రాంతి గలిగించుఁ గాషాయవస్త్ర మేమొ?
నెఱికురులు లేక యుండెడునెఱి యి దేమొ?
చిత్రిచిత్రిపరిభావుఁ డీచిన్నివాఁడు. 47

వ. అని పలుకుకొనుచుం దరినుండి పోవువారిం గని శంకరుండు మండన మిశ్రిలమందిరం బెందున్నదని యడుగుటయు వారువారి నెఱింగి. 48

శా. స్వామీ! యొక్కసుమంతదూరమున సాక్షాద్విశ్వసృఙ్మూర్తి నా
భూమిం బేర్వడినట్టిమండనుని పెంపుం దెల్పుప్రాసాద మా
నామోసాలను వేదశాస్త్రముల నొయ్యం బల్కుకీరంబుల
గోముం గూర్చెడుపంజరంబు లగు నో గోవిందపాదోద్భవా. 49

* సన్యాసము రెండవజన్మము, దానింగల్గించినవాఁడు గోవిందపాదుఁడు గావున గోవిందపాదోద్భవుఁడని ప్రయోగింపఁబడియె.

తే. అయ్యది హజార మద్దాని నాశ్రయించి
వజ్రసారమయం బయి వప్ర మొప్ప
దాని భేదించుకొని వేఱుగాని లోని
కరుగఁ జాలరు దానిమధ్యంబునందు. 50

సీ. తగుపచ్చరాకట్టు మగఱాలగోడలు
నీలాలపని నెలఱాల మెట్లు
నపరండి నెడఁ గూర్చు నద్దాలకిటికీలు
పటికంపు నునుద్వారబంధములును
దమ్మికెంపులఁ జెక్కు తలుపులు వైదూర్య
ములఁ జిల్గుపనిగల వలభితతులు
పసిగల పనడంబు వట్రువకంబముల్
మేలిమి జాలువా దూలములును

తే. మఱియుఁ జిత్రవిచిత్రముల్ మలయుపనులు
గలిగి కన్నులపండువై కనుఁగొనంగ
నొగి హరాం రంగలరారెడు నొక్కదివ్య
భవనము దలిర్చు నోహూనివల్లభుండ. 51

శా. ఆప్రాసాదము నై జయంతము నిహీ యంచున్ హసింపంగ నై
విప్రశ్రేష్ఠనివాసభాసురము నై వేదారవాక్రాంత మై
సుప్రారంభసమంచితం బయి జగత్స్తోత్రాతిపాత్రంబు నై
నప్రాంతర్గత మై ప్రకాశిలెడు శ్రీపద్మాలయాస్థాన మై. 52

తే. అందు మండనుఁ డుండు వేదాధ్యయనము
చేసి చేయించుచును భారతీసతీస
మేతుఁ డై నేఁడు పైతృక మై తనరుట
మూయఁ బడియుండెడు హజార మోయతీంద్ర. 53

—♦ శంకరుఁడు మండనుం గలసి సంభాషించుట ♦—

వ. అని వారు వారిదారిం బోయి రంత శంకరుండు నంతేవాసుల నం
తలపొంతల నుండం జెప్పి తా నంతర్హితుం డై యోగశక్తిం జేసి
మీఁది కెగిరి గృహప్రాంగణంబునం డిగి నిజరూపంబున నల్లనల్ల
నడుగు లిడుచు లోనికిం బ్రవేశించునంత లోన. 54

తే. భోక్తలగు వ్యాసజైమినిమునుల కర్చ
సలుపుచుం బితృకార్యము వలన నున్న
మండనుం డట్లు దండకమండలువులఁ
దాల్చి చనుదెంచు ముండినిం జెల్చఁ జూచి. 55

ఆ. ప్రళయకాలరుద్రుపగిది మండుచుఁ బరి
వ్రాట్టుఁ జూడనట్టివ్రతము సతము
గలుగునట్టివాఁడు గాన నడుమఁ ద్రుణ
మడ్డు పెట్టి వాని కనియె నిట్లు. 56

శా. ముండీ! యెవ్వఁడ వీవు లోపలికి నేమోసంబున న్వచ్చితో
ముండిం జూడనివాఁడ నాకు వ్రత మీపోల్కిం బ్రవర్తిల్లు నీ
బండాట ల్గన వచ్చె ముప్పు వలె నీపక్కిం బ్రవేశించి నా
దండ న్నిల్చితి నిన్నుఁ బట్టి చెఱ బంధంబుం బొనర్పంగ నౌ. 57

తే. పైతృకాదు లొనర్చెడుపట్ల వేద
మాతృకఁ ద్యజించినట్టి దుర్మానవుండు
కాన వచ్చినయేఁ బైతృకం బ దెల్లఁ
జెడిన య ట్లని తలపోయఁ జెల్లుఁ గాదె. 58

శా. అకటా! వేదసమాహితంబులు జటాయజ్ఞోపవీతంబు లే
టికి నీ విట్లు పరిత్యజించితివి పాటిం పేల లేకుండెఁ గుం
డికయుం దండము కంథ మోయఁ గల వట్టే దుష్టబుద్ధీ! నిను న్
వికలస్వాంతునిఁ గర్మహీను నెద భావింపం దగు శ్రోత్రియుల్. 59

వ. అనుడు శంకరస్వామి యి ట్లనియె. 60

మ. అణిమాద్యష్టవిశిష్టసిద్ధులు ననుం బ్రార్థించె నే నందునన్
క్షణమాత్రంబున నింగిత్రోవ నిటకున్ రా నైతి నడ్డంకి తే
కణమాత్రంబును మోస చేసి ముఖశాలాపాలురన్ వొంగనై
తృణమేనిం గొని పోవ రా ననుచు నాది న్నేను వాక్రుచ్చెదన్. 61

మ. శ్రుతివాకే కద బ్రాహ్మణత్వగతికై శోభించు యజ్ఞోపవీ
తత యంచున్ వచియించు నట్టిశ్రుతియే తత్త్వంబు బోధించుచుం
బ్రతిపాదించును ద్యాగ మట్టియెడ విద్వద్వర్యులై నట్టినీ
వతి నీచోక్తులు పల్కి మస్కరుల ని ట్లాడంగ నా నట్టిదే. 62

—♦ శంకరులు పైతృకకార్యభోక్తయగుట ♦—

ఉ. పైతృకకార్యమం దొకవిపశ్చితు మస్కరి నర్చ సేయుటల్
పూతమహాధ్వరంబునకుఁ బోలు నటందురు విజ్ఞు లిట్టిచో
నాతనిఁ జూడ రాదనుమహావ్రత మూనితి నే నటందు వో
ఖ్యాతకృతీ! నినుం బలుకునట్టిదియే వ్రతి యంచు నక్కటా. 63

చ. అద నగుఁ గానఁ జెప్పెద మహాద్విజ! నేను సమస్తశాస్త్రముల్
సదమలముల్ శ్రుతిస్మృతు లసంఖ్యము లైనకళల్ కవిత్వముం
జదివితి సిద్ధు లన్నియు సుసాధ్యము లయ్యెను వాదుఁ గోరి నే
నిదె చనుదెంచినాఁడ నిపు డే మనె దీవు జితోస్మి యందువే. 64

వ. అనుటయు. 65

ఉ. ఆజ్యము వేల్వఁ బ్రజ్వరిలునగ్ని తెఱంగున మండి మండనుం
♦ డిజ్య యొనర్చినట్టిఁడను నే వెనుకంజను వేయువాఁడ నే
రాజ్యము వోయిన న్మఱియుఁ బ్రాణము వోయినఁ బోవుఁ గాని నా
ప్రాజ్యమహావ్రతంబు విడువాఁడనె నేను జితోస్మి యందునే. 66

♦ ఇజ్య = పూజ, యజ్ఞము.

ఆ. ♦ వేదమందు శాస్త్రవిధులందు శ్రౌతము
నందు స్మార్తమందు నెందు నేని
వా నొనర్చి నన్ను వాచంయమునిఁ జేయు
మిదె ప్రతిజ్ఞయనుచు హృది స్పృశించె. 67

ఆ. అనుడు బళిరె మండనా! యోడితే నీవు
సన్యసించి నాకు ఛాత్రుఁ డగుదు
నేన యోడినట్లు లేని నీశిష్యుఁడ
నగుచు యతిత వీడి నట్టిఁ డగుదు. 68

వ. అని పణంబు చఱచి వాదంబు సేయ నిశ్చయించుకొని యున్నపదం
పడి వ్యాసజైమినులు శంకరు నెఱుంగనివారిచందంబున నటించుచు
మండనుదిక్కు మొగం బై. 69

ఉ. నీవు సమస్తధర్మములు నేర్చినవాఁడవు నీకుఁ జెప్పఁగా
నేవియు లే వ బైన నొకయించుక మేము వచింతు మిత్తఱిన్.
నీ వది యాలకించి మది కెక్కినచక్కిఁ బొనర్ప నుండు మో
దేవసమప్రభావ! భవదీయనుతవ్రత మట్టు లుండినన్. 70

ఆ. పైతృకంబు నడచుపట్ల ననాహూతుఁ
డగుచుఁ బారికాంక్షి యరుగుఁదెంచె
నేని కా దటంచు వానిని విడనాఁడఁ
జనదటంచుఁ బలుకు శాస్త్రవిధులు. 71

మ. యతి నర్చించి పితాళ్ళ కాబ్దికతిథిన్ హవ్యంబు నొల్కవ్యమున్
ప్రతిపాదించినచో బృహస్పతినవ ప్రఖ్యంబ యై పైతృకం
బతిపాత్రం బగుఁ గాన నీ వితని నిష్టర్చించి విష్ణుస్థల
స్థితుగాఁ జేసి యజింపు మవ్వల భవచ్చిత్తానుసారం బగున్. 72

♦ వాచంయముఁడు = మౌనముగలవాఁడు, సన్యాసి, ప్రతిజ్ఞచేసి పలికినప్పుడు హృదయముపైఁ జేయి చేయుంట దేశాచారము.

వ. అనిన వారిమాట కొండాడ నోడి యతం డాతని నర్చించి విష్ణు స్థానంబునం గూరుచుండం బెట్టి పితృకార్యంబు నిర్వహిల్లం జేసె మఱునాఁడు వ్యాసాదు లెందఱో సభాసదులై సమీక్షించుచుండ నుభయభారతి సర్వసభ్యసమ్మతంబున నధ్యక్షపీఠంబునం దధివసించె నప్పుడు. 73

ఉ. మండనమిశ్ర శంకరులు మాన్యులపంపున నున్నతంబులై
యుండెడు నాసనంబుల సముత్సుకత న్నివసించి రంతలో
రెండు లతాంతమాలికలు రీతులఁ దెల్పుచుఁ దెచ్చి వాక్కు వా
గ్ఖండన మాచరించుటకు వర్తిలు వారికి వైచి యి ట్లనున్. 74

—♦ శంకరులు మండనునితో శాస్త్రవాదము చేయుట ♦—

క. ఓడినపురుషునిమాలిక
వాడును బ్రత్యక్ష మిద్ది వర్తింప నిటుల్
గూడంగఁ జేసి యుంటిని
వీడక వాదింపుఁ డింక విజ్ఞవరేణ్యుల్. 75

వ. అని యనుజ్ఞ యొసంగినంత విద్యామండనుం డగుమండనుండు కర్మకాండ ముత్తమ మని వేదవేదాంగనిదర్శనంబుల సభాసదులా నన నుపన్యసించె నంత శంకరుండు జ్ఞానకాండం బుత్తమోత్తమం బని వేదవేదాంగంబులను సూత్రత్రయభాష్యంబులను మఱియు ననేకప్రమాణంబుల నుపన్యసించె నిట్లు ప్రతిదినంబును మండన ఖండన మండనంబులతో వాదోపవాదంబు *లొక్కమండలకాలంబు ప్రవర్తిల్లె నంతలోన. 76

తే. మండనునికంఠమున వ్రేలుమాల యించు
కంత వాడిన జాడ కన్నారఁ జూడఁ

---

* మండలకాలము = 40 దినములకాలము.

గానవచ్చుట తెలిసి విజ్ఞానమూర్తి
యగుట సభ్యులకుం దెల్పునట్టి దగుచు. 77

తరళము. ఉభయభారతి స్వాధినాథునియోటమిన్ వచియించి యో
సభికులార ! సగంబు దేహము సాల్వెడ న్మతి యున్న సా
మభిముఖంబున నుండ దానిని నట్లు గెల్చినఁ గాని గె
ల్పభినుతింపఁగ రా దలంచు మహాస్మృతు ల్వచియించెడిన్. 78

వ. కావున నర్ధాంగి నగునన్నుఁ గూడ గెల్చినం గాని సంపూర్ణ
జయంబు గలుగ నేర దనిన నెల్లవారు నౌ నౌ నుభయభారతీవచ
నంబు సమీచీనం బనిన శంకరుం డించుకసంశయించుచు. 79

శా. స్త్రీతోఁ బూరుషుఁ డెట్టిపట్టునను వాదింపంగ రా దండునన్
జేతోమోదము గాని హేతువు ల వెన్నేఁ గల్గెందుం గావునన్
నాతోఁ బుట్టువుఁ బోలినట్టిదయినన్ వాదోపవాదంబు లీ
పూతాబ్జాననతోఁ బొనర్చుటకు నామోదంబు లే కుండెడిన్. 80

తే. అన సభాసదు లైనవ్యాసాదు లతని
కనిరి నీగెల్పు సామయ్యో నవలిసాము
గెలువ కుండిన బూర్ణమై యలరఁ బోదు
కాన వాదించు టొప్పు నీగరితతోడ. 81

తే. మును మహారాజుసభ గార్గి యను నెలంత
యాజ్ఞవల్క్యునితో వాద మాచరించె
దాని కౌ నని రందఱు కాని కాదు
కూడ దని యెవ్వరును బల్క నోడి రపుడు. 82

—• శంకరుఁడు భారతితో వాదించుట •—

వ. కావున నీవు పూర్ణవిజయ మపేక్షించితేని యీమెతోఁ గూడ
శాస్త్రవాదంబు గావింపు మని వ్యాసాదులు తెఱేమి చెప్పిన నొప్పి.
శంకరుం డమ్మహాదేవితో ననేకశాస్త్రంబుల నతిఘోరవాదంబు

గావించియుం గట్టకడపటం గళాశాస్త్రంబునందును ననేకప్రశ్నంబు
లకు సమాధానంబు చెప్పుచు వచ్చిన నప్పతివ్రతాశిరోమణి శంక
రునిపాదపద్మంబుల కభివందనంబు గావించి. 83

ఉ. ఓయతిసార్వభౌమ ! విను మొక్కదినంబున నేను గన్నెనై
మాయమచెంత నున్నతఱి మాకడ కొక్కమునీంద్రుఁ డేగుదే
నాయన జోసి యంచుఁ దెలియ న్విని నాదగుజన్మపత్రికన్
బాయనివేడ్కనిచ్చి ఫలభాగములన్ వచియింప వేఁడుదున్. 84

ఆ. ఈమె భాషవోలె నెల్లవిద్యలు నేర్చి
విశ్వసృట్టుఁ బోనివిభునిఁ బొందు
సుతులఁ గాంచుఁ బతికి హితముఁ గూర్చుచునుండు
జాతవేదుఁ గొలుచు జన్మములను. 85

మ. పదిరెండేడులబాలయోగి యొకఁ డీబాలామణీభర్తతోఁ
జదురుండై యెదిరించి వేదముల శాస్త్రాలందు నోడించు వా
దోదవం చేయుచు నీమె గూడ నపుడ ట్లోడుం గళావిద్యలం
దుదియా నద్ది యసెం దదుక్తి నిజమై తోఁచంగ వచ్చెం బ్రభూ.86

ఆ. ఓడె నామగండు నోడితి నేను నో
యతివరేణ్య ! నేను బ్రాణనాథుఁ
జేరుకొందు ననుచుఁ జేసెఁ బ్రాయోపవే
శము సమస్తసుజనసమ్మతముగ. 87

వ. అప్పుడు శంకరుం డత్యాశ్చర్య మన్నాంతరంగుం డై చే యెత్తి
మొక్కుచు. 88

శా. దూర్వాసోయునిశాపకారణమునన్ దోడ్తోడ నీభూమికిన్
సర్వారంభము లేర్పడం దిగియె భాషాదేవి భారత్యభి
ఖ్యార్వాచీనపదంబు చేకొనుచు విద్యాస్థానమై మే ల్పురే!
శర్వాం శైనను సంస్మరింపఁ దగు నీసర్వజ్ఞచింతామణిన్. 89

వ. అని మఱియు ననేకవిధంబులఁ బ్రశంసించుచున్నంత భారతి
ప్రాయోపవేశంబు చేయుటకు మునుమున్న. 90

శా. ఆపదో్ద్భవపావనాంశభవ్యుఁడై హార్వ్యాంచుమిశ్రుండు పా్రి
జాపత్యేష్టి నొనర్చి పాత్రిముల నాజాజ్వల్యమానాగ్నిలోఁ
బ్రా పొందం బచరించి వానిఁ దనలోఁ బ్రాలంబముం బొంద నా
రోపింపం బొనరించుకోఁ గలిగె శత్రుల్మిత్రులై పోవఁగన్. 91

తే. అపుడు శంకరుఁ డామండనాఖ్యుఁ జేరఁ
దీసి సన్న్యాసధర్మముల్ తెలియఁ జేసి
తత్త్వమసిసూక్తి శ్రవణరంధ్రమ్మునఁ బడ
సలిపి పేరిడియెన్ సురేశ్వరుఁ డనంగ. 92

—• శంకరులు మండనునకు సన్న్యాసాశ్రమమిచ్చుట •—

సీ. కాషాయశాటియుఁ గౌపీనము నొసంగి
దండకమండలుల్ దాల్పఁ జేసి
బ్రహ్మసూత్రము కేశబంధమ్ము మునుమున్నె
సాఁగించె మంత్రవిసర్జనంబు
ముంజమయం బగుమొలత్రాడు సడలించి
యట వస్త్రఖండము సమరఁ జేసి
దక్షిణతర్జనిం దగిలించి కుశపవి
త్రము కాళ్ళఁ బావకో ళ్ళమరఁ జేసి

తే. ముసుగుగా నెత్తిఁ గావినిఁ బొసఁగఁ జేసి
మెడను మదురక్కపే రొండు మెదలఁ జేసి
నడువఁ గూర్చున్న నారాయణస్మరణము
గలుగు నట్లుగఁ జేసె నాత్మాసురునకు. 93

వ. ఇట్లు మండనమిశ్రునకు సన్న్యాసం బొసంగి పిమ్మట శిష్యులలో
శిష్యునిగాఁ జేసికొని మఱియుం గలదుర్మదాంధులఁ దూలించు

వాఁడై దక్షిణదిశాభిముఖుండై చనియె సురేశ్వరుండును దనసర్వ స్వంబు కొడుకులకుం బంచి యిచ్చి శంకరు ననుసరించి పరిభ్రమించుచు వానితోఁ గతిపయప్రయాణంబుల శ్రీశైలంబునకుం జనియె నదియును. 94

సీ. ఇంపొందు నేగిరి కీశాన్యమునయందుఁ
దాతాళగంగ శుంభత్తరంగ
రాజిల్లు నేగిరిప్రాగ్భాగమున శిఖ
రేశ్వరమ్ము మహామహేశ్వరమ్ము
పాఱు నేగిరిఁ బెద్ద పాషాణమునయందుఁ
♦ బాలధారయు లసత్పంచధార
చెన్నొందు నేగిరిశిఖరంబునన్ మల్లి
కార్జునలింగ *మయానుషంగ

తే. అచ్చటికిఁ బశ్చిమంబునయందుఁ బైడి
పూతలం బొల్చు దేవళంబునను దేవ
దేవి భ్రమరాంబికాదేవి తేజరిల్లు
వఱలు నది మెచ్చనగుచు శ్రీపర్వతంబు. 95

—♦ శంకరులు శ్రీశైలంబునకరుగుట ♦—

శా. శ్రీశైలం బది క్షేత్రరాజము శుభశ్రీదానపాత్రం బొకం
డాశైలాగ్రముఁ జూచినంతటన మోక్షావాప్తి యౌ నంచు నా
నాశాస్త్రంబులు వేదముల్ దెలుపు జన్మం బెత్తి తా నుంటకున్
శ్రీశైలేశుని దర్శనంబె ఫలమై చెప్పం దగున్ దేహికిన్. 96

శా. జ్యోతిర్లింగము లాఱు నాఱుఁ గల పీఠోర్వీస్థలి న్వానిలో
ఖ్యాతిం గాంచెను మల్లికార్జునవిరూపాక్షుండు ప్రత్యక్షమై

♦ పాలధార = తాతిపగుళ్ళనుండి స్రవించుజలధారలు, *అయము = శుభావహవిధి.

ప్రీతిన్ భక్తులఁ బ్రోచుచుండు నట గౌరీదేవి శక్తి స్వరూ
పాతీతప్రతిభావిశేషగరిమన్ హర్షొందు చెల్లప్పుడున్. 97

తే. శిఖరదర్శనమాత్ర నీక్షేత్రమందు
ముక్తి లభియించు నని శాస్త్రములు వచించు
నట్టిశ్రీశైలదేవు సమర్చనంబు
వలన ఫల మింత యని చెప్పఁ గలరె ఘనులు. 98

సీ. పడమటికొండలపరిసరంబున నైన
సహ్యాద్రిపైఁ బుట్టి ఖ్యాతలమునఁ
బ్రాఙ్ముఖంబును బెట్టి ప్రవహించుఁ బుప్పగి
ర్యాదుల దాఁటి యాంధ్రావనిఁ బడి
జోగుళాంబాపార్శ్వభాగంబునం దుండి
సంగమేశ్వరదేవు సంగతి గొని
కొంతలో నొకకొండగుహ బడి పాతాళ
గంగ నాఁ జే రంది పొంగి పొరలి

తే. శ్రీగిరీంద్రము ప్రక్కకుఁ జేరి చంద్ర
గుప్తపత్తనవరణంబు గుప్తి కగుచుఁ
జుట్టి పాఱెడు నీయేఱు చూడఁ జూడఁ
గృష్ణవేణి యటంచు గీర్తింపఁ బడుచు. 99

వ. మల్లికార్జునదేవళంబునుండి లింగాలఘట్టంబునకుం బోవు మార్గం
బునం గలపర్వతంబున నొక్కబిలంబు లోచనగోచరం బగుచుండు.

తరువోజ. వినుఁ డది నరసింహబిల మందు నృహరి
వెలుఁగొందుచుండు నాబిలమున నుండి
తన రెండుపాయలు గా సూక్ష్మమార్గ
కలితమై చోర నైతి శాకుండు నవలఁ

గన వచ్చు సువిశాలగహ్వరి వెల్గు
గాలియు నారంగ కదళీవనములు
మును లందు నాశ్రిమములు గట్టుకొని త
పోనిష్ఠ నుందు రేబూమె లెఱుఁగక. 101

శా. ఆలో నొక్కనృసింహదేవళము తత్ప్రాంతంబునం జెర్వునుం
బోలం దోఁచెడుఁ దజ్జలం బమృతమై పోఁ దోలు రోగాళిఁ ద
చ్ఛైలం గాంచినవాఁడు స్వర్గసుఖముల్ సీ యంచు భాషించు రే
లీలో నుండినవారికి న్వినఁగ నా నెంతేని శంఖధ్వనుల్. 102

వ. అట్లు ప్రసిద్ధిం గాంచిన శ్రీశైలంబునందుఁ గొన్నినాళ్ళు శంకరుండు తన భాష్యం బెల్లరకుం దెల్లంబు గావించుచు మతద్వేషు లగు బౌద్ధ చార్వాక పాశుపత శైవ వైష్ణవ మతంబులవారి వేదశాస్త్రి దులం జేసి యోడించుచు స్వమతంబునం దెందఱనో చేర్చుకొనుచు వారిం దనవారిఁ గా నాదరించుచు విశ్రాంతి నొందుచుండె నాలో నొకనాఁడు, 103

— చార్వాకుఁడు శిష్యుఁడై స్వామి నాశ్రియించుట —

తే. బ్రిహ్మవేషము వేసినవాఁడు మూఁడు
పదులయేడులయీడునఁ బరఁగువాఁడు
బ్రిహ్మచర్యవ్రతంబును బట్టినతఁడు
విద్య నర్థింపఁ గా వచ్చె వెదకి కొనుచు. 104

ఉ. వచ్చినవాఁడు వచ్చినటు వారిని వీరినిఁ జూడఁ బోవ శా
సచ్చరితున్ సువర్చసుని శంకరమూర్తినిఁ జూచి మ్రొక్కి నే
వచ్చితి మీకడం జదువ బ్రాహ్మణపుత్రుఁడ బ్రహ్మచారి మీ
రిచ్చపొనర్చి ఛాత్రునిఁగ నేల్కొన నే నిదె మ్రొక్కెదన్ గురూ.

ఉ. పుష్కలమైనవిత్తమును బోహణ సేయఁగఁ జాలఁ గాని నే
నిష్కపటస్వభావమున నీకు సపర్య లొనర్చెద రేబవ ల్సదా

శుష్కవచఃప్రసంగముల సోద్దెము సూపెడువారిపట్ల నే
నిష్కరుణ న్మెలంగెద ననేకవిపత్తులు వచ్చె నేనియున్. 106

తే. చదువు గురుసేవ స్నానము సంధ్య జపము
కాక మఱియొక్కఁ డెద్దియు నాకుఁ బ్రాతి
కావు మీశిష్యగణములోఁ గాదు నాకు
స్థాన మని చెప్పుచుంటి నోసంయమీంద్ర. 107

క. నావుడు గురుఁ డిట్లను నే
నీవాఁడన నీకు విద్య నేర్పెద నీపై
నేవార లేమి చెప్పిన
నీవర్తన మెఱిఁగి నేను నీకుం గూర్తున్. 108

వ. అని వాని నంతేవాసిగ నంగీకరించె నంతలో ఛాత్రు లేకాంతంబున దేశికోత్తముం జేర వచ్చి. 109

ఉ. నూతనశిష్యుపైఁ గరుణ నూల్కొనఁ జేసినయట్లు వింటి మో
పూతచరిత్ర ! మీ కెదురుపుంతలు సూపెడువార మేము గా
మాతఁడు బ్రాహ్మణుం డనుట లవ్వలఁ బెట్టెఁడు విద్య నేర్చెనోఁ
జేతము చేసి నాఁ డనుచు శిష్యుఁ డటంచును విశ్వసింతురే ? 110

తే. వీఁడు కాపాలికుం డని వీని మేము
కొంత కొంత యెఱుంగుదు మింతవాఁ డి
కెంత లెంతలు చేయునో యెవరి కెఱుక
వీనిపై నొక్కకను వేసి యే నిల నగు. 111

తే. అనుడు మీ రెప్పు డిట్టులే యనుచు నుండ్రు
కుజనసజ్జనభేదము కొంచె మేని
మీకుఁ దెలిసినయట్లు గా నాకుఁ దోఁచ
దతఁడు గురుభక్తి గలిగినయట్టివాఁడు. 112

—◆ చార్వాకుని శుశ్రూష ◆—

వ. మీరు వానిజోలి తలపెట్టకుఁడు వానితో నిష్టమైన మాటలాడుఁ డనిష్టమైన మానముద్రవహింపుఁ డని ప్రత్యాఖ్యానంబు గావించె నంత నానూతనాంతేవాసి. 113

సీ. వేఁగుచుక్క జనించులోఁగనే మేల్కాంచి
కాల్యకృత్యంబులు గా నొనర్చి
గురువరునకు మేలుకొలుపులు పాడుచు
వలసినపనులెల్ల వెలయఁ జేసి
స్నానసంధ్యాద్యనుష్ఠానములకు వల
సినవెల్లఁ గొని తెచ్చి చెంతఁ బెట్టి
భిక్షితాన్నము తెచ్చి పెట్టి దేశికునకు
శేషాన్నము భుజించి చేరి కొలిచి
తే. గురునిశాటీల నిచ్చలు గుంజి యూఱ
నైచి పదసేవ చేయుచు రాచి మేను
వీవనలు నైచి నిరతంబు సేవ చేయు
చుండు గురుఁ డొక్కఁడేఁ జెప్పకుండ నెపుడు. 114

వ. గురుండు వానిశుశ్రూష కంతరంగంబున సంతసించుచునుండె నితర శిష్యులు వీఁడు పరమకిరాతుం డెవ్వఁ డేమి చేయునో యని జాగరూకులై సతము వానియెడఁ ◆గన్ను దీసికొనియే యుండి రిట్లు కొన్నినాళ్ళు గడచినపదంపడి నూత్నశిష్యుండు తనమనంబున. 115

చ. గురునకు నాపయిం గరుణ ◆కొండల కెక్కెను శిష్యు లెవ్వ రే
కరణి వచించిన న్వినఁడు కారుణికాగ్రసరుం డెవం డెదే

---

◆ కన్నుదీసికొని = జాగరూకులై సంతతము పరీక్షించుచున్నప్పు డిట్లు కొన్ని చోట్ల వాడుదురు. గుంజి = ఉదికి: ◆ కొండలకెక్కెను = అతిశయించె ననుటకు నిట్లు వాడుదురు.

నరమర లేక కోరిన నొకప్పుడు లే దన కిచ్చెఁ బ్రాణమే
సరకుగొనందు నే నడుగ సర్వము నిచ్చును మెచ్చి ముచ్చటన్. 116

వ. అని యొక్కనాఁ డెవ్వరును దగ్గర లేక దవ్వులకుం బోయి యున్నపు
డేకాంతంబున భగవత్పాదులకడకుం జని యడుగుఁదమ్మి జూపుచుఁ
బదంబు లొత్తుచు ని ట్లనియె. 117

చ. గురువర! మీకు నాపయి నకుంఠితహార్దము కల్గియుండె నే
నరయక యెద్దియే నడుగ నాగ్రహముం బొనరింతొ లేక లోఁ
గరుణనె చూపుచుండెదొ యనఁ గా గురు విట్లను నీవు గోరితే
శిర మది కోసి యిచ్చెదను జెప్పితి నిప్పుడు విశ్వసింపుమా. 118

వ. అనినంతలో నింతయును సంశయింప కక్కపటశిష్యుండు. 119

—♦ శంకరులు చార్వాకునకు వరం బిచ్చుట ♦—

ఉ. శ్రీలలనామనోహరునిఁ జెప్పి మిము న్మతి చెప్ప నొప్పఁ గా
పాలికుఁడన్ భవత్కృపకుఁ బాత్రము నై తిని భైరవార్చనల్
శీలము గల్గు శ్రోత్రియుని శీర్షమునం దిదుపత్రి పూలతోఁ
బోలగ నెంచి చేసికొన బుద్ధిఁ దలంచితి దేశికోత్తమా. 120

క. నీతలఁ గోరితి భైరవు
ప్రీతికిఁ బూజించుపొంటె వితరణఖని! నా
యాతలఁపు వమ్ము సేయక
చేతోగతిఁ గరుణచేయఁ జేయుదు వినతుల్. 121

సీ. ఇంద్రాదు లర్థింప నింతమాత్రములో ద
ధీచి శరీరాస్థి వేచి యిడఁడె
శిబి డేగ కోరికి చెల్లంగఁ దనమేని
కోటిచి యంతయుఁ గోసి యిడఁడె మున్ను
మే నంటికొనియున్న మేల్కవచము దీసి
యే యంగపతి వజ్రికీయ లేడె

యతిథి కోరినమాత్ర నాత్మజుఁ దెగఁ గోసి
వండి పెట్టండె కుంబాళుఁ డపుడు
తే. త్వాదృశుల్ మహామహు లశాశ్వతము తుచ్ఛ
మైనమేను పరోపకారార్థ మొరుల
కడిగినంతన కాదన కిడరె దేవ!
భక్తుఁడను వేఁడుచుంటి నీపాటిదాని. 122

వ. అనిన శంకరుం డంతరంగంబున నెట్టు లెట్టులో తలంచియు నిచ్చెద
నని యీకుండ రా దని యోయికాపాలికాగ్రణీ! నీకు నాశీర్షం
బిచ్చెదఁ బుచ్చుకొని నీయిచ్చవచ్చినయట్లు నం జేసికొందువు గాని
యొక్కమాట చెప్పెద నాకర్ణింపుము. 123

స్రగ్ధర. నాచట్టుల్ క్రూరచిత్తుల్ ననునినుమదిలోనన్ గణింపంగఁబోరో
రోచార్యాకా! మదీయాత్మ్యపహితశిర మీా నుండె నం చేరికేనిన్
జూచాయం దోఁచె నేనిం జుఱచుఅమనుచుంజూచినిక్ రాచి వేయక్
వాచిం తొండొక్కరుం డెవ్వరి కిది తెలుపక్ వద్దు నుమ్మోద్దిగానీ.

ఉ. వేఁకువ నిన్ను లేపెదను వీరును వారు నెఱుంగ కుండఁ గా
నోకము వీడి వాకకడ కొత్తిలి చోత్త్రము చొచ్చినంత నే
నాకడ యోగ మొంది విడినప్పుడు నాతలఁ గొట్టి పట్టి నీ
వేకడకో గమింపు మని యేర్పడఁ జెప్పె ననంతరంబునన్. 125

తే. నాఁటి వేఁకువ శంకరానందమూర్తి
చట్టు లందఱకు న్మున్న శయ్య విడిచి
కడ శయించినచార్యాకుఁ దడవి లేపి
వానితోఁ గూడికొని చనె స్నానమునకు. 126

ఉ. వాడుక యైన రేవునకు వారు గమింపక మూల మూల నై
వేఁడును రాని రేవునకు వేకువఁ జీఁకటి పోక మున్నె నీ

రాడి యతవ్రితంబున సమాధిగతుం డయి శంకరుండు తా
నోడక యోగధారణము నొందుచు శిష్యునిఁ బిల్చి యిట్లనెన్. 127

తే. నేను యోగము చాలించి నీకు సన్న
చేసెదను నీవు నాతలఁ దీసికొనుము
చట్టు లరయుచు వత్తు రోచారువాక !
వారికంటను బడకుండఁ బాఱి పొమ్ము. 128

—• పద్మపాదుఁడు సింహమై కాపాల్యకుం జంపుట •—

వ. అని తాను స్వస్తికాసనంబున నాశీనుండై యోగానుసంధానంబు
గావించుచుండెఁ జాపాల్యకుండును. 129

ఆ. జలక మాడి రక్తచందన మలఁది నై
మోర సింధురంపుబొట్లు వెట్టి
యెమ్ముకలను గూర్చునెత్తులు మెడఁ దాల్చి
కత్తిఁ చేతఁ బూని కడల నిలిచె. 130

ఉ. అక్కడఁ బద్మపాదముఖు లందఱు శిష్యులు మేలుకాంచి సల్
పక్కల రోసి దేశికుని బాలిశు నాకృతకాంతవాసునిన్
బక్కలఁ గాన కట్టిటులు పర్వుచు నెట్టివిపత్తు చేర నో
నోక్కో యటంచుఁ దత్తఱము నొందిరి సందు గొందులన్. 131

క. నలువురు నాలుగుమూలల
కలతం బడి సంచరించి రరయుచు గురు నం
దలపద్మపాదుఁ డానది
కెలనన్ గురుఁ డున్నకడకుఁ గిరికొని వచ్చెన్. 132

వ. వచ్చి వచ్చినంతలో నెంతో వంత కై నదృశ్యము లోచనగోచరం
బగుటయు నక్కటక్కటా మోసం బయ్యెడు నని వేగిరించుచు. 133

సీ. మృత్యుదంష్ట్రిలు వోలె మెఱసెడు దంష్ట్రిలు
చెలవులం దిరుగడఁ గలిగికొనఁగ

బ్రహ్మాండ మిది యొక్కపరి మ్రింగెద నటన్న
పగిదిని జెఱనోరు పరిఢవిల్ల
మొల్లమై మెడమీఁద మొలచిన పెంజూలు
నేలమీఁదం బడి జాలు వాఱఁ
గాళ్ళు చేతులఁ గోళ్ళు కఱ కెక్కి శతకోటి
శతకోటులకు సాటి చాటుచుండఁ

తే. బ్రహ్మజాండకటాహము ఫట్లు మనుచుఁ
బ్రేలి పగిలెడునో యనులీల నట్టు
హాస మడర నృసింహాస్యు యంతలోనఁ
బిడుగు పడినట్లు పడె నట్టె ♦ పినుఁగుమీఁద. 134

చ. పడి వడి నొక్కరించు నొకపాటిరవం బది పుట్ట నట్టె నా
జనునిశిరంబు ఫట్లు మని చప్పుడు పుట్టగ బిట్టడంచె న
య్యెడ రుధిరంబును న్మెదడు నెక్కటిమాంసము పుట్టె పెంకులున్
బుడమి తలంబు నల్గడల మొల్లముగాఁ బడె ♦ ఱొచ్చు ఱొచ్చుగన్.

మత్త. అట్టహాసము నాల్గుదిక్కుల కంట మిక్కిలిమై నభం
బట్టి కూలెడునో యన న్విన నయ్యె శంకరమూర్తి తాఁ
బట్టియుండినయోగము న్విడి ప్రిక్క మిక్కిలి ఘోరమై
నట్టిదృశ్యము గాన వచ్చుట కబ్రముం పడు చార్చుఁడై. 136

శా. కల్పాంతంబున ఘోరరూపుఁ డగుచున్ గన్పట్టి నేత్రానలా
నల్పజ్వాలల సర్వలోకముల సంహారంబు గావింప నై
కాల్పం జొచ్చెడురుద్రుఁడో యన మహోగ్రప్రక్రియం దోఁప నై
షాల్పం దెల్పెడునారసింహు నెదుటం బోలించి సింహాకృతిన్. 137

వ. ఇది సర్వలోకభయంకరసంఘటనం బని సంభ్రమించుచు లేచి
చేతులు జోడించుకొని. 138

---

♦ ఱొచ్చుఱొచ్చు = చాల ఱొచ్చనియర్థము. ♦ పినుఁగు = లుబ్ధుఁడు;

—♦ శంకరుఁడు నరసింహుని స్తుతించుట ♦—

శా. స్తంభంబుం గరవాలధార వడి దుల్చం బెల్చ నందుండి సం
రంభం బెంచఁగ లేచి యేచినకృధన్ బ్రహ్మాండము జేల్చునా
రంభంబుం గొని దైత్యుఁ జీల్చియుఁ గడం బ్రార్థించు బ్రహ్లాదు ని
ర్దంభం బేర్పడఁ గాచినట్టినిను నశ్రాంతంబు బ్రార్థించెదన్. 139

శా. నీదీర్ఘం బగునట్టహాసము మహానిర్ఘాతపాతంబు గా
మీఁదాలోకము దాఁకఁ బ్రాకి త్రిజగన్మిథ్యాత్వముం గూర్చెఁగన్
నీదాసు ల్కడ యెల్లవారలును నిర్నిద్రానుకంపామతిన్
బాదాక్రాంతులఁ జేసి కొంచు గరిమం బాలించి రక్షింపవే. 140

తే. అనుచుఁ బ్రార్థించునంతలో నలసునందుఁ
డరయుచుండఁగ భీకరం బగునృసింహ
రూపమును వీడి మానవరూప మొంది
లేచి గురుపాదముల వ్రాలె లేవ కుండ.

వ. గురుపాదుండును వాని లేవ నెత్తి నితాంతనిజామనస్యం బభివర్ణిం
చుచు ని ట్లనియె. 142

చ. జలజపదా! మదీయ లగుధాతులలో నినుఁ జెప్పుకొందు రీ
కలజగ మెల్లఁ గల్ల యనఁ గా వినియుందువు సన్నుఁ జంపు సం
చలుక వహించి చంపితె మదర్థిజనుల్ దయ మాలి వీని కేఁ
దల నిడినాఁడ నాదయినదానము వ్యర్థ మొనర్చి తక్కటా. 143

ఆ. నాదుపుత్త్రిలోన నీదయామయమూర్తి
పూలు పత్రి పండ్లు పోసి వాని
భైరవార్పణప్రపంచం బొనర్చెను
నట్టి యిట్టివీని నగునె చంప. 144

ఉ. నావుడుఁ బద్మపాదుఁడు మనంబున జంకుచు డొంకుచు న్మహా
దేవసమప్రభావ! గురుదేవ! యొకింతయుఁ దప్పు నాయెడన్

గావుట యేమనుం దెలుపఁ గాఁ దలపోయరు దేశికాగ్రణుల్
గావున నెట్లు చెప్పినను గాని సమంజస మందు దానినిన్. 145

తే. నాలుకలు గోయుచును వచ్చునాగుఁ బాము
సకలలోకైకరక్షకు సాధుపురుషుఁ
గఱవ నున్నప్డు కని యెట్టిఖలుఁడు గాని
చంపకుండునె దానినిఁ జంపు టఘమె. 146

ఆ. చంపునట్టివాఁడు చంపెడువాఁడును
నే పటన్నమాట లేని దగునె
అశుచిపూజ సేయు సపవిత్రపూజకుఁ
బాత్రవస్తు వుండ వలయు నొక్కొ. 714

చ. మఱియొక విస్మయంబు బుధమాన్య! పౌనర్వఁగ నుంటి వీనిపై
వఱలఁగ నీకుఁ డాగ్రహ మవశ్యము శోచినఁ గాని మాకు నో
గురువర! మాశరీరమును గొం డని యిచ్చితి రిప్లు వెండి మీ
శిరమును వీని కిచ్చుటలు చెల్లునె యయ్యది మేటిదానమే. 148

తే. సృగుఁడు చేసినగోదాన మొడఁకు రాఁగ
గురుఁడు మా కిడినదె శీర్ష మొరుని కిడఁగ
నెఱుక లేమిఁ దలంచె నన్ గరిమఁ జేసి
యిట్లు చేసితిఁ జార్వాకు నిద్ధచరిత. 149

ఉ. ఏనును దోడివారు ఖలుఁ డీతఁడు వీనిని విశ్వసింపఁ గా
మానసముం బౌనర్వకుఁ డమాన్యుఁడు వీడని యెంత చెప్పినన్
మానుడి పాటిసేయనిక్రమంబున నుండెడివా ర్దయాళు లె
ట్లైనియు మేము ధన్యులమె యీఁగితి మిట్టివిపద్దశం బ్రభూ. 150

మ. అనుచున్నప్డు తక్కనుం గలుగుశిష్యవ్రాత మేతెంచి చ
చ్చినచార్వాకునిఁ జూచి తత్సకలముం జెప్పంగ నాలించి గొ

ల్లని యార్తధ్వని చేయుచున్ గురునిపాదాబ్జంబులన్ వ్రాలి చ
చ్చినవా ఝుట్టినరీతిఁ దెప్పిటిలి రాశిష్యోత్తము న్మెచ్చుచుర్. 151

వ. ఇట్లు కుమానాంతేవాసి యైనచార్యాకుని నిర్యాణంబు గావించి పద్మ
పదాదు లాగురుపాదులఁ గరంబులం బెట్టుకొని యునికిపట్టునకుం
జని రని చెప్పిన శ్రోత లన్వలివృత్తాంతంబు చెప్పు మని కథకు
నడుగుటయును. 152

—♦ ఆ శ్వా సాం ౦ ౦ ము ♦—

చ. తనకొడు కైనఁ బోషకపదంబున నుండినవాఁడు నైనఁ ద
ప్పొనరుప నీదితప్పె యిటులొప్ప దటంచును చెప్పు నెప్పుడున్
మనమున సందియంపడఁడు మానవలోకవిభూషణంబు భూ
జననుతవైభవుం డెసఁగు సంతత సంశ్రితకల్పభూజమై.

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతం బైన జగద్గురు చరిత్రమునఁ
జతుర్థాశ్వాసము
శ్రీశ్రీశ్రీ



శ్రీరస్తు

# జ గ ద్గు రు చ రి త్ర ము

( అను )

## శ ం క ర వి జ య ము

## ప ం చ మా శ్వా స ము

క. శ్రీజానకీమనోహర
పూజాతత్పరుఁడు వరుఁడు భూసురవంశ
భ్రాజితుఁడు సత్యనాముఁడు
రాజిల్లెఁడు గాక లోకరంజకుఁ డగుచున్. 1

వ. అక్కథకుండు శ్రోతల కిట్లనియె నట్లు చార్వాకకథావశేషం బయినపదంపడి కొన్నినాళ్ళకు. 2

సీ. దక్షిణదేశయాత్రలను సేవింపఁ గా
శంకరస్వామి శిష్యప్రశిష్య
సహితుఁడై సంద్రము సరసమార్గమునుండి
చనుచు గోకర్ణము మునుమును చని
గోకర్ణదేవునిఁ గొనకొని సేవించి
యట మూఁడుదివసము లధివసించి
యవ్వల హరిశంకరాఖ్యదివ్యస్థలం
బున కేగి హరిహరులను భజించి

తే. వెనుక మూకాంబికాస్థానమునకు నేగి
యచట దేవిని సేవించి యధికభక్తి
భైక్ష్యభక్తమునన్ క్షుధ వాపు కొనుచు
నచటఁ గొన్నాళ్ళు వసియించె నంబఁ గొలువ. 3

—• శంకరుఁడు మృతుఁడైన బ్రాహ్మణపుత్రుని బ్రదికించుట •—

మ. మునిముఖ్యుం డొకనాఁడు దేవిఁ గొలుపం బోవంగ సమ్మార్గమం
దనుఁగుంబిడ్డఁడు మిత్తివాతఁ బడుటన్ హా! పుత్ర! హా! పుత్ర! యం
చు నెఱిన్ పీడి మృతు న్నిజాంసములఁ గొంచుం బెల్లు దుఃఖించుత
ల్లినిఁ దండ్రిం గని శంకరుండు వగచెన్ లేఁజూడ్కి నీరూరఁగన్. 4

చ. అడలెడు తల్లిదండ్రుల నిట్టును బల్కఁగ లేక తానుచున్
విడువఁగ లేక కంటఁ దడి వెట్టుచు శంకరుఁ డున్న యంతలో
నెడఁగువిధంబు న్వగతువే కడుశక్తి గలాఁడవు కావ వాదొ కో
జడములు నీదుహస్తమునఁ జల్ల నవెంతకు నైనఁ జాలవే. 5

వ. అని నభోవాణి తన్నుం గూర్చి పలికిన శంకరుండు తల్లిదండ్రుల
నటుండుం డని శవంబుపైఁ గమండలూదకంబు చల్లఁ జల్లినంత
మృతుండు మెండుగ నిదురించినవాఁడు లేచినవిధంబున నావులిం
చుచు లేచి యెదుట నున్న సన్న్యాసికి నమస్కరించె నంతలోనం
దల్లిదండ్రు లతిసంభ్రమంబున మోడ్పుఁగేలు ఫాలంబులం గీలించి. 6

చ. కులమున కెల్ల నొక్కఁ డగుకొడుకును వీని నా కిన్ని నీళ్ళు పైఁ
జిలికినమాత్ర నే బ్రదుకఁ జేసి మముం బ్రదికించినట్టి నీ
వల నెలదాల్పు విష్ణు మము నాపదనుండి తొలంప వచ్చితో
సలలితమూర్తి నీపదరజంబు శిరంబులు సోఁక నీయవే. 7

తే. నేను నాపత్నియును నాదుసూనుఁ డితఁడు
నీకు లెంకల మెప్పుడు మాకు నీవు

దేవుఁడవు దేవదేవుఁడ వీవిధమున
మృతుని బ్రదికించి తీశ్వరుం డీవ కావె. 8

ఉ. చచ్చినవిప్రబాలకుని జల్లనినీ శ్లోకరాన్ని చల్లి మే
లెచ్చ క్షణార్థమందె బళిరే! బ్రదికించె మునీంద్రబాలకుం
డచ్చస లాడున ట్లగుచు నచ్చెఱుపాటును రిచ్చపాటు న
స్తచ్చటివారిఁ కం బొడమె నచ్చెఱుతం డొకదేవుఁ డ న్మతుల్. 9

క. ఆయూరి కామ ప్రక్కల
నై యుండెడునూళ్ళ పల్లె లలుముకొనం గా
నాయతిరాజమహత్వము
వేయాఱులు వచ్చి కనిరి వెఱ నవ్వేటన్. 10

—♦ శంకరుఁడు బల్యగ్రహారంబునకుఁ జనుట ♦—

వ. ఇట్లామూకాంబికాపురంబున మహాఖ్యాతిం బడసి భగవత్పాదుం డొకింతదూరంబున నున్నశ్రీబల్యగ్రహారంబునకుఁ బోవ నెంచి యెఱింగించిన నూరివారు వానియెడఁబాటు సైపనివా రయ్యు నొం డాడఁ జాలక యాబాలగోపాలముగా గ్రామవాసు లందఱును సహ చ్ఛాత్రులైపై పరియాణించుపూజ్యపాదు ననుసరించి రప్పుడు. 11

సీ. శాకునమంత్రముల్ జయజయధ్యానముల్
నారాయణస్మరణములు ప్రబలి
మిన్నంటి మ్రోయఁగా మెలమెల్ల నడుగులు
వేయుచు నడ సాగె విశ్వగురుఁడు
మూకాంబపురినిఁ గాపుర మున్నవారెల్లఁ
దమతమప్రాణముల్ తరలి పోవు
నటు లెంతయేని బెంగటిలి కన్నీళ్లులు
విడుచుచు వెన్నంటి నడవ సాఁగి

తే. రంతలో నింతదవ్వనం దయినశ్రీబ
లిపురమందలి ద్విజులలో విపులకీర్తి
గలప్రభాకరుఁ డనియెడు ఘనుఁడు తనకు
నేడమూకుఁడు గలుగుట కింపు దొఱఁగి. 12

వ. ఉన్నవాఁడు గావున నతం డంతలోన. 13

తే. పొంతపల్లియ మూకాంబమోసల నొక
మృతకుమారుని బ్రదికించెఁ బ్రతిభ ననుచు
విని యతనిఁ దెచ్చి తనసుతు వింతపోగ
మేగి పోఁ జేసికొనియెడునిచ్చఁ జేసె. 14

వ. తాను బాలాశరీరం జూడనివ్రతంబు గలవాఁడయ్యుఁ బుత్రమోహం
బున దాని నవలం బెట్టి గురుపాదుల దర్శించి ప్రార్థించి తోడికొని
పోవువాఁడై సపరివారంబుగ బయలుదేరి నిజాగ్రహారంబు దాఁటి
కొంతదూరంబు వోయియున్నంతలోన. 15

ఉ. వేగురు వెంట నంటి మునువెన్కల బాకులు తీఱి దారిలో
సాఁగుచు వచ్చుచుంటఁ గని స్వామి యటంచు వచింప నగ్గ వే
వేగమ పోయి వానిపదవిం బడి మ్రొక్కి మహామునీంద్ర! నే
శ్రీగురుపాదులం బిలిచి సేవ యొనర్చెడుపొంటె నచ్చితిన్. 16

వ. అని భక్తిపురస్సరప్రణామంబు గావించి ప్రార్థించి గృహంబునకుం
దోడికొని పోయి పాద్యం బొసంగి యొక్కభద్రాసనంబున నాసీనుం
గావించి కుమారుం దెచ్చి తీర్థపాదులపాదంబులం బడ వైచి.

—• శంకరుఁడు మూఁగివానిని మహాకవిం జేయుట •—

సీ. వీఁడు నాకొమరుండు విప్రులఁ బట్టదిమొద
లీవిధంబున నుండె నే మెఱుఁగఁడు
తినఁడును ద్రావఁడు వినఁడు మాటాడఁడు
నొప్పి గిప్పి యెఱుంగఁ జెప్పదేని

చా వన్న జంకడు సదసత్తు లెట్టివో
తెలియంగఁ జెప్పినఁ దెలిసి కొనఁడు
మానావమానముల్ నా నెఱుంగికొనండు
రోత నైనను గాని రోయఁ బోఁడు
తే. పుట్టినదిగోలె నీరీతి బూనెలఁ బడు
నక్షరజ్ఞాన మెఱుఁగఁ డట్లైనఁ గాని
విప్రజన్మము గావున విధిహితముగ
నుపనయ మొనర్చినాఁడ నోయోగమూర్తి. 18
శా. నంశాంకూరము నీఁ డొకండె యగు భాస్వత్పారికాంక్షీ! సుప
ర్వాంశంబుం గొని పుట్టినాఁడ నణిమాద్యష్టాగ్రసిద్ధ్యాదీ
యాంశంబుల్ కరుణామయుండ వయి మాప్రారబ్ధదోషంబు నీ
పాింస్ప్రాభవసంభవంబునను బోపం జేసి రక్షింపవే. 19
ఆ. అనుడు శంకరుండు మునిచంద్ర! నీ వను
నట్లు శక్తి నాకు నగు సటంచుఁ
బలుకఁ గాని జతనుపడఁ జూతు నని విప్ర
తనయుఁ జేరఁ దీసి తనయెదుటను. 20
వ. కూరుచుండం బెట్టి తనదక్షిణహస్తంబు వానిమస్తకంబుపై నిడియె
నంతలో నయ్యోడమూకుండు. 21
శా. సాంగోపాంగము గాఁగ వేదములు నా లత్యంతనిష్ఠం బఠిం
పంగా నేర్చినవాఁడ నైనఁ బరమాత్మజ్ఞానతత్త్వం బెఱుం
గం గీల్కొని ద్విజన్మవేద మది లోకం బందు వ్యర్థంబ యై
త్రుంగుం ద్రచ్చిన మండశూన్యము ఖరీదుగ్ధంబు చందంబునన్. 22
తే. ప్రకృతిపురుషుల నెఱుఁగనిపంచజనుఁడు
జననమరణప్రవాహమునను మునుంగు

క్షయ మగుఁబ్రవృత్తి నెఱిఁగి యక్షయము బ్రహ్మ
మరయు నాతఁడు కేవలుం డగుఁ దలంప. 23

—♦ మూఁగవాఁడు చెప్పినవేదాంతము ♦—

సీ. వినుఁడు ద్రవ్యత్యాగమునకు యాగాది క
ర్మములు భోగత్యాగ మమరుపొంటెఁ
దగువ్రతమ్ములు సుఖత్యాగమునకుఁ దపో
యోగములు సకలత్యాగమునకు
సకలసమాప్తియై ప్రకటింపఁ బడునది
దుఃఖనాశమునకుఁ ద్రోవ యట్టి
దారిఁ బడక యున్నఁ దప్పదు దుర్గతి
యెంతలెంతల కైన నెల్లనాఁడు
తే. మఱియు జ్ఞానేంద్రియంబులు మనము సనెడు
నాఱిటిం దెల్పి కర్మేంద్రియములు ప్రాణ
మనెడునాఱింటినిం గ్రమ మనుసరించి
తెల్పెదను సావధానతఁ దెలియ వినుఁడు. 24

సీ. ప్రకృతివికారముల్ సకలేంద్రియమ్ములు
క్షేత్రజ్ఞ నాశ్రయించియె వసించు
నవి యాతని నెఱుంగ నతఁడు వాని నెఱుంగు
సారథి శిక్షితాశ్వములచేత
నరదంబు వలె నింద్రియములతోడిమనంబు
చేఁ గార్యగతులను జేయుచుండు
నింద్రియంబుల కంటె నింద్రియార్థంబులు
వానికంటె మనంబు దానికంటె
తే. బుద్ధి దానికంటెం బొలుపొందు నాత్మ
దానికంటె మహాత్తు నద్దానికంటెఁ

గలుగు నవ్యక్తముగా దానికంటె నమృత
ముత్తమోత్తమతను గాంచి యొప్పుచుండు 25

చ. అమృతమనుకంటె నుత్తమపదార్థ మొకండును లేనిమాట స
త్య మది పరంబు భూతములయందు నిగూఢము గా వెలంగు సూ
క్ష్మ మయినదృష్టి గల్గమునిచంద్రులు సూక్ష్మము లైనబుద్ధిచేఁ
గ్రమముగ నభ్యసించి వెనుకం గనఁ జాలుదు రీశ్వరాత్మలై. 26

సీ. సాలీడుసూత్రము చందంబునన్ సత్త్వ
ము గుణంబుల సృజించు మొనసి వాని
యందు క్షేత్రజ్ఞుఁ డధ్యవసించు నీశ్వరుం
డయ్యు నస్గుణముల నంటకుండు
గుణరూప మది గనుంగొనరాదు గాని పో
దని కొందఱున్ జ్ఞానమున నశించు
నని కొంద ఱందు రీమది యెఱింగి వివేకి
యాత్మవిజ్ఞానియై యలర వలయు

తే. ఆత్మ యాద్యంతములు లేనిదని యెఱింగి
దోషమును మత్సరత్వము తొలఁగఁ ద్రోచి
చింత నగుహృదయగ్రంథి చిదుకఁ జేసి
సంశయ విహీనచిత్తుఁడై చనఁగ వలయు 27

సీ. ప్రవ్రజితుఁడు పరివ్రాజకుం డగువాఁడు
యోగి సిద్ధిం గోరి యొంటి మెలఁగి
పరమాత్మ యన్నిటం బరఁగున క్లైంచుచు
ముక్తిదూరుఁడు గాక మొనయు నతఁడు
విడుచు గ్నిహోత్రమున్ విడిదయు నన్నార్థ
మరిగి గ్రామమునకు నధికనియతి
నశ్వస్తనవిధాత యై మానమున నొక్క-
పరి లఘుభోజియై పరఁగ వలయుఁ

తే. జెట్లమొదలి నివాసము శిథిలవస్త్ర
ధారణము ససహాయత ధరణిజనుల
యెడ నుపేక్షయుఁ బున్కఁ జే నిడికొనుటయు
తెలియ నివి భిక్షులక్షణము లగుఁ జుండి. 28

వ. ఇట్లధ్యాత్మతత్త్వం బామూలచూడంబుగా నెఱుంగం బలికిన నెల్లరు నొల్లంబోయిన ట్లయి రప్పు డక్కుమారుండు శంకరాచార్యులపాదపద్మంబులం బడి లేవకున్నంత లేన నెత్తి శంకరుండు వానితండ్రిం జూచి. 29

— మూఁగవాని పూర్వవృత్తాంతము —

ఉ. ఈతఁడు నీకుఁ బుత్త్రుఁ డయి యీవివిధార్థపదార్థజాతముల్
ప్రీతి గ్రహించి నేస్తు వయి బిడ్డలఁ గాంచి కులాభివృద్ధికై
ప్రాతి యొనర్చు నంచుఁ దలఁపం దగ దిట్లితఁ డేమి చెప్పెనో
చూతము వీనితోఁ బలుకఁ జూడుము పోడిమి నోప్రభాకరా. 30

వ. అనినఁ దండ్రి కొడుకుం దిగిచి కౌఁగిలించుకొని శిరంబు పుడుకుచు ని ట్లనియె. 31

ఉ. ఓసనుఁ గన్నతండ్రి! కరుణోదధి! యీయడవి నీకు నిర్గతిం
బ్రాణము వోసె నీవు నొకమానిసి పైకొని నీవు గాక మా
కేనియుఁ గైన లేదు ధన మెంతయొ యున్నది త్రవ్వి తెంపపై
నేనును నీదుతల్లియును నీపయి నిల్పితి మెల్లప్రాణముల్. 32

ఆ. బ్రదికి యున్నవార మిదె చూడు మింతయు
నీద సేకరించి నెఱిఁ దలిర్ప
పెండ్లి యాడి సుతుల వెలయించి కుల ముద్ధ
రింపు మోయితండ్రి! యింపుమీఱ. 33

వ. అనిన నబ్బాలుం డొం డేమియుఁ బలుక కనిష్టంబు సూచించు చున్నంత భగవత్పాదులు ప్రభాకరుం గాంచి. 34

ఆ. నీదుకోర్కి యితఁడు నెఱవేర్ప నెంచఁడు
వీనిమీఁదియాశ విడువు మింకఁ
గొడుకు గాఁడు నీకుఁ గోఁటలు రా దెల్లఁ
జెప్పుచుంటి విను మొకప్పటికథ. 35

ఉ. నీవును నీదుభార్యయును నీళ్ళల నాడ నొకప్పు డేటికిన్
బోవుచు నిక్కమారుఁ గొని పొంతఁ దపించెడునొక్కమౌనికిన్
గావఁగఁ జెప్పి చప్పున మొనర్చి జలంబుల నాడఁ బోయి రా
లో నగకాఁడు వీఁడు మునిలోకశిఖామణి చూడకుండఁగన్. 36

వ. ఇట్లు గట్లు పాటాడుచుం బోయి జలంబులం బడి ప్రాణంబులం బాసె మునీంద్రుం డంతలోఁ దనతప్పు తా నెఱింగి తల్లిదండ్రులు రాక మున్న తనమేను వీడి పరకాయప్రవేశవిద్యం జేసి వీనిమేనిలోనం బ్రవేశించె నంతలో మీరు వచ్చి వీనిఁ గుమారుం డని ప్రేమించి యింటికిం దెచ్చి కామించుచుంటిరి వీఁ డింక నాకు శిష్యుండై నా వెంటన వచ్చు నీ వింక గృహస్థధర్మంబు నిర్వహించుచు నద్వైతమతస్థాపనంబు గావించి సుఖంబుండు మని చెప్పి కుమారుం డద్వైతంబు కరతలామలకంబుగఁ దెలియఁ జెప్పెం గావున వానికి హస్తామలకుం డని పేరు పెట్టి వానిం దోడుకొని శృంగగిరికిం జనియె నదియును. 37

— శంకరుఁడు శృంగగిరికిం జని భారతిం బ్రతిష్ఠించుట —

సీ. శాంతామహాదేవికాంతుఁడై ఋశ్యశృం
గమునీంద్రుఁ డెచ్చోటఁ దప మొనర్చెఁ
దుంగానదీమహోత్తుంగతరంగశీ
కరసముత్కరము లేపురి రహించు
వరబృహస్పతి సవప్రముఖములకు నేపా
లమ్ములు యజ్ఞశాలాస్థలమ్ములు

ఋగ్యజురాది వేదేద్ధస్వరంబు లే
గిరిగహ్వరంబుల విరిసి యుండు
తే. అట్టి శృంగగిరికి దాను నఖిలశిష్య
వర్గమును నేగి శ్రీభగవత్పదు లటఁ
దుంగభద్రానదీవరతోయములను
స్నానవిధులను దీర్చి శాంతిఁ గోరి. 38
వ. ఒక్కచో విశ్రమించి నిమీలితలోచనుండై. 39
సీ. మునిశాపమునఁ జేసి భూతలంబునయందు
మానిసియై పుట్టి నైనతల్లి
తనపతికిని నాకుఁ దగవునచ్చినయట్లు
న్యాయవాదిని యగునట్టితల్లి
నాతోడ నోటమి నా నెఱుంగక పెక్కు
లహములు వాదించినట్టితల్లి
ప్రాణనాథునియెడఁ బాటు సైఁపమి నగ్నిఁ
బడి పతిలోఁ జొఱఁ బడినతల్లి
తే. నాకు వాకులొసంగిన లోకమాత
ముగురు తల్లులలో మొట్టమొదటితల్లి
నుభయభారతి యననొప్పు నుజ్జ్వలాంగి
సంస్మరింపఁగ నయ్యె నాస్వాంతమందు. 40
వ. ఇట్లు చింతించి శిష్యులకుం జెప్పి యచ్చోట నచ్చం బగుమఠంబు నిర్మించి భారతి నందుఁ బ్రతిష్ఠించి దానికి సురేశ్వరాచార్యు నధ్యక్షుం జేసి భారతసంప్రదాయానుసారంబుగ నద్వైతసిద్ధాంతంబు ప్రవర్తిల్లం జేయుచుండె నక్కాలంబునం దొక్కనాఁడు. 41
మ. వడు గొక్కండు మనోనువర్తి సుగుణప్రఖ్యాతసద్వర్తనిష్ఠ
నడువం గల్గినవాఁడు శాంతుఁడు దయానందస్వభావుండు నె

న్నఁడునుం గాసినుడుల్ వెలార్పఁ డొరులం ద న్నట్లు వీక్షించు ద
క్షుఁడు నానందగిరిప్రసిద్ధి కయి శుశ్రూషింప వచ్చె న్గురున్. 42

తే. వచ్చి తనపేరు చెప్పి ప్రవరము చదివి
శిష్యునిగఁ జేర్చుకొని విద్య చెప్ప వేఁడ
గురుఁడు వల్లె యటంచు నాగుణనిధిఁ దన
శిష్యులం దొకానొకనిగాఁ జేర్చుకొనియె.

సీ. గురుఁ డెట్టితఱి నైన గిరి యనినంత నోఁ
యని వచ్చి చెప్పినపని యొనర్చు
శ్రీపాదపద్మముల్ సేవించు నిరతంబు
జలకము లార్చువస్త్రముల నుదుకుఁ
దనమేనినీడ నాఁ దవిలి యుండు న్వెన్న
కానిపింపం జెప్ప నైనఁ గాని
యావులింపఁడు తుమ్మఁ డాఁ యనఁ డూఁ యనం
డాచార్యసన్నిధి నాడఁడు వడిఁ

ఆ. జెప్పుకున్నఁ గాని చేయుఁ గార్యము గురు
హితముఁ గోరి యుండు నెపుడు నహిత
మనిన దారి వంక నరఁయ డానంద గి
ర్యాహ్వయుండు గురునియర్మిలి కగు. 44

—• ఆనందగిరి తోటకాచార్యుండగుట •—

మ. ఒకనాఁ డాతఁడు తుంగ కేగి గురువస్త్రోద్ధూళనప్రక్రియా
ప్రకటస్వాంతతఁ గొంతసేపు మసలెన్ బ్రజ్ఞానిధుల్ శిష్యు లు
త్సుకతం బాఠము చెప్పఁ గోరి రపుడాసూర్యాభుఁ డౌనౌజ్ఞ లిం
చుక తాళుం డిదె వచ్చెడున్ గిరి యటంచుం బల్కెఁ గుల్కేర్పడన్.

చ. అది విని పద్మపాదుఁ డను నార్య! భవద్దయ యుద్ధి లేని దై
పొదలుటఁ జేసి యి ట్లనుట పోలును మీగిరి శాంతిపాఠమున్

జదువుట కున్న లే నటులె శాస్త్రములం దతఁ డొక్క-గోడకుఁగా
బదు లన వచ్చు వానికయి పాఠము నిల్పుట వ్యర్థ మే యగున్. 46

తే. అనుచు గర్వోక్తు లాడిన విని గురుండు
సైపఁ జాలమిని సునందు జూడఁ గనక
పదియు నాలుగువిద్యలు పాఱఁజూచి
మదిని నానందగిరి కవి యమకఁ జేసె. 47

క. శాటీ లుదికెడునాతని
కేటెదరిన్ సకలవిద్య లింతటిలోనం
బాటిగ స్ఫురించినంతన్
మేటి యగుచు వచ్చి గురునిమేలు నుతించెన్. 48

తోటకవృత్తము. అపరాధసహస్రసహస్రకరా
నపి భక్తజనాన్ భవదంఘ్రినతాన్
ప్రవరా నవ సీదృశ విశ్వేశ్వర ! మాం
కృపయా పరిపాలయ కృష్ణనుత. 49

తోటకవృత్తము. ఇహ కేచన జీవపరాత్పరయో
ర్న వదంతి సభేదకథా మబుధాః
త దసంగత మేవ యథార్థకృతో
ప్రతిబింబ ఇ తీవ గృణంతి బుధాః 50

తోటకవృత్తము. అయ మేవ పరేశ ఇ తీవ నతైః
క్రియ తేఽద్య మయా ప్రశమాప్తధియా
ప్రతిపాద్య జగత్సు మృ ధేతి సదా
ప్రతిభాతి తురీయపదే యతిరాట్. 51

వ. ఇట్లు తోటకవృత్తంబుల గురుస్తుతిం గావించుటంచేసి శంకరుండు వానికిఁ దోటకాచార్యుం డని పేరుపెట్టి పిలిచెఁ బద్మపాదాదులు వాని విద్యావైశద్యం బంతయు గురుకటాక్షం బని యెంచుచు వానియెడం

గలదుర్భావం బెల్ల దూరీకరించి భ్రాతృభావంబుఁ బ్రదర్శించుచు
నానందించి రంత. 52

సీ. మానవకోటికిన్ మహితముల్ ధర్మార్థ
కామమోక్షము లని ఘనతఁ గాంచి
యఖిలలోకములకు నాధారభూతముల్
యజురాది వేదము లనఁగ నొప్పి
యామ్నాయముల నెప్డు ననువదించెడుబ్రహ్మ
ముఖచతుష్టయ మని పొడిమిఁ గని
మిసిమి నెసంగుసామీప్యసారూప్యాదు
లైన మోక్షము లని పేరుపుఁ గాంచి

తే. గురుకటాక్షపాత్రము లయి కొమరుమిగిలి
యబ్జపాద, సురేశ, హస్తామలకులు
తోటకాచార్యుఁ డనియెడు మేటి శిష్యు
లెన్న నలువురు మెటికలై యెసఁగి రపుడు. 53

వ. ఇ ట్లంతేవాసులతో శంకరభగవత్పాదాచార్యులు శృంగగిరిన్ నివ
సించియున్నయప్పు డొక్కనాఁడు సురేశ్వరుండు దరియ వచ్చి యి
ట్లనియె. 54

శా. నీ కో దేశిక ! చేయియూఁతగ నె దేనిం గ్రంథముల్ సల్పఁగా
నాకున్ బుద్ధి జనించియున్నయది దాన న్నాయథాశక్తిగా
వాకో నొప్పినదానిఁ జెప్పు మనుచుం బ్రార్థింప లోకేశ్వరుం
డై కన్పట్టెడుదేశికుం డను సురేంద్రాచార్యు నీక్షించుచున్. 55

తే. నీకు గురువర్యుఁడు న్నాకు నూఁకఁ గాలు
నపుడుశిష్యుఁడు భట్టపాదాహ్వయుండు
భాష్యమునకు వార్త్తికమును వ్రాయ నెంచెఁ
గాని నెఱవేఱ దయ్యెఁ దత్కౌతుకంబు. 56

—♦ శంకరుఁడు సురేశ్వరునిచే వార్త్తికముం జేయించుట ♦—

తరళము. అతనికోర్కియు నీదుకోర్కియు నంత నాదగుకోర్కియున్
ద్రితయము న్నెఱవేఱునట్లుగ దీర్చి నాదగుభాష్యప
ద్ధతికిఁ బోలెడునట్లు వార్త్తిక తత్త్వముక్ రచియింపు మో
సతతశాస్త్రవిచారణాత్తవిశాలబుద్ధివిరాజితా. 57

మత్త. నా సురేశ్వరుఁ డిట్లనుక్ గురునాథ! నీదగుభాష్యముక్
భాసురార్థవిబోధకం బతిభావగర్భిత మర్థకృ
ద్వ్యాసనూత్రసమాహితం బది తత్త్వవిజ్ఞనహృద్యమై
భాసిలం బొనరింప నేతును భవ్యసవ్యగతిం బ్రభూ. 58

వ. అయినన్ భవదనుగ్రహంబు కలిమి కలంబు వట్టం బ్రయత్నించెద ననిన గురుం డానందించె నంతలో నది యంతయు నాకర్ణించి చిత్సుఖాదు లగుచ్ఛాత్రులు జనాంతికంబున గురుం గాంచి యిట్లనిరి.

మత్త. నిన్న మొన్నటి దాఁక కర్మము నే వదించు సురేశ్వరుం
డిన్న నీనమహాకృతిక్ రచియింప నేర్చునె నేర్చినన్
గొన్ని యేనియు భాట్టపంథలు గూడి కర్మపరంబు లై
ఛిన్నభిన్నము లైనయ ట్లయి చేడ్పడుం జూడి తద్గతుల్. 60

సీ. మనపద్మపదుఁడు చాలినవాఁడు దీనికి
సర్వసమర్థుఁ డోసంయమీంద్ర
యతనిచే వార్త్తికకృతి రచింపఁగ నొప్పు
ననిన సునందుఁ డిట్లనియె దేవ!
కరతలామలకుండు కలఁ డన్నిటికిఁ జాలి
మీఁచే బిరుద మంది మెలఁగువాఁడు
నా గురుం డను వీని నా! చెప్పితివి నిన్న
డాఁ కేడమూకయై తనరువాఁడు

తే. తగఁడు కృతిసేయ వార్త్తిక మగు ననంగఁ
జలుపఁ గలవాఁడు మండనాచార్యుఁ డోకఁడె
యతఁడు బ్రహ్మాంశమునఁ బుట్టె నతనిసతి స
రస్వతీదేవి తెలియరో ప్రాజ్ఞులార. 61

—* పద్మపదుఁడు తీర్థయాత్ర కరుగుట *—

వ. ఇట్లు సంభాషించుకొను చున్నంతఁ బద్మపదుండు తా నంతకుమున్న రచించిన నైష్కర్మ్యసిద్ధి యనుగ్రంథంబు గురునకు నివేదించిన నతండు దానిం దిలకించి ప్రశంసించి తనశిష్యులచేఁ గొన్నిగ్రంథంబులు రచింపం జేసి జగద్వ్యాప్తిం గలిగించె నంత. 62

ఆ. అబ్జపదుఁడు గురునియండకుం జనుదెంచి
తీర్థయాత్ర సేయఁ దెలుపుటయును
గురుఁడు వలవ దనుచుఁ గొంత వారించియు
నాజ్ఞ యిచ్చె వెనుక నరుగుపొంతె. 63

వ. పద్మపాదుం డట్లు గురునాజ్ఞ వడసి తీర్థయాత్రాచణశీలుండై యరిగి నంత సురేశ్వరాదులం గూడి శంకరుఁడు శృంగగిరినివాసంబు గావించుకొని భారతీపీఠంబున నధివసించి యున్నప్పు డక్కడఁ దల్లికి మరణకాలం బాసన్నం బగుటయు నామె కొడుకుం దలంచుకొనియె నప్పుడు. 64

శా. దేవీపూజ యొనర్చుచుఁ హృదయవీథిం జ ల్లనం దల్లి తా
రావా! నాయన! యంచుఁ బిల్చినటు లారావంబు రాఁ బూజకుం
బోవం జాలక శిష్యులం బిలిచి నేఁ బోదు న్మదంబం గనన్
వే వే వచ్చెద మీరు భారతిని సేవింపం దగుఁ భక్తిమై. 65

—♦ శంకరుఁ డాకాశగమనంబునఁ దల్లికడ కరుగుట ♦—

వ. అని చెప్పి యప్పు డాకాశంబువంక శ్రోత్రంబును నేత్రంబును నిగిడించె నంతలో మందమందస్వరంబున. 66

శా. రావా? నాయనగాఁడ! నామహృదిలోఁ బ్రాణంబు లివ్వేళలో
తావుల్ దప్పెను ముప్పు వచ్చెడుతఱుల్ డాయంగ నో స్ప్రులై
చేవం జేడ్పడఁ జేయుఁ జిత్తము నినుం జేరంగ నాశించెడున్
నావాకు ల్చెవిఁ బెట్టువాఁడ వగుచున్ నాపాల విచ్చేయుమా. 67

మ. అనుమాటల్ చెవిఁ బడ్డ యంతటన దృగ్వ్యాపారమందుం గనుం
గొన వచ్చెన్ గురుదేవశంకరునకున్ గోండ్రించుచున్ బల్లియో
యన మంచంబున నంటి పట్టుకొనునార్యాదేవియుం దద్గృహాం
బును శయ్యాస్థలమున్ సమీపమునసే పోలింప నో స్ప్రులగన్. 68

వ. ఇట్లయినంతలో శంకరుండదృశ్యుండై నిమేషంబులోఁ గాలట్య
గ్రహారంబు నందలి శివగురునిగృహంబునఁ దల్లిపల్యంకంబుకడకుం
జని దానిపైఁ దల్లిపాదంబులకడం గూరుచుండె. 69

శా. ఆమ్మా! వచ్చితి నీకుమారుఁడ భవద్వ్యాహారముం జేసి నీ
విమ్మై నుంటివి సంజ్వరం బిపుడు నాహృద్వీథి కయ్యో న్ననున్
నెమ్మిం జూడుము కన్ను విచ్చి యిటుపై నీకష్ట గట్టెక్కెడిన్
జుమ్మా యన్న నతిప్రయత్నమునఁ గన్ను ల్విచ్చి కాంచెన్ సుతున్.

వ. కాంచి కంట నీరు నించుచుఁ గౌఁగిలించుకొని కన్నతల్లి యిట్లనియె.

శా. నన్నుం గన్నకుమార! నాధనరాశీ! నాపాలిభాగ్యంబ! నా
యన్నా! వచ్చితె? నిన్నుఁ జూచినపుడే నావ్యాధు లెల్ల న్నశిం
చె న్నాతండ్రి! మహోన్నతున్ సుగుణరాశిం గన్నమాత్రాన నేఁ
బున్నెంబుం గలవారిలో ఘనతకై పొల్పొందితిం బుత్రకా. 72

శా. నాప్రాణంబులకున్ శరీరమునకున్ వైరంబు సిద్ధించె నీ
నాప్రాణ మ్మను "దేహమా! చివికి తెన్నం గొన్ని రోగాలకున్
నీప్రాపే నని వింటి నిన్ను విడువ న్నే నెంచితిం గొంతలో
నీప్రఖ్యాతి యడంగి పోవు" నని నిందించున్ గదే నాతెయిన్.73

—♦ శంకరుఁడు తల్లి కుత్తరక్రియలు చేయుట ♦—

ఉ. తీరనిపోరు దీర్చుటకు దేవుఁడు చాలఁడు తండ్రి! నాయసుర్
చేరఁగ రానిచోటులను జేరి శ్రమంపడి యుండె దానికిం
బోరును బొచ్చెము న్విలయముం గనకుండెడు చోటు చేరుకోఁ
గారుణికత్వముం గలిగి కన్గొనఁ జేయవె దారి దానికిన్ 74

తే. అనుచు నో మ్మని శంకరుం డంబుజాక్షు
దక్షుఁ బ్రార్థింప నంతలోఁ దవ్విధం బె
ఱింగి దూతలఁ బుచ్చె హారం గెసంగ
వారలు విమానముం గొని వచ్చి రటకు. 75

క. వారలఁ గనుఁగొని శంకరుఁ
డారూఢతపఃప్రభాసమంచితుఁ డగుచున్
దారకము తల్లిశ్రోత్ర
ద్వారముఁ జొరఁ బలికె నపుడు ధర్మజిఘృక్షన్. 76

వ. అప్పు డార్యాంబ తారకస్మరణంబు చేయుచుఁ బ్రాణంబులు విడిచె
నంత విష్ణుభటు లామె విమానంబుపైఁ గూరుచుండం బెట్టుకొని
వైష్ణవధామంబునకుం జని రంతఁ బరివ్రాజకుం డగుశంకరుండు. 77

ఉ. జ్ఞాతుల నూఁరివారల శ్మశానము తల్లి కొసంగుఁ డంచు వి
ఖ్యాతయశోవిరాజితుల నందఱఁ గోరియు రిత్త వోవుచుఁ
ఘాతుకజన్ము లీద్విజులు కాటికిఁ జేర్పుఁడు ప్రేత మంచు వే
రీతుల విన్నవింప నొక*ప్రేతయుఁ బ్రీతి యొనర్పఁ డక్కటా. 78

క. ని ప్పుడుగ లేదు పొ మ్మని
♦ రిప్పాడుగృహమ్ము నందు నెవ్వరు గానీ

*ఒకప్రేత = దూషణమం దిట్లు కొన్ని మండలములలో వాడుదురు. గృహము = గ్రామమునం దనికొన్ని చోట్ల వ్యవహరింతురు.

ని ప్పీరు నన్నుఁ దల్లినిఁ
జెప్పగరానట్లు తిట్లు చెల్లించి రయో. 79

వ. అని మహాగ్రహంబున. 80

ఉ. వీరలు వేద బాహ్యు లయి వీరిడులై చెడిపోదు రింకిటన్
వీరలయిండ్ల నేయతియు భిక్షపొనర్పఁగరాదు ముంగిళుల్
వీరల కొల్కిమిట్ట లయి వేడుకఁ గూర్చెదు నంచు శాప మా
యూరికిఁ బెట్టి దిట్టఁ డతఁ డుల్లమునం దలపోసెఁ గర్జమున్. 81

వ. తురీయాశ్రమంబు స్వీకరించినవాఁడు తల్లిశవంబునైన ముట్ట రా దని
మన్వాదులు శాసించిరి కావున. 82

సీ. తనదుముంజేతులఁ దగునట్లు పూర్వోత్త
రారణుల్ గావించి ధీరుఁ డాతఁ
డగ్నిమంత్రంబుల నవఘళింపం జేయు
చొకదానిపై నొక్కఁ డుంచి క్రుచ్చి
హెచ్చి మథింపఁగఁ జొచ్చె నంతటిలోన
రెండుచేతులు హెచ్చి మండఁ జొచ్చె
శవమున కీవల నవల వానిని నిల్పఁ
బట్టి దాన శవంబు భస్మ మయ్యె

తే. బోడి యయ్యు నాపద్ధర్మమును గ్రహించి
తల్లి కుత్తరక్రియలను దగ నొనర్చి
శృంగగిరి నున్నశిష్యులసంగతిఁ గొని
విమతులం గూల్పఁ బర్యటనము పొనర్చె. 83

—• పద్మపాదుని పంచపాది నుద్ధరించుట •—

సీ. వనజపాదుఁడు గురునినుమతిం గొని యటు
లుత్తరయాత్రల నోపి చేసి

వెనుక దక్షిణయాత్రలను దీర్చ నెంచి శ్రీ
కాళహస్తీశ్వరుఁ గాంచి మున్ను
జ్ఞానప్రసూనాంబ నానందమునఁ గొల్చి
కాంచీపురికి నేగి కాంచి వరదు
శివగంగకుం జని శివుని సందర్శించి
సేతురామేశ్వరు సేవ నెంచి
తే. దారిఁ గావేరి జలమాడి తఱలి చనుచు
మధ్యమార్గమున స్వేనమామయిల్లు
తారసించిన నట కేగి తజ్జనోప
లాలితుం డయి కడపి కొన్నాళు లచట. 84

వ. పంచపాదిగాఁ దాను రచించినశంకరభాష్యటీక యనుమహాగ్రంథ మాప్రభాకరమతగామి యగుమామకడం బెట్టి తాను సేతువునకుం జనియె నంతలో మేనమామ తనమతంబునకు విరుద్ధధర్మోప దేశకం బగుదానిఁ దనయింటం బెట్టి దహనంబు గావించె నంతఁ గొంతలో స్వస్రీయుండు వచ్చి తనగ్రంథంబు గృహంబుతో దగ్ధం బగుట యెఱింగి చచ్చినవానికిం బలె వెచ్చనూర్పుచుఁ జేయునది లేక పయనంబై పరివ్రాజకాచార్యవర్యునిపాదారవిందంబులే గతి యని తలంచుకొనుచువచ్చి గురువరేణ్యుని సందర్శించి తనవృత్తాంతం బెఱింగించి దుఃఖించుచు. 85

శా. నావ్యాఖ్యానము మంటిలోఁ గలసె నోనారాయణాంశోద్భవా!
దివ్యం బద్ది రచింపఁ జాల మఱియున్ దేహంబు చాలింతు నే
నవ్యక్తుం బది దానిఁ బాసి మన నే నాశింప నోతండ్రి! నా
నవ్యారంభుఁడు దేశికుం డనియె నానాశాస్త్రకృద్వాసనన్. 86

తే. నాకు వినిపించితివి దాని నాఁడు శృంగ
గిరిని సేవింటి ధారణాగరిమ నిపుడు

పంచపాది వచించెదఁ గించ విడిచి
వ్రాసికొమ్మని యంతయు వరుసఁ బలికె. 87

వ. పద్మపాదుండు తనపంచపాది నానుపూర్వంబుగా సర్వంబును దేశికా నుగ్రహంబున మరల సంపాదించుకొని చచ్చినవాని స్మరల బ్రదికించుకొనిన పంచజనునిచందంబున. 88

క. ఆడుచుఁ బాడుచు నెఱుఁగని
వాఁ డయి వేదురునియట్లు పలుమా అదిరో
నీడక నొడువుచుఁ గన్నుల
జాడలు గట్టంగ నశ్రుజలము స్రవించున్. 89

వ. ఇట్లు పద్మపదుండు నష్టద్రవ్యలాభంబు నొందినవానిచందంబునఁ బొందుపడి గురుమూర్ధన్యుని ధారణాశక్తి కెంతయు సంతోషాశ్చర్యంబు లొందుచుండె నంతలోన. 90

తే. రాజశేఖరుఁ డనెడు కేరళవిభుండు
తా నొనర్చిననాటకత్రయము మున్ను
శంకరపరిష్కృతము గాఁగ నలిపియుండె
నది నశించెను వైశ్వానరాహుతి కయి, 91

ఆ. రాజు మొఱ్ఱొనుచుఁ దాఁ జనుదెంచి శం
కరున కెఱుఁగఁజేసి కరుణఁ జూపు
మనిన నతఁడు మున్ను వినియుంట దానిని
దు చ లు తప్పకుండఁ దొడరి చదివె. 92

వ. ఇట్లత్యంతధారణాశక్తిసామర్థ్యంబులు గలిగినశంకరభగవత్పాదులు పద్మపాద, హస్తామలక, సమిత్పాణి, చిద్విలాస, జ్ఞానకంద, విష్ణుగుప్త, శుద్ధకీర్తి, భాను, మరీచి, కృష్ణ, దర్శనబుద్ధి, వృద్ధి, విరించపాద, శుద్ధానంత, నందగిరి ప్రభృతులగు సహస్రసంఖ్యాకశిష్యులతో సుధన్వరాజశేఖరాదిరాజన్యులతోడం గూడి. 93

—♦ శంకరుఁడు జైత్రయాత్రఁ గావించుట ♦—

సీ. శంకరాచార్యుఁడు సహశిష్యుఁడై జైత్ర
యాత్ర పొనర్చెదునాసఁ జేసి
మధ్యార్జునక్షేత్రమహి కేగి హరుఁ గొల్చి
యచ్చట నద్వైత మిచ్చ నిలిపి
సేతురామేశ్వరక్షేత్రంబునకు నేగి
శక్త్యుపాసకులతో సాంఖ్యసమితిఁ
జూడ వచ్చినవారితోడ వాదము చేసి
వారలఁ దనలోనఁ జేరిచి కొని

ఆ. అటకు లక్ష్మిభక్తు లరుదెంచి తమతమ
విధ మెఱుంగఁ జెప్ప విని గురుండు
వాదముం బొనర్చి వారినిఁ దనలోనఁ
గలిపికొనియె శిష్యగణము గాఁగ. 94

వ. అట్లే శారదోపాసకులు, వామాచారపరులు, శాక్తేయులు వచ్చి వాదోపవాదములు సేసినంత వారి కద్వైతం బుపదేశించి పంచాయతనపూజాతత్పరులఁ గావించి రామేశ్వరంబునకుంజనియె నదియును.

ఉ. రాముఁడు రావణాసురుని రాసి రణంబున రాజధానికిం
గోమలితోడఁ బోవుచును గొంత రణాఘము వాపుకో సము
ద్రామలతీరభూమిని మహాశివలింగము నిల్పువాఁడ వై
*వ్యోమభవోద్భవుం బనిచె నుత్తమలింగముఁ దేరఁ గాశికిన్. 96

ఆ అతఁడు వోయి లింగ మరసి తెచ్చుటలో నా
కింత తడసె దాన నిట ముహూర్త
సమయ మయ్యె ననుచు సైకతలింగము
సుప్రతిష్ఠిత మయి చూడ నొప్పె. 97

* వ్యోమభవోద్భవుండు = వాయుపుత్రుఁడు, హనుమంతుఁడు;

ఆ. అనుమఁ డంతలోన నరుదెంచి తనపోక
వ్యర్థ మయ్యె ననుచు వాలమునను
జుట్టి యిసుకలింగ మట్టె లాఁగెను గాని
పెల్లగిలదు శోకబిగువు చెడియె. 98

క. రామప్రతిష్ఠితం బయి
భూమిం బొలుపొందులింగమును గానాఁటన్
రామేశ్వరలింగం బని
నామము పొలుపొందెఁ బాపనాశక మగుచున్. 99

వ. శంకరుం డానగరంబున శిష్యులుం దానును గొన్నినాళ్ళుండి మహోదధి నాడుచు రామలింగేశ్వరు సేవించుచుండె నాకాలంబున.

శా. చోళుల్పాండ్యులు ద్రావిడుల్ మొదలుగా క్షోణీశ్వరుల్ బల్వురా
రాలో శంకరదర్శనార్థు లగుచున్ బ్రార్థించుచు న్వాస్తనున్
వేలుంగా నట వచ్చి బోధనముల న్విజ్ఞానముం గాంచి శి
ష్యాళిం జేరి కృతార్థులై చనిరి స్వీయావాసముం జేరఁగన్. 101

సీ. శాక్తేయు లరుదెంచి శక్తిప్రభావంబు దెల్పు
తమమతమే శ్రేష్ఠతమ మటంచుఁ
బాశుపతులు వచ్చి ప్రతివాద మొనరించి
తమమతమే శ్రేష్ఠతమ మటంచు
శైవులు చనుదెంచి సాధువాద మొసర్చి
తమమతమే శ్రేష్ఠతమ మటంచు
మఱియు వామాచారపరులు నరుగుదెంచి
తమమతమే శ్రేష్ఠతమ మటంచు

తే. ఘోరవాదముల్ చేయ నాసూరివరుఁడు
శంకరస్వామి వారితో సాధువాద

ములు పౌనర్చియు నెల్లవారలను గెలిచి
వారిఁ దమశిష్యరాజిలోఁ జేరుచుకొనె. 102

వ. ఇట్లు కొంతకాల మట నుండి యనంతశయనంబునకుం జని యొక్క మాసం బక్కడ నివసించి భక్త, భాగవత, శైవ, వైష్ణవ, పాంచరాత్రి, వైఖానస, కర్మహీన, క్షపణక, వరాహ, లోకసేవక, సాంఖ్యాది మతంబుల నెల్ల ఖండించి గంధర్వోపాసకుల గండడంచి, పితృమతంబు తృణీకరించి, నీలకంఠమతం బున్మూలించి, భేతాళార్చకుల వశంవదులఁ జేసికొని హిరణ్యగర్భ, వహ్ని, సౌర, హరిద్రాగణపతి, ఉచ్ఛిష్టగణపతి, నవనీతగణపతి, లోనగుమతంబులవారురా వారితో శాస్త్రవాదంబులు గావించి వారి వారి మతంబుల నిరసనంబు గావించి వారినెల్లం దమలోనం గలుపుకొని తామ్రపర్ణీతీరంబునకుం జని యట నున్న విప్రులకు జ్ఞానోపదేశంబు చేసి మల్లపురంబున మల్లారిభక్తుల నద్వైతులం జేసి, విష్వక్సేన, మన్మథ, కుబేర, ఇంద్ర, యమ మతంబుల నిరసించి నాచికేతువృత్తాంతంబు చెప్పి వారి నొప్పించి వరుణ, వాయు తీర్థంబుల ఖండనంబు గావించి కర్మవాదిమత చంద్రిమతంబుల నిరాకరించి యంగారకాదిగ్రహోపాసకుల వీసరవోఁ జేసి శూన్యవాదులను బరమాణువాదులను బాఱఁ దోలి మఱియును. 103

—• కంచిలోఁ గామకోటిపీఠముం బ్రతిష్ఠించుట •—

ద్విపదము. కంచికి నేగి యక్కడఁ బేరిమి శివ
కంచి యంచును విష్ణు కంచి యంచు నట
రెండుగ్రామములు వేర్వేఱ నిర్మించి
దండివిద్వాంసుల ధరణీసురులను
దెచ్చి యచ్చట నిల్చి దేవతాపూజ
లిచ్చఁ జేయించుచు నీశ్వరభక్తుఁ

డయినశంకరదేవుఁ డాగతు లైన
నయవిదు లైనయాంధ్రావనీసురులు
పరువడిఁ దనసేవఁ బ్రార్థించి రాఁగఁ
గరుణించి శిష్యులు గాఁ జేసి కొనుచు
శివకంచిఁ గామాక్షి సేవింప నిల్పి
నవకామకోటి నా నామపీఠంబు
గలిపించి దానికిఁ గలిగించి మహిమ
మెలయంగఁ బూజింప నొకశిష్యు నిలిపి
వరి వేంకటాచలస్వామిని జూడ
నరిగి మంగావిభు నర్చించి భక్తి
పరిరక్షకులుగ సుధన్వప్రభృతులు
పరిపరివిధములఁ బరతెంచి భక్తి
శితఖడ్గహస్తులు చేరి తన్గొలువఁ
గతిపయదినములఁ గాంచె నుజ్జయని. 104

వ. అట్లుజ్జయనికిం జేరి యున్నప్పుడు. 105

—♦ శంకరుఁడు క్రకచాదులఁ బరాజితులం జేయుట ♦—

సీ. పితృవనంబునఁ గల్గుచితభస్మ మొడ లెల్ల
నిండునట్లు ధరించి నెఱులు విప్పి
నృకపాలమాలికల్ నిలువెల్ల నిండఁగాఁ
గట్టి కొనుచుఁ బుఱ్ఱెఁ బట్టి కేల
మృణ్మయకర్పర మేర్పడ మెడ వ్రేల
గాఁ బెట్టి ఘంటలు గల్లు మనఁగఁ
బావకోళ్లలనెక్కి బావుకొనుచు నెత్రి
భైరవపూజకుఁ బ్రస్థితుఁ డయి
తే. శూలము ధరించి కెంగేలఁ గాలుఁ దనఁగఁ
గ్రకచనామకకాపాలిక ప్రభుండు
ఘాంకృతి యొనర్చుచున్ వచ్చెఁ బారికాంక్షి
వచ్చుమార్గంబునకు నడ్డుపడుచు నెచ్చి. 106

తరళము. కహకహార్భటిఁ జేయుచుం గడుఁ గండకావర మెచ్చఁ గా
నృహరిసన్నిభు శంకరు న్వడి నేయ నుండినయంత నా
♦ మహిభృదగ్రణి యస్త్రశస్త్రసమన్వితుం డయి యేచి వృ
త్రహుని శస్త్రముఁ బోని శస్త్రపరంపర న్విదళించుడున్. 107

ఆ. సరకు గొనకవాఁడు సంవర్తసమయుగ
ర్జార్భటిం బొనర్చె నంతలోన
వేలకొలఁది యగుచు వే వచ్చి పడిరి శా
పాలికాగ్రగణ్యులాలమునకు. 108

క. వచ్చినవారల శంకరుఁ
డచ్చెరుపాటునను జూచె నంతట మూఁకల్
సచ్చరితు లగుచు నయ్యతి
నచ్చపుభక్తిన్ భజించి రచ్చెరు వొదవన్. 109

తే. యమివరేణ్యునిదృష్టి పాతమునఁ జేసి
ప్రళయకాలసంవర్తునివగిది నుండు
క్రకచుఁ డప్పుడు పిలిపిల్ల కరణి నగుచు
శంకరునికాళ్లపైఁ బడెఁ జచ్చి నట్లు. 110

వ. ఇట్లు క్రకచాదుల నుక్కడంచి మించి పరాక్రమించినయున్మత్త
భైరవుం డనువానిం గూడఁ జూపుల నే పడంచి సౌగతుం డనువాని
సౌ రడంచి మఱియు నందందుఁ గలపాషండులఁ బాఱఁ దోలుచుఁ
బశ్చిమసాగరప్రాంతంబున విహరించుచు గోకర్ణంబునకుం జనియె
నప్పురీవరంబున. 111

మ. హరదత్తుం డనువాఁ డొకం "డెవఁడొ వేదాంతాదివిద్యావిశే
షరహస్యజ్ఞుఁడు వచ్చె" నంచు విని అచ్చ న్నీలకంఠాఖ్యునిన్

♦ మహీభృదగ్రణి = సుధన్వుఁ డని తెలియునది,

గురునిం జేరఁగఁ బోతి మిమ్ము గెలువం గోరియుం డాకం డిప్పు డి
ప్పురికి న్వచ్చెను వాఁడు ముండి యనుచుం బోల్పంగ వచ్చునె సుహా.

మ. విని హూఁ యంచు సగర్వసంభృతమనోవిభ్రాంతుఁడై తద్గురుం
డను నంభోనిధు లింకఁ బోఁడిన నభం బల్లాడిసన్ భూమి గ్రుం
గిన నన్నుం గెలువంగలాఁడు త్రిజగత్క్షేత్రంబులం బుట్ట లే
డని పుట్టం డని చెప్పుచుంటి హరదత్తా! చింత యింకేటికిన్. 113

వ. అని యనల్పామర్షంబునం బలుకుచు నీలకంఠుండు కంఠంబున భద్ర
రుద్రాక్షమాలికలు ధరించి భస్మోద్ధూళితవిగ్రహుండై శైవశాస్త్ర
సిద్ధాంతంబుల నిష్ణాతు లగు నంతేవాసివతంసములతో శంకరుం
డున్న చోటికిం జని గంభీరస్వరంబున. 114

శా. నీతో నే నెదిరింప వచ్చితిని ముందే నీలకంఠాఖ్యుఁడన్
నాతో వాదము చేసి యెవ్వఁడును మానప్రాణము ల్గాచి వి
ఖ్యాతిం జెందినవాఁడు లేడు జగతిన్ గం దీవు ముం ది ష్ఠసం
జేతశ్శక్తి యొకింత లేక జడతం జేకొందు లో నక్కటా. 115

—♦ శంకరుఁడు నీలకంఠాచార్యుల నోడించుట ♦—

వ. అని వీరాలాపంబు లాడుచున్న నీలకంఠునితో నెట్టియుం బ్రసంగింపక శంకరుండుగాని మ్మని తా నుత్తరమీమాంసం బురస్కరించుకొని వాదింపం బూనె నాతండు పూర్వమీమాంసం బురస్కరించుకొని ప్రతివాదంబు గావింపం దొడంగె నిట్లు కర్మబ్రహ్మప్రతిపాదకంబై వాదోపవాదరూపం బైనమహాసంగ్రామంబు కొన్ని యహోరాత్రంబు లేకదీక్షం బ్రవర్తిల్లె నంతలో నీలకంఠునివాదంబు సన్నగిల్లినం దెల్లవోయి యతండు హరదత్తాదిశిష్యప్రశిష్యసహితుండై భగవత్పాదులపాదంబులం బడి ప్రణమిల్లి తనమతంబు వీడి యద్వైతంబు స్వీకరించె ననంతరంబ. 116

శా. సౌరాష్ట్రాదుల శంకరుం డిటు స్వభాష్యంబుం ప్రవర్తిల్లున
ట్లారంభంబు లొనర్చి పేర్చినజయం బందందునుం బొందుచున్
మా రొద్దం గలవానిఁ గానక మహానందంబునం బొందుచున్
ద్వారావత్యభిధానపూర్వరము నొందం గగ్గె మే ల్గాంచఁగన్. 117

ద్విపదము. అటఁ బాంచరాత్రుల నందఱ గెలిచి
* నిట లాక్షుఁ డుజ్జయనికి నేగి భక్తి
తో మహాకాళనాథునిఁ గొల్చి యచట
స్వామిమండపమున శ్రాంతి దీఱంగ
నిలిచి పంకజపదునిం బిల్చి వత్స!
కలఁ డిందు భట్టభాస్కరుఁ డనుమేటి
చని నీవు వానిపజ్జకు నేను వచ్చి
తి నని వాకొని రమ్ము దేశికునాజ్ఞ. 118

వ. అనిన నతం డట్ల యగుం గావుత మని గుర్వాజ్ఞ శిరసావహించి
భట్టభాస్కరునిపాలికిం జని త న్నెఱింగించి యి ట్లనియె. 119

—♦ శంకరుఁడు భట్టభాస్కరు నోడించుట ♦—

సీ. అతిబాల్యమునన వేదాదివిద్యల నెఱిఁగెఁ
గురిసె బంగరువాన గరితఁ బ్రోవఁ
దల్లికోరికిఁ జేసి తరలించుకొనివచ్చెఁ
బూర్ణానదిం దనపురము ♦ కడకుఁ
గొండసాఁద్గునఁ బాఱుచుండుకాళిందినీర్
తనకుండి నొకమూల దాఁగఁ బట్టెఁ
జచ్చినమునిపుత్రు క్షణమాత్రఁ బ్రదికించె
వేదమూకకు మహాకవీంద్రుఁ జేసె

* నిటలాక్షుండు శివుఁడు = నుదుట కన్నుగలవాఁడువలె వర్తించెంగావున నిట్లు ప్రయుక్తము. ♦ పురము = గృహము.

తే. బ్రహ్మకుం బోనిమండను వానిసతిని
ప్రేల్మిడిని గెల్చె లోకైకవినుతయశుఁడు
శంకరాచార్యయోగీంద్రసత్తముండు
వాద మొనరింప నినుఁ బిల్చె భాస్కరార్య. 120

చ. అనవుడు నవ్వి ఫక్కున సహో భవదీయగురుండు నన్ను నా
ఘనయశమున్ వినం డనుచుఁ గన్గొన వచ్చెడు ధర్మవాదముల్
బొనరుచు వేళ నాదుపదముల్ ప్రతివాదిశిరంబుమీఁదఁ జ
క్కనిగతి నాట్యమాడుటలు కర్ణపుటంబుల కెక్కకుండె నో. 122

శా. కా నే మండనుఁడన్ మఱొక్కఁడనుగాన్ గాల్వెన్కకున్వోయఁగాఁ
బో నంచున్ భవదీయదేశికునకున్ బోలంగ వాక్రుచ్చు మే
రో సన్ గాంచె మెఱింగితో మ్మనుము నా రోషించి పెన్గొంచ పెం
పైనం గూల్చెదువజ్ర మాఘనుకడన్ వ్యర్థం బగు న్వింటివే. 122

వ. అని గర్జించుచుఁ బద్మపదుండు జరీలునం బోయె నంత భట్టభాస్క
రుండును శిష్యసమేతుండై యతిసార్వభౌములసమక్షంబునకుం జనియె
నప్పుడు వారికి బ్రశ్నప్రతివచనంబుల నాక్షేపసమాధానంబులను శ్రుతి
శీర్షవచఃపరిష్కారంబులను గర్మబ్రహ్మవాదంబులను బ్రస్తుతం బగు
వారిపోరు గజకచ్ఛపంబులపోరు వోలె ఘోరం బయ్యె. 123

ఆ. ఇట్లు కొన్నిదినము లేగిసపదపడి
భాష్యకారచక్రవర్తి యుక్తి
శతసహస్రములను జతకూర్చి భాస్కరు
నోడఁ జేసి వానియు క్కడంచె. 124

వ. ఇట్లు గెలిచి భట్టభాస్కరు నంతేవాసిగం జేసికొని మఱియు నవంతి
దేశంబునఁ బ్రసిద్ధు లగుబాణ, మయూర, దండి, ప్రభృతుల
జయించి నిజభాష్యశ్రవణోత్సుకులం జేసి బాహ్లీకదేశంబున కరిగి
యట నున్నపండితంమన్యుల నోడించి నైమిశంబునకుం బోయి

యటఁ దనభాష్యముం బ్రవర్తిల్లఁ బ్రసరించి యిట్లు విదేహకోస లాది బహుదేశంబులం దిరిగి జయించి ఖండనకారుం డగుశ్రీహర్షు నోడించి వాని వశంవదుఁ గావించుకొని గౌడదేశమున మురారి మిశ్రాదులకడ విజయంబు గొని జయభేరివేయించె నపుడు లోకా యతుం డగుచార్వాకుండు పలాయితుం డయ్యెఁ గాణాదులు, పాతంజలులు, గౌతమబుద్ధాదులును గణాదులును, క్షపణకులును, వైతాళికులును దిగంబరవంశోద్భవులునగు వారిం బట్టి బందీకృతులం గావించె విమతులు నామమాత్రావశిష్టు లైరి ద్వైతవాదంబు ధ్వస్తం బయ్యె నయ్యెడ. 125

మ. క్షమ యెల్లన్ భయదప్రకార మగుచున్ గాఢంబుగాఁ గ్రమ్ముచుం
గుమతధ్వాంతము దట్టమై కవిసి వ్యాకోచస్థితిం బొందుచో
సుమనస్స్తుత్యుఁడు బాలభాస్కరుఁడు నాసూర్యగ్రగణ్యుండు సం
యమినర్యుం డగుశంకరుండు మటుమాయం బై చనం జేసెఁ బో.

వ. ఇట్లు సర్వదిగ్విజయంబు గావించి శంకరుండు నిజావతారంబు సఫ లంబు గా నొనర్చె నని చెప్పిన శ్రోత లవ్వలివృత్తాంతంబు చెప్పు మని కథకు నడుగుటయును. 127

—♦ ఆశ్వాసాంతము ♦—

మ. జగదంబోదరశుక్తిమౌక్తికము పేర్వాస్త్రైవ్యాయస్వాతిమే
ఘగతౌజఃప్రభవం బనర్ఘము జగత్ఖ్యాతప్రకాశంబు ది
వ్యగుణస్యూతము సర్వమాన్యము మహీంద్రాలంకిృయాకల్పితం
బగుచూడామణి సత్యమూర్తిబిరుదాఖ్యాతంబు వర్ధిల్లుతన్. 128

మత్త. పేరు గల్గినవాఁడు గావునఁ బేరుశాస్త్రి యనంగ నై
ధారుణీస్థలిఁ బేర్మి నందినధార్మికాగ్రణిపుత్రుఁడై
కోరికల్ నెరవేర్చి యాచకకోటి నేలుచు నెంతయోఁ
బేరు గాంచినసత్యనాముఁడు పేర్మి నొప్పెడుఁ గావుతన్. 129

## గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతం బైన జగద్గురు చరిత్రమునఁ
బంచమాశ్వాసము
శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

# జగద్గురుచరిత్రము

(అను)

## శంకరవిజయము

### షష్ఠాశ్వాసము

క. శ్రీయుఙ్ దేవియు వాణియు
నేయెడ సేవింప జగము లేలెడు వేల్పుల్
పాయనికరుణం బ్రోతురు
న్యాయగుణాకరుని సత్యనారాయణునిఙ్. 1

వ. అక్కథకుండు శ్రోతలకిట్లనియె నట్లు శంకరుండు దిగ్విజయంబు గావించి యొక్కనాఁ డొక్కచో విజనంబున విశ్రాంతిం బొందు చున్నప్పుడు. 2

—♦ శంకరుని పాయురోగము ♦—

సీ. అభినవగుప్తుఁ డన్ ప్రభ గలవాఁ డను
త్తమమాంత్రికుఁడు క్రూరతముఁడు వాఁడు
శాస్త్రవాదము చేయఁ జాలక శంకర
స్వామిపై నిడె నాభిచారికంబు
క్షుద్ర మయ్యది వాపుకొను టెంతపని యైనఁ
గర్మ మనుభవింపఁ గావలె నని
యతినాథుఁడు ప్రతిక్రియం జేయఁ డయ్యె న
య్యది భగందర మనునట్టి వ్రణము

తే. పాయువున నయ్యె సెతు(్రి) పరీవాహ మగుచు
వఱ్ఱు వాఱెను శంకరస్వామి కదల
మెదల లేనట్టి(?)దై చిట్టెడుదక మైనఁ
గంఠమునఁ బోసికొన లేక కష్టపడియె. 3

ఉ. వైద్యము సల్పఁ గోరుచును వచ్చిన వైద్యులఁ బోవ నాడు మీ
వైద్యము నొల్లని ట్లనుభవంబునఁ గాని నయంబు గాదు రో
గాద్యవమానముల్ సుజనులార! చనుం డను మంచిమాట నా
హృద్యతఁ జూపఁ బోనఁ డెవ రేమి వచించినఁ గాదు పో మ్మనున్.

చ. జలజపదుండు వచ్చి మును సల్పినకర్మము చెప్ప నోస్వానే
సలలితమూర్తి! నా నతఁడు సల్పితి నేదొ మనుష్యుఁడై యిటుల్
పలుకఁగ వచ్చు నీవ్రణము బాధ శమించుఁ బదాఱునాళ్ళలో
విలవిలలాడఁ బోకుఁ డిటు విష్ణుపదార్చన మానఁ బోకుఁడీ. 5

తే. అనుచు శిష్యులతో నాఁడుకొనుచు నుండు
శంకరున కొక్కదినమున ఛాత్రవేష
హారులు పదేండ్లవారు విద్యార్థుల మని
యరుగు దెంచిరి కవలు భూసురసుతు లగుచు. 6

ఉ. గోఁచులు దోణముల్ గలిగి కొప్పులు విప్పుట వేళ్లఁ బెన్నరుల్
చూచెదుచూపు లందు నొకచోద్యముఁ జూపుచుఁ గేల బుస్తముల్
రోచుల నీన జంకలఁ దళుక్కున సంచులు సంచలింపఁ గా
రాచరికంపుతేవ లవి గ్రాలఁగ వచ్చిరి రోగిచెంతకున్. 7

ఉ. వామనమూర్తులో యనఁగ వచ్చెడువారలఁ గాంచి శిష్యు లే
మేమియుఁ బల్కరింపక తదేకమతిం గనుచుండి రంతలో
స్వామి కుమారులార! యిటు వచ్చితు రాశాసనముల్ గ్రహింపుఁ డీ
రేమహి నుండువార లిట కేటికి వచ్చితి రేమి కోర్కెహో! 8

—♦ శంకరుఁడు దేవవైద్యుల నిరాకరించుట ♦—

క. బంగారుబొమ్మలో యన
రంగారుచునున్నవారు రా రండు మిమున్
బంగారుబొజ్జ గలిగిన
సింగారియె కాంచె నంచుఁ జెప్పఁగ వచ్చున్. 9

ఆ. కనులు ముక్కు మోము గాళులు వ్రేళులు
మాట సొరము పాట నీటు గోటు
నొక్కపోల్కి నుండె నొక్కఁడే పే రని
తెలియుచుండె మీరు దేవతలరు. 10

వ. అనినం గుమారు లి ట్లనిరి. 11

ఉ. ఈపదునాల్గులోకముల కేర్పడుచుట్టము మమ్ముఁ గన్నవాఁ
డాపదలందు మాకుఁ బిలు పౌ నొకనాఁటికిఁ బాయ కెప్పుడున్
పాపము లేనివీఁటను నివాస మొనర్తుము మే మొకో ళ్కొక
ళ్ళైపదమందు నేని విడ కేగుచు నుందుము వేల్పుపంపునన్. 12

ఉ. దాఁపగ నేల వచ్చితిమి దైవముపంపున మాకుఁ జేయఁగాఁ
దోఁపనిరోగ మేజగతిఁ దోడ్పడ నుండదు నీవు రుగ్ణతన్
రూ పఱి యున్నవాఁడ వని రోయుచు వచ్చితి మిచ్చ నీరుజం
బాపి బహూకృతిం బడయువారమ యాదుము భూతిభూషణా. 13

తే. నావుడును శంకరుం డను దేవవైద్యు
లార! మిము నే నెఱుంగుదు మీరు నాకు
వైద్య మొనరింప వచ్చినవారె మీకు
మంచివైద్యము చేతఁ గా దంచు నెంతు. 14

సీ. అఖిలలోకాధీశుఁ డైనశంకరునకుఁ
గుత్తుకనలుపు వోఁ గొట్టి నారె

దేవాదిదేవతాభావితుం డగుశౌరి
వత్సముపై మచ్చ వాపి నారె
ముల్లోకముల నేలు మొనగాని మేనిపై
నాఁడుగురుల్ మాప నైన వారె
యఖిలకళాలయుం డయినజాబిల్లికి
క్షయరోగమును మాన్పఁ జాలి నారె
తే. అగ్ని కన్నిటఁ దినురోగ మాఁగి నారె
లచ్చి తిరుగుడుబుద్ధిఁ దొలంచి నారె
ద్వాదశాత్మునిసుతు వాట వైద్యపదము
మీ కొసంగిరి లేకున్న మీర లెవరు. 15

తే. అడవి గుజ్జములకుఁ బుట్టినట్టి మీరు
గుజ్జముల వైద్యమును నేర్చుకొంటి రేమొ
జన్మకర్మాత్త మానవజాతిరోగ
జాతమున్ మాన్పఁగలరె నాసత్యులార. 16

ఆ. ఏది మిమ్ముఁ బంచి రే మని వచ్చితి
రీదు చేతగానిదారి నడువఁ
బూనుకొందు రేటు బూమెలు చూపి పో
వచ్చినార యేమొ వలదు చనుఁడు. 17

క. అని తమ్ముఁ జెంద నాడిన
మునిముఖ్యునిఁ గాంచి కవలు మొగములు ముడుగన్
నినుఁ జేర్ప నైనమ మ్మి
ట్లనరాన ట్లనిననీకు ననుభవ మగుతిన్. 18

మత్త. దేవిపంపున వచ్చినారము దేవదేవుఁడ వంచు నీ
వీవిధంబున మమ్ము రోసితి వేము పోయి వచింతు మా

దేవి నిన్ దయఁ జూడఁ బోవదు దేహమర్ధము చేసి నీ
గౌరవం బిది సళ్ళఁ జేసెదుఁ గాని చూత మొ కింతలోన్. 19

సీ. బికిర మొత్తింతుము బిడియంబు వోఁ బున్కఁ
బట్టించి పల్లెలఁ బత్త్రనములఁ
దినిపింతుము విసంబు తను వెఱుంగక నేలఁ
బడి కొట్టుకొనునట్లు కడిమి చెడఁగఁ
గంతు వేయింతుము గంగెద్దు నెక్కించి
బాజాలు బాకాలు ప్రబల వెనుక
నిలువంగఁ బెట్టుదు మొలికిమిట్టి సతంబు
బూచులతోఁ దోలు మొలకుఁ జుట్టి

తే. మమ్ము మాశక్తి యెఱుఁగవు మాకు మూడు
మూర్తులకు మూలకంద మా మూర్తి తండ్రి
మూడు జగముల కాధారభూత యైన
♦ లోకమాత మహాశక్తి మాకు దోడు. 20

ఉ. వేయి నెలుంగులం గలుగు వేలుపుబిడ్డ లటన్న గౌరవం
బీయెడఁ జూప కిట్లు మము హీనులఁ జేసితి వక్కటా! నిను౯
♦ మాయెడ గాఱ నాంద్రకడ మానము వో తెయితక్కలాడఁగాఁ
జేయుదు మింతలో ననుచుఁ జెప్పఁగ నేటికిఁ నీవ చూతు వో 21

వ. అని పలికి యెల్లరుం జూచుచుండ నంతర్ధానంబు నొంది రంత వైద్యం బొల్లనిగురునిరోగంబు నివారించుపొంటె శిష్యులు వారోఁపినకొలంది శాంతులు గావింపం దొడంగి రప్పుడు. 22

సీ. మృత్యుంజయజపంబు మితి లేక జపియించెఁ
దోటకాచార్యుఁడు మేటిభక్తి

.................................................................

♦ లోకమాత = ఇట గాయత్రీమహాదేవి యని యర్థము; ఎడరు = భంగము;

♦ ఆండ్రకడ = తెయితక్కలు = ఇటసాయంకాలశివనృత్య మర్థము;

సూర్యనమస్కృతుల్ సుమనస్కుఁడై చేసెఁ
గరతలామలకుండు విరతిఁ గొనక
ధన్వంతరిధ్యానతంత్రంబు సాఁగించె
శిష్యదాత్ముండు సుశేష్యుండు
శీతలాదేవతాపూతమంత్రజపంబుఁ
జేసె నెంతయుఁ జిద్విలాసమూర్తి
తే. పద్మపాదుఁడు బాలను బ్రస్తుతించెఁ
దక్కునుంగలవారు సుదర్శనమను
జపము శ్యామలాజపమును సలిపి రట్లు
సాయుగోగము గురునకుఁ బాయుపొందె. 23

వ. ఇట్లు జపతపస్స్వాధ్యాయాదులం జేసె గురునకు శాంతియు సభ నయగుప్తన కశాంతియుం గలిగె. నప్పు డొకనాఁటి సాయం సమయంబున గంగానదికిం జని స్నానాదులు గావించి గురుశిష్యు లొక్కచో విశ్రాంతి నొందుచుండి రప్పుడు.

—• శంకరునకు గౌడపాదులు దర్శన మిచ్చుట •—

సీ. బరమ సంధ్యారాగసంభ్రాంతి గలిగించు
పల్లవారుణజటాపటలి దనర
నీలనీరదకాంతి నెఱిమీఱునల్లని
దేహకాంతులఁ గడల్ తేజరిల్ల
సంఫుల్లరాజీవసదృశమై పెరకేల
శ్వేతకమండలు రీతి మెఱయ
నల్లతుమ్మెదపంక్తి నాఁ గేళ్ళవాఱు రు
ద్రాక్షమాలిక వ్రేళ్ళఁ గ్రాలుచుండ
తే. నాల్కనారాయణస్మరణమున మెదల
మలయమారుతపోతము మలసి కొలువఁ

భావలం బొక్కటోని గౌడపాదయోగి
వచ్చె గోవిందగురువరుఁ డిచ్చఁజేసి. 25

క. తనపరమగురువు వచ్చినఁ
గని తా నెదు రేగి వడిగఁ గడుభక్తిమెయిన్
మునిపాదపద్మయుగ్మం
బున శంకరమూర్తి వ్రాలె మొగి దండము నాన్. 26

వ. అట్లు వందనంబు గావించి తెచ్చి యొక్కచిత్రాసనంబున నాశీనుం
గావించినంత గౌడపాదుండు శంకరుం గాంచి యి ట్లనియె. 27

చ. పరమగురుండ నేను నినుఁ బల్వురు చెప్పఁగ వించు నెంచుచుం
మురియుచు నిట్లు వచ్చితిని మోదము మూదల చేసి తెల్పుచున్
ధరపయి నీ వొనర్చిన యుదారము లైనమహోత్తమక్రియల్
వరుస వచింపఁగా వి నెడువాంఛ మనంబున సందడింపఁగన్. 28

ఉ. వేఁగురు చేయలేనిపని విశ్వ మిదంతయుఁ దల్లకిందులై
పోఁగలకర్జముల్ గలుగఁ బోయినయప్పు డొకండ నీవు నీ
భాగవత ప్రభావమునఁ బ్రస్తుతి కెక్కఁగఁ జేసితట్టె నీ
త్యాగము దీక్షయున్ మహిమ మద్భుత మంచు వచింప వచ్చెడిన్. 29

తే. వసుధయంతయు బౌద్ధచార్వాక జైన
మతసమాక్రాంతమై వేదమతము వోవు
నపుడు వేఁగురు విమతవిద్యాధిపతుల
సకలవిద్యల నోడించి తట్టె వత్స! 30

ఉ. అందఱు నొక్కయెత్తు జగమం దలమండనుఁ డొక్కయెత్తు నీ
ముం దతఁ డొక్కచీఁటికిని బోలనివాఁ డయి పొల్లవోయె నం
చందలివారు తెల్ప విని హాయని మెచ్చుచు వచ్చి నిన్ను గో
విందునితోడఁ జెప్పుకొని విందులు గుడ్చితి మోయిశంకరా. 31

తే. తండ్రి నీ వుదయించినదాన వేద
మతము వేదము శాస్త్రముల్ మహితలమున
నుద్ధరింపఁగఁ బడియె లేకున్న నింత
లోన నాశనమును కయి పోను గాదె. 32

వ. అని ప్రశిష్యు ననేకవిధంబులం బొగడుచు నాతనిసూత్రభాష్యముం దెప్పించియామూలాగ్రంబుగం జదివి పీ పప్పళించుచు ని ప్పనియె. 33

ఉ. వ్యాసుని మెచ్చుకోఁ దగునొ వ్యాసునిలోఁ గలభావ మెల్ల స
ద్వ్యాసము చేసినట్టినిను నవ్వారె యంచు నుతింప నొప్పనో
వ్రాసిననీవు చెప్పవలె వ్యాసుఁడు చెప్పనలె న్మహామహుల్
బాస యొనర్చి చెప్పవలె లాతులు చెప్పఁగఁ జాలి యుందు రే. 34

వ అని ప్రశంసించుచు నీకు నీగ్రంథంబునకు నెప్పటికిని ముప్పులే దని చెప్పి తిరోహితుం డయ్యె నయ్యవసరంబునఁ గొక్కురొ కో యని కోడి కూసిన విని శంకరుండు నిజశిష్యులుం దానును గంగ నాడి నిత్యకృత్యంబులు దీర్చుకొని యున్నంత. 35

— శంకరుఁడు కాశ్మీరమున కరిగి విజయంబు గాంచుట —

సీ. జగతిఁ గాశ్మీరదేశము చెప్ప నొప్పు నా
దేశమునఁ జగద్వినుత మగుచు
శారదాలయ మొండు చను దానికి న్నాల్గు
దెసల ద్వారంబులు తెలియ వచ్చు
నందు మండపములసందున నొక్కమ
హాపీఠము దలిర్చు నతిశయిల్లి
దానిపైఁ నెక్క విద్వాంసులకేఁ గాని
యితరుల కవకాశ మింత లేదు

తే. దానిపై నధిష్ఠించినమానవుండె
విశ్వపండితుఁ డనుచు నభిఖ్యఁ గాంచు

ననుచు విని వార్త నట కేగ మన మొనర్చె
శంకరాచార్యవర్యుఁ డాసమయమందు. 36

వ. అంత నంతేవాసులం గూడి పరివ్రాజకాచార్యవర్యుండు పయనంబై కతిపయప్రయాణంబులఁ గాశ్మీరంబులం గలశారదాపీఠంబుకడ కేగి దక్షిణద్వారంబు తెఱచి లోనికరుగుచుండ నెందఱో మహాపండితు లాతని నాఁగి చతుర్దశవిద్యలందును నానావిధధర్మంబులందును వాదోపవాదంబులు గావించి పరీక్షించి నీవు లోకైకపండితుండవు పో వచ్చు ననిన నతండు లోనికిం బోయి దేవికి నమస్కరించి యున్నయప్పుడు. 37

ఉ. నీవు సమస్తవిద్యల నెఱింగినవాఁడవు పండితుండ వౌ
దావల నీప్రవర్తనమునం దెదియే ననుమాన ముండిన
న్నీవల నీప్రచారమున నేర్పడ వచ్చెఁ బరాంబుజాక్షితోఁ
బూవిలుకానిశాస్త్రమునఁ బోహణచేసితి వట్టె వాదముల్. 38

క. నీదగుత్రికరణశుద్ధికి
నీదెస నగు నిద్ది యొక్కఁడే మచ్చ యగున్
గా దనుచుఁ బీఠ మెక్కఁగ
రా దని యశరీరవాక్కు రా నాతండున్. 39

ఆ. అరసి పలుకు నాదు నవతారమునఁ ద్రస
రేణుమాత్ర తప్పు రేలు పవలు
చంద్రసూర్యు లెఱిఁగి చాఁటి చెప్పఁగ నుండ్రు
కాని చెప్పుచుంటిఁ గలిగి నంత. 40

ఉ. కాదన కాసరస్వతియె గార్గిముఖాంగన లెంద ఱెందఱో
వాదు పొనర్పఁ బూరుషులపట్ల మెలంగుటఁ జెప్పఁ జెప్పినన్
గా దని నేను వెన్కగుదు గా నడయాడితి నాడునంతలో
నాఁడెన నానసిష్టత ఘనం బయి తోఁపఁగ వచ్చె వచ్చినన్. 41

తే. వ్యాసజై మిను లట నుండి వారిజాక్షి
కాదు భారతి యీమె యోఘనయశుండ
నీమెతో వాద మొనరింప నేమితప్పు
చేసినాఁడవు కా వని చెప్పి రపుడు. 42

ఆ. తల్లిఁ గాఁగ నామెఁ దలఁచుచు నమ్మూర్తి
శృంగగిరిఁ బ్రతిష్ఠ చేసినాఁడ
నీకు నామె కింత లేకుండు భేదము
ని న్నెఱింగి కొలువ నున్నవాఁడ. 43

క. నా దేవి యనియె శుద్ధుఁడ
వో దేవవరేణ్య! పండితోత్తమ! నీవీ
భూదేవార్చితపీఠము
నాదగునాదేశమునఁ గొనం జను మింకన్. 44

ఆ. ఎఱిఁగి యెఱిఁగి యిట్టు లెఱుఁగనియట్టులై
ప్రశ్న చేసితి నిటు భారతి యన
నేను గాదె వాద పరానపు డీ ట్లు
లుంటో నే నెఱుంగ కుంటినోటు. 45

ఆ. మారుకళలలోన మాఱుపుంతలు నేను
త్రొక్కి మాఱుదారి కెక్కుచుండ
నట్లు కా దటంచు నగురీతులం బ్రవ
ర్తించి తెంత లెంత లెంచు నట్లు. 46

వ. సర్వజ్ఞశేఖరా! నీవీవిద్యాపీఠం బధిష్ఠించి పట్టభద్రుండవై వేదశాస్త్ర
పరిపాలనంబు గావింపు మింతలో నీకుఁ బరమపదప్రాప్తి యగునని.

మహాస్రగ్ధర.

అని యాజ్ఞాపింప నౌ నౌ ననుచు నఖిలలోకాధి నాథుండు విద్వ
ద్వినుతుం డాదేవిపాదద్వితయమునకు భక్తి న్నమస్కారపూర్వ

ప్రణతుల్ గావించి చుట్టున్ వలగొని ప్రణుతుల్ వర్ధిలం జేసి పూర్ణా
జ్ఞను గొంచు న్నిష్యవర్యు ల్సరసకుఁజని హ స్తంబులందీయఁ బేర్మిన్.

—• శంకరుండు శారదాపీఠ మధిష్ఠించి మతస్థాపనంబు గావించుట •—

తే. స్వర్ణసింహాసనం బెక్కి చామరములు
ఛత్రములు ఛాత్రవరు లేసి జయజయధ్వ
నులు వొనర్చుచుఁ జోఁపుదారులును సేవ
కులు నగుచు నయ్యతీశ్వరుఁ గొలిచి రపుడు. 49

ఉ. వాదపరాజితుల్ బుధులు వందులు మాగధు లట్టులై మహా
మోదముఁ గోడఁ జేతులను మోడ్చి జొహారు లొనర్చి భృత్యులై
శ్రీదయితుం డితం డనుచుఁ జేసి నుతుల్ నతు లెంతయేని మ
ర్యాద వొనర్చుచుం గొలిచి రాయతిలోకమహానుభావునిన్. 50

మ. జిన చార్వాక ముఖాన్యదుష్టమత సంస్నిగ్ధాంధకారావృతం
బును ఘోరం బగుభూతలంబునను సంపూర్ణ ప్రభాభ్రాజితా
ర్కుని చందంబున నుద్భవిల్లి విబుధుల్ గొండాడ దివ్యప్రభా
వనిరూఢిం జను శంకరప్రభువు దివ్యప్రాభనోపేతుఁడై. 51

వ. అట్లు శంకరుండు వేదమతరక్షణార్థం బెల్లజగంబును జయించి
స్వమతరక్షణార్థంబు శారదాసర్వజ్ఞ భద్రపీఠంబున నధిష్ఠించి. 52

సీ. ద్వారకాపురి శారదాపీఠమునఁ గరా
మలకుఁ బ్రతిష్ఠించి మహిమఁ గూర్చి
బదరికాపురి జ్యోతిరుదితపీఠంబునఁ
దోటకాచార్యుని దొడరి నిలిపి
పూరీజగన్నాథపురిని గోవర్ధన
మఠమునను సునందు మహిమ నునిచి

శృంగగిరిపురిని శ్రీపీఠమున సురే
శ్వరు నధిపతిఁ జేసి గరిమఁ జేర్చి
తే. మఱియుఁ గొందఱ శిష్యుల మహీతలమున
నందు నందుఁ గుమతములు పొందుపడక
యుండ నద్వైతమును బోధించుచుండునట్లు
స్థాపన మొనర్చె శంకరాచార్యుఁ డపుడు. 53
శా. కాంచీపట్టణరాజమం దపుడు శ్రీకామాక్షినిం గామకో
ట్యంచత్పీఠమునందు నిల్పి సిరిచక్ర శ్రేయగా దక్షు ము
న్నించెం గావున వానికి న్మహిమ మెంతో వింతగాఁ గూర్చి ని
ర్మించెన్ శాశ్వతపోషణార్థవసతుల్ పృథ్వీంద్రమూల్యంబునన్. 54
తే. నాకుఁ బ్రేముడి యుగ్గలం బౌకడ నగు
నరయఁ గాలాంతరంబున నవతరింతు
నింద్రచంద్రాదినామము లేకముఖము
నొంద భక్తులఁ బాలించునుల్లమునను. 55
వ. అని సర్వజనసమక్షంబునం బలికి మతసంరక్షణంబునకు వలయు కార్యంబు లన్నియు నెరవేర్చి సహశిష్యుండై యటనుండి బదరికారణ్యంబునకుం జని యటఁ గొన్నినాళ్ళుండి యటనుండి కేదారంబునకు నిర్గమించె నదియును. 56

—శంకరుఁడు కేదారంబున కరుగుట—

మ. హిమ మేనాఁబడునీళ్ళలోన నరుణుం డేతెంచు నన స్నాడుటల్
శ్రమసంధాయక మంచు శిష్యుల కటన్ సాక్షాచ్ఛివుం డుల్లసం
ఉమిచంద్రుండు మహేశ్వరు న్మనమునం బ్రార్థించె నద్దాన నం
దమరెం గోష్ణజలాశయం బది త్రికాలాత్యంతసౌఖ్యాంకమై. 57
వ. ఇట్లు కావించి శంకరుండు శంకాతంకములు లేక కేదారంబున నుండి కేదారేశ్వరు సేవించుచుఁ గొన్నినాళ్ళకొక్కనాఁడు పద్మపాదుం బిలిచి యి ట్లనియెం. 58

మ. మన మానాఁడలవారణాసిపురిలో మధ్యాహ్నకాలంబునన్
ఘనభాష్యశ్రవణంబు సేయుతఱి వేడ్కం జేసి వ్యాసుండు చె
ప్పినమాటల్ వినియున్నవాఁడవు కదా విజ్ఞానమం దుండెనో
కనుఁగో నిప్పటి కెన్నివర్షములు పోకాడెం గదే పోల్చితే. 59

మ. పదియాఱేడులు నాఁటి కిప్పటికిఁ జెప్పన్ సౌరమానంబునం
బదియాఱేడులు దాఁట వచ్చెడిని నిర్మాణంబునం బూర్ణమై
నది నావచ్చినకార్య మెన్నఁగ జయానందంబు సంధించెఁ బో
వెద నింకం గలభార మంతయును నీదే సుమ్మి * పద్మాపతీ! 60

— శంకరుని చరమ దశావిశేషములు —

వ. ఇట్లు వీ రిక్కడ సంభాషించుకొనుచున్న సమయంబున నక్కడ
కైలాసంబునఁ బార్వతీదేవి జయావిజయుల రావించి. 61

మ. ఇట నున్నట్టులు పోయివచ్చెదను సాధ్వీ! నన్నుఁ బోఁ జెప్పు మి
ప్పటికార్యం బది చెప్ప నొప్పినది నావం తద్ది నేఁ బోక త
ప్పట లే దంచు వచించి వల్లభుఁడు నన్ బోకాడి పో నయ్యె ని
ప్పటికిన్ రాఁ డిది యేమియో తెలియ దేపద్మాంఘ్రిపా లయ్యెనో.

ఉ. భారతి వచ్చి యీనడుమ బల్కెను వింటిరి కాదె యామె వా
గ్ధోరణి బ్రహ్మపీఠమునఁ గోరికఁ గూరుచునుండి కూచిమా
రీతశాస్త్రమందుఁ బరమేష్టత హావము వెల్లడించుచున్
ధీరులు మెచ్చ వాదము ప్రతిష్ఠ యొనర్చుట లీ రెఱుంగరే. 63

క. భూమికిఁ జేనెడుమాత్రమె
యై మోహనమూర్తి యగుచు హర్వొందు నటం
చామె వచించినమాటలు
నామది శోకవిధమ యగుచు నలు వఱఁ జేసెన్. 64

---

* పద్మాపతి యన విష్ణువు. ఇతఁడు విష్ణ్వవతారమే కావున నిట్లు ప్రయుక్తము;

వ. అనిన విని విజయ యిట్లనియె. 65

ఉ. భారతిమాట లన్నియును బల్కఁగ నల్కఁడు వానిఁజూచ నే
పూరుషునైన మోహమున ముంచెడుఁ గాని యతం డొ నిర్గమ
శ్రోత్రియతరప్రకారము మహోత్తరసత్వము నిర్వికారమున్
వేరికి నద్భుతంబు ప్రభవింపఁగఁ జేయకయుండ డెం చనే. 66

ఉ. నా నగజాత యిట్లను వినంబడె నట్టులు కాని నెచ్చెలీ
వీనుల విందుగా వినవా వేరును జెప్పరొ నీకు శైశవం
బైన తెఱుంగు లట్టి లివు డొ నన రాను విలాసవాక్యసే
యా నవతారంభేదముల నట్టులు నట్టు మెలంగ నయ్యెడిన్. 67

వ. అని జయం గాంచి నీవు పోయి బ్రహ్మవిష్ణ్వింద్రాదులం దోడికొని
రమ్మనిన నామె యట్ల నని పోయి వచ్చె నంతలో వచ్చిన
విష్ణ్వాదులం గాంచి హైమవతి యిట్లనియె. 68

శా. మీరు న్నీరు సుఖంబుగా సఖులతో మేలంబులం దేలుచున్
స్మేరాస్యంబులఁ గ్రాలుచున్ నగభిల్లక్ స్వేచ్ఛావిహారాదులన్
గారాబంబుల నుంద్రు గాక పెరలే కష్టాలపాలైన మీ
కారాటం బెఱులుంపు శంకరుఁడు బోళా! దేసికే నా ననున్. 69

చ. ఒక తెను నన్నుఁ గొండకడ నుండఁగ జేసి గమించెఁ దా సరో
సుకలుఁడు చంద్రశేఖరుఁడు సూరెల నుండియుఁ జూడ రీసు వే
రికి నగుకష్టి వే రెన రెఱింగికొనం దలపోయుచుండు మీ
కిఁక శివ పూంత పొం డునికి కే నిదె పోయెదఁ దేర దేవరన్. 70

వ. అనిన నింద్రాదులు గడగడ వడంకుచున్న తఱి దరియవచ్చి చేతులు
జోడించుకొని పీతాంబరుం డిట్లనియె. 71

చ పుడమి నొనర్ప గానయినవున్న పుఁగార్యము నేను పీ ర్మరో
కఁడును బొనర్ప శక్తులము గా మని భావను గోరి వేఁడి పం

పెడు పనిచేసినామా నెఱవేఱెను గార్యము లేపా మాపా వ
చ్చెడు నని చెప్పుచుంటిమి ప్రసన్నవు గమ్ము సహోదరీమణీ. 72

ఉ. గాలియుఁ గీలి హేళియును గాలము కర్మము కాచి వేచి యే
వేళను భూమిపైఁ గలుగువింత లెఱింగి వచించుచున్న వా
రోలలితా! కనుంగొనల నొందఁగ నీకుము కెంపు డాసు లీ
వేలుపు లోమ వమ్మ! మము విశ్వవిభుం డరుదెంచు నింతలోఁ.

వ. అని యూరడం బలికి వారు వారివారిపొందుపట్లకుం జని రంత
నక్కడ శంకరుం డేకాంతస్థలంబున దర్భాసనాసీనుండై కన్నులు
మూసికొని యోగానుసంధానంబు గావించుచుఁ బలవరింతలు గా
నోపద్మపాదా! 74

సీ. కైలాసముననుండి కంజజేంద్రాదులు
వరసిద్ధమును లిదె వచ్చినారు
నూఱులు వేలును నూఱువేలు విమాన
ములు వచ్చి నింగిపై నిలిచి యుండెఁ
బ్రమథగణంబులు పారిషదుల్ గూడి
గుంపులై నేలపైఁ గూడి కొనిరి
నందికేశ్వరుఁడు నానందించుచున్ గంగి
రె ద్దయి వచ్చి నాయొద్ద నుండె

తే. జయయు విజయయు నిరుచక్కిఁ జనఁగ గౌరి
నింగిపై నుండి నావంకఁ దొంగి తొంగి
యరయుచున్నది నే నిదే యర్చిరాది
మార్గమునఁ బోవుచుంటిని మంట నగుచు. 75

వ. అనుచు నోంకారంబు నంటివచ్చుపలుకులు పలుకుచుండ మండుచు
భౌతిక దేహంబు మహాభూతంబులతోడం గూడి మింటిమొంగంబు
పట్టె నట్టియెడ. 76

చ. ఇటు నిటు రమ్ము రమ్ము పరమేశ్వర ! విశ్వవిమాన మిద్ది యి
చ్చోట నగు నందికేశ్వరుఁడు సూర్యుఁడు చంద్రుఁడు వహ్ని కన్నులై
నటు లగపట్టుచున్ మొగమునందు వెలింగి మెలంగుచుండి రు
ద్భటము త్రిశూల మద్ది కయిదండగ నుండగ వచ్చె నిచ్చమై. 77

వ. అను దేవవాక్యంబు లంతరాళంబున వినవచ్చెనంత. 78

— శ్రీ శంకరుఁడు శంకరుండై విష్ణ్వాదులతోఁ ప్రశంసింపుట —

తే. ఆర్యకును శివగురువున కాత్మజుండు
చదివి వేదముల్ శాస్త్రముల్ సభ్యసించి
దిగ్జయము చేసి శంకరదేశికుండ
ననుకొనెడు తా నొకింతలో సభవుఁ డయ్యె. 79

సీ. గంగతో సంగతి గలుగ నెత్తిని జంద్ర
కళతో జటాజూటమలుము కొనఁగ
సూర్యచంద్రాగ్నుల సొంపొందఁ గలమూఁడు
కన్నులు మొగమునఁ జెన్నుమీఱ
నేణాజినం బది యాక్షించుచుండఁగా
శార్దూలచర్మమై సౌరుమీఱ
బాహుదండంబుల బరిఘవిక్లైదు వేణు
దండము శూలమై తవిలి మెఱయ

తే. సామమే నంతఁ గాంతయై గోము సూప
బ్రహ్మవిష్ణ్వాదిదేవతల్ ప్రస్తుతింప
స్వామిశంకరుఁ డప్పుడు శంకరుఁ డయి
సర్వలోకశంకరుఁ డయి సౌరుమీఱె. 80

వ. అంతలోన. 81

సీ. నడుమ నున్నత మయి నలువొందు గద్దెపై
సాంబుఁడై యాసీనుఁ డయ్యె శంభుఁ

డుభయపార్శ్వములందు నురుపీఠములఁ గూరు
చుండిరి హరి విధాతృం డడఁకువ
నించుక వెనుచక్కి నెసఁగుపీఠంబుల
నింద్రబృహస్పతు లెసక మెసఁగి
రెదుటి పక్కల నున్న సదమలాసనములఁ
గూరుచుండ్రి గణేశుకుమారు లెలమి

తే. మఱియు నందందు వ్యాసాదిపరమమునులు
నారదాదులు గరుడగంధర్వముఖులు
పుణ్యపురుషులు నచ్చరల్ భూపతులును
నొదిగి కూర్చుండి రపుడు పేరోలగమున. 82

క. ఇరువదియొక్కఁడు మాఱులు
పరువడి మ్రోసెన్ శతఘ్ని భయభక్తులతో
వరసభ నిశ్శబ్దముగా
నరయం దగె నపుడు వింజ మూఁ కిడిన గతిన్. 83

వ. అప్పు డప్పరమశివుండు పుండరీకాక్షు నిరీక్షించుచు ని ట్లనియె. 84

చ. ఎఱిఁగినవాఁడ వబ్బుర మొకింతయు నీ కన రాదు గాని య
ద్ధరణితలంబుఁ జూడఁగ ముదం బగు దెంచెదు నేండ్లుఁ గొండలున్
సిరియును సంపద ల్గనినఁ జిత్తము మెత్తన కయ్యెడుం జుమీ
సురవరుణాదిలోకములు సొంపొడఁగూడవు దానిముందరన్. 85

ఉ. అందుఁ ద్రిలింగదేశ మగు నద్ది సమస్తజగన్నుతోన్నతా
నందకరప్రదేశముల నల్వాయి యుండెడు సస్యసంపదన్
సుందరమందిరంబులును సూరివరేణ్యులు సర్వవిద్యలున్
కందొవపండు వయ్యెడిని గన్గొనినంతన యోముదాంతకా. 86

తే. ఎప్పుడు న న్విడనాడక యీవు నాకు
సలిపి సలుపుచునుండినసాయ మసదె?
ఖలుఁడు చార్వాకుపట్ల నీసలిపినట్టి
ఘోరకార్యము వర్ణ్య మోనారసింహ! 87

వ. అనిన నాతండు లేచి చేతులు జోడించుకొని. 88

శ్లో. మహామహానీశ్చేతో౽మలకమలహంసో రుచిరస
చ్చిదానందాకార స్సదసదపరో లోకజనకః
మహా త్మాద్వైతాత్మా పరమపురుష శ్శాశ్వతతనుః
పరబ్రహ్మాశో మా మవతు శివతాతిః కరుణయా. 89

శ్లో. సహస్రైః పాతాలం పదసరసిజై స్సత్యమపరై
శ్శిరోభి ర్వ్యాకీర్ణ శ్శతదశమహా౽తిమహాతః
మహీయా న్దిగ్వ్యాసః కలదఖిలవిశ్వం వితనుతే
పరబ్రహ్మాశో మా మవతు శివతాతిః కరుణయా. 90

శ్లో. ప్రపంచాతీతాం యన్మహిమసరణీం దృష్టిపతితా
మ పీశః కో నేదం ప్రకృతికలితం సర్వ మితి యం
నిరాకారం ద్రష్టుం బత విముఖతాం యాంతి పిశునాః
పరబ్రహ్మాశో మా మవతు శివతాతిః కరుణయా. 91

వ. అని నుతించునతని నతిగౌరవంబున నాదరించుచుం గూరుచుండం
జెప్పి యప్పు డప్పరిసరంబున నున్నకుమారుం దిలకించి శంకరుండు.

మ. నిను నేఁ బుచ్చినదానికిం దగునటుల్ నీపొందితీగౌరవం
బును జూపించుచు నెల్లదుర్మతములన్ భోకారంగాఁ జేసి తిం
ద్రునిసాహాయ్యము నీకనంత మెయి సంతోషించు న ట్లబ్బె నీ
వనలంబుం జోరఁబాఱుటల్ గనిన హాహాకార మద్యోం బాయి.

---

* ఇందు విష్ణ్వంశభవుఁడైనపద్మపాదుఁడు నృసింహాంశుఁడై చార్వాకుని సంహ
రించినకథ సూచితము; * ఇట నింద్రుం డనఁగా సుధన్వుఁడను రాజేంద్రుఁడని;

వ. అని ప్రశంసించి భారతిదిక్కు మొగంబై. 94

శా. తల్లీ! భారతి! శాస్త్రవాదముల నేతన్మాత్రుఁడై యుండె నేఁ
డెల్లుం గాని చరింపఁగాఁ గలఁడె నీధీరత్వ మగ్గింపఁగాఁ
జెల్లుం దెళ్ళితి వహ్నిలోఁ బడి పతిం జేరంగనై తమ్మ నా
కెల్లన్ సాయము నీవకాని యెరు లేరీ భూప్రచారంబునన్. 95

వ. అంత దవ్వులం గూరుచున్న వ్యాసభగవానునిపై దృష్టి నిగిడించి చెయి
సాచి పిలిచి వచ్చినవానిం దగ్గరకుఁ జేర్చి కొని తనపరిక్క నర్ధాస
సంబునం గూరుచుండం బెట్టుకొని వీ పప్పళించుచు. 96

సీ. ఈసృష్టిఁ గాని యిం కేసృష్టినేఁ గాని
పుట్టెనే నినుఁ బోలునట్టి దేహి
పుడమిపైఁ బడినది మొదలుగా జపతప
స్స్వాధ్యాయములు తప్పఁ జనునె యొకఁడు
వేనికిఁ సాధ్యముల్ కాని వేదంబులు
విభజించితివి జగద్వేద్యములుగఁ
బదియు నెన్మది గాక పదియు నెన్మిది పురా
ణములు నిర్మించితి నయ మెసంగఁ
తే. బంచ మామ్నాయ మన నైన భారతమ్ము
నర్వ దగులక్షలుగఁ జేసి యఖిలలోక
ముల కొసంగినవాఁడ వో మునికులాగ్ర
గణ్య! ని న్నెన్న సామాన్యకార్య మొకో. 97

తే. ఉపనిషదుపప్రైపమై తత్త్వ మొకో యనంగ
నై పరబ్రహ్మమై సముం డైనశుకునిఁ
గన్నవాఁడవు నీ కన్నగణ్యుఁ డెవఁడు
సన్నుతింపఁగ వచ్చెడు సంయమీంద్ర. 98

శా. నీవే బ్రహ్మవా? బ్రహ్మ వేత్తవా? నుడి న్నిర్ణీతముం జేయఁగా
నేవా రుండరు నిశ్చయం బవును గానీ బ్రహ్మసూత్రంబు లే
చేవం గల్గి రచించినాఁడవొకో తచ్ఛ్రేష్ఠత్వముం జెప్పఁగా
నీవే కాని మఱొక్కఁ డుండఁ డనుచున్ నే నొక్క వాక్రుచ్చెదన్. 99

ద్విపదము. నీ బ్రహ్మసూత్రముల్ నేను బఠించి
యబ్రంబుగా భాష్య మల్లి యద్దాన
సద్ధాత్రి విజయంబు లంది యద్వైత
ముద్ధరించినవాఁడ సోమునిచంద్ర!
యీ విజయము నీదియే కాని నాది
కావుట కెద్దియుం గాసంగ రాదు. 100

మ. పదియాఱేం డ్లన నైనయాయువునకుం బై నన్నియే ల్గిచ్చి నే
నెది యే దెప్పుడు నెప్డు చేయఁ దగునో యేర్పాటు గావించి నా
పద మెల్లం గనిపట్టుచు న్విజయముం బ్రాపించుసంయోగముల్
కుదరం జేసినవాఁడ వీవ కద నిన్ గొండాడ సామాన్యమే. 101

వ. అని ప్రస్తుతించుచు నారదాదుల నభినందించుచు సభాసదుల
కామంత్రణంబు పలికి లేచ సంతలో సభ్యు లెల్లరు లేచి చేతులు
జోడించుకొని నిలిచి రపుడు వ్యాసభగవానుఁడు చేతులు జోడించు
కొని యుచ్చైస్స్వరంబున. 102

— మంగళాశాసనము —

కల్పవల్లీవృత్తము.

జయ సోమ! నమో జయ రుద్ర! నమో
జయజయ పశుపతి! దేవ! నమో
జయ తామ్ర! నమో జయ శంగ! నమో
జయజయ ఖిలసముద్యుగ్ర! నమః

జయ భీమ! నమో జయ శర్వ! నమో
జయజయ శివతరశీల! నమో
జయ దేవ! నమో జయభర్గ! నమో
జయజయ మునివరపాల! నమః. 103

మంగళ మఖిలేశా! శుభమంగళ మఖిలేశా!
గురుతరదురిత వినాశా! శ్రీశా! జయమం.
పరమపురుష! విగతకలుష! పావనగుణభూషా!
వర-భక్తజనాధికపోషా! బహువేషా! సువిశేషా! మంగళ. 104

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః

ఆ శ్వా సా ం త ము

మ. కలికిం బంచసహస్రవర్షములపైఁగా నేఁబదైదైన య
ప్లైలమిం గాంచుజయాబ్దమందుఁ గవిరాట్కృష్ణుండు కృష్ణాష్టమిన్
వెలయం జేసి జగద్గురూత్తమకృతిన్ శ్రీసత్య నారాయణో
జ్జ్వలవిద్వత్కవి కిచ్చె నంకితముగా శ్వశ్శ్రేయసం బెంచుచున్. 105

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతం బైన జగద్గురు చరిత్రమున
సర్వంబును
షష్ఠాశ్వాసము
శ్రీశ్రీశ్రీ

